## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కామము, ప్రేమ, పరివారము

ప్రశ్నలు:

శ్రీమతి సుశీలా అగ్రవాల్

ప్రాధ్యాపిక:

(ఇంద్రప్రస్థ కాలేజి, ఢిల్లీ)

జవాబులు:

శ్రీ జైనేంద్రకుమార్

అనువాదం:

శ్రీ పురాణం కుమార రాఘవశాస్త్రి





# ర చ యి త

జననం : 1905. ప్రారంభికవిద్యాప్రాప్తి. బ్రహ్మచర్యాశ్రమం— హస్తినాపురంలో (1911-18). ప్రైవేటు మెట్రిక్ 1919. కాశీ విశ్వవిద్యాలయంలో—1919-1920. సహాయ నిరాకరణోద్యమంలో కాలేజీ పరిత్యాగం—1921. ప్రథమ కారాగారవాసం-1924. పునః కారాగారవాసాలు-1930-1932. ఆతరువాత నిరుద్యోగం. తనను తాను శాశ్వత నిరుద్యోగినని చెప్పుకొనేవారు.

మొదటి కథలసంపుటి 'ఫాంసీ' [ఉరి] తో 1929 లో సాహిత్య రంగంలో అడుగుపెట్టారు. మొదటి నవల 'పరఖ్' ప్రచురణ—1930 మొదటి తాత్త్విక గ్రంథం 'జైనేంద్రుని అభిప్రాయాలు'—ప్రచురణ 1937. సాహిత్యరంగంలో ఈయన ప్రవేశమువల్ల ఉద్భవించిన కలకలాన్ని గురించి కతిపయ విజ్ఞుల ఈ ఉద్ఘాటనవల్ల ఊహించవచ్చు—

"....నువ్వు గోర్కీ కాగోరుతున్నావా? భారత దేశంలో గోర్కీ కాగలిగినవారూ - అయినవారూ ఎవరైనా ఉన్నారా అంటే ఒక్క జైనేంద్రుడు మాత్రమే."

—ప్రేమ్‌చంద్.

"'జైనేంద్రుని అభిప్రాయాలు' చదువుతూ టాల్‌స్టాయ్ రచనలు చదువుతున్నంత—కాదు, ఇంకా చాల అధికంగా అనందానుభూతిని పొందాను నేను...."

—కిశోర్‌లాల్ మష్రూవాలా.

"....హిందీ కథాసాహిత్య క్షేత్రంలో, ఇప్పుడు మనం రవీంద్రనాథ్, శరత్‌బాబులను జైనేంద్రునిలో ఒకేసారిగా పొందగలిగాము—తిరిగి పొందగలిగాము."

—మైథిలీశరణ గుప్త.

వికాసం, నిత్యజీవితంలో వీరి సత్యసంశోధన . మా పాఠకులకు అందజేయా లనే కాంక్షతో వీరి రచనలు తెలుగులో ప్రచురిస్తున్నాం. అనతికాలంలోనే వీరి మిగతారచనలుకూడా మీకు అందించగలమని సంతోషపూర్వకంగా తెలియజేస్తున్నాం. అయితే, వీరిరువురి రచనలపట్ల మా పాఠకుల అభిప్రా యాలుకూడా తెలుసుకోవాలని మాకు చాల కుతూహలంగా ఉంది. దయవుంచి పాఠకులందరూకూడా జైనేంద్రకుమార్ ఇలాచంద్రజోషీల రచనల యెడల తమకుకలిగిన అభిప్రాయాలను మాకు తప్పక తెలియజేయవలసినదిగా ప్రార్థన.

ఇట్లు,
తెలుగుభాషలో "జైనేంద్ర సాహిత్యము"నకు
సంబంధించిన సమస్తహక్కులు పొందిన
ప్రకాశకులు :
ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్,
విజయవాడ.

# ప్రస్తావన

జీవితంలో ప్రతిఒక్కరికీ ఒకానొకసమయం వస్తుంది—సమాజంతో తనకు గల సంబంధాన్ని, అందులో తనకున్న స్థానాన్ని విస్పష్టంగా తెలుసుకోవాలన్న ప్రబలమైన యిచ్ఛ పొడసూపేసమయం. 1947లో నేను ఢిల్లీ వచ్చినప్పుడు శ్రీ జైనేంద్రబాబుతో నాకు పరిచయం ఏర్పడింది. బహుశా అప్పుడు నామనసులోకూడ అటువంటిదే ఒక జిజ్ఞాస, వ్యాకులత కలిగి వుంటుంది. గంటలతరబడి నే నాయనముందు అవిరతంగా ప్రశ్నపరంపరలు అడుగసాగాను. అప్పటి నా ప్రయత్నమంతా నాలోని కుతూహలాన్ని శాంత పరచుకునేందుకే. కాని ఆ మా సంభాషణలకు మున్ముందు ఇంత మహత్తు వస్తుందని నేనప్పుడు ఊహించనైనాలేదు.

1949లో శ్రీ జైనేంద్రబాబు, వారి కుటుంబంతోపాటు నేనుకూడా పదిపన్నెండురోజులు, సుందరమైన వాతావరణంగల ఋషీకేశంలో వుండే అవకాశం లభించింది. అప్పుడు విశేషంగా అనేకరకములైన ప్రేమసమస్య లను గురించి చర్చలు జరిగాయి. కౌటుంబిక సామాజిక జీవనమునకు ప్రేమ ప్రవృత్తి ఆధారశిల. అందువల్ల అది అన్నింటికన్న ఎక్కువ మహత్వ పూర్ణమైనది. కాని మన సమాజం కేవలం వివాహసూత్రమందు బంధితమైన ప్రేమనుమాత్రమే అనుమతించి, ఇక తతిమ్మా అంశాలన్నింటినీ బహు తేలిగ్గా త్రోసిపారవేసింది. కాని ప్రేమవిషయికమైన చర్చగాని, వివేచనగాని అనవసరం అనీ, పైగా గర్హ్యంఅనీ భావింపబడుతున్నది. ఈ చిన్ని సూత్రం మాదిరిగానే జీవితంకూడా అలా తేలిగ్గా, సహజంగా సాగిపోతూవుంటే—అది వేరేవిషయం. కాని అది సహజంగాలేదు, జటిలంగా వుంటున్నది; అందువల్ల వివిధములైన సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. వాటిని గమనించకుండా....ప్రగతినికోరే సమాజం కన్నులు మూసుకుని వుండజాలదు.

అలా కన్నులు మూసుకున్నందుకు పరిణామంగానే మనం మన పరస్పర సంబంధాలను హార్దికభావపూర్వకంగా కొనసాగించుకోలేకపోతున్నాము. మన సంకుచితములైన అభిప్రాయాల్నీ, ఆలోచనలనూ పురస్కరించుకుని, మనతో సంపర్కంవుండే ఆ యీ వ్యక్తులలోని జీవశక్తులను కించపరుస్తూ సమష్టిగతమైన అధోగతికి కారణభూతులమౌతున్నాము. జైనేంద్రబాబు చెప్పిన సమాధానాల్లో—అడుగడుగునా అత్యంతమహత్వపూర్ణములైన తత్వాలు బయటపడినవి. అవి మనకు సంపూర్ణమైన చింతనసామర్థ్యాన్ని ఇవ్వజాలినవి; సమాజానికి కనువిప్పు కలిగింపజాలినవి. సమాజానికి ఎంత గానో ఉపయోగింపజాలిన వారి సమాధానాలు మాయిరువురిమధ్యనే నిల్చి పోకుండా, వాటన్నిటినీ ఒకరూపంలో గుదిగుచ్చి విచారశీలురకు అందించ వలెననే కోరిక కలిగింది నాకు. ఆ ప్రయాసే చివరకు ఈ పుస్తకంగా రూపొందింది.

సంభాషణను లిపిబద్ధం చేయవలసివచ్చేసరికి కొన్ని సంప్రదాయాలను పాటించవలసివుంటుంది. ఈసంగతి పాఠకులు గుర్తించగలరు. స్వాభావిక ప్రవాహక్రమంలో ఒకానొకవిషయం కొద్దిలోనే బోధపడవచ్చు. కాని దాన్నే అవగతంచేసుకునేందుకుగాను చాలచాల ప్రశ్నలడగవలసివస్తుంది; ఎన్నో పేజీలు నిండుతాయి; విషయం విస్తృతమౌతుంది, వ్యాపిస్తుంది; ఒక్కొక్క ప్పుడు అసలువిషయాన్ని దాటిపోతున్నట్టుకూడా కనిపిస్తుంది. మధ్యమధ్య ప్రశ్నకర్తయొక్కగాని వక్తయొక్కగాని తాదాత్మ్యం చెదరిపోతున్నట్టు కనిపించవచ్చు. ఒకమహాప్రవాహప్రాయంగా సాగిపోతున్న సంభాషణ క్రమంలో అవరోధం తెచ్చి వ్రాస్తూకూర్చోనిచ్చిందికాదు....ఆసమయాన.... నా స్వార్థప్రవృత్తి. తత్ఫలితంగా కొంతవ్యవధి అయినతరువాత వ్రాయుటకు ప్రయత్నించినందువల్ల, పూర్వం ఉండిన కుతూహలం కొంత క్షీణించి నందువల్ల నా ప్రశ్నలు ప్రయత్నసాధ్యములైనాయి. సంభాషణక్రమంలో అక్కడక్కడ మాంద్యం గోచరించవచ్చు. సామగ్రికూడా యథేష్టంగా

సమకూడి యుండకపోవచ్చు. ఇంతకూ సారాంశం ఏమంటే—ఈ సంభాషణ ఒక ప్రవాహంలాగా, ఎంత క్రమబద్ధంగా ఉండవలెనని నేను మనసులో అనుకుంటున్నానో అటువంటిరూపంలో మీముందు ఉంచలేక పోతున్నాను. అందుకు పాఠకులు నన్ను క్షమించాలి.

ఈ మా సంభాషణలో శ్రీ జైనేంద్రజీ అంతర్‌దృష్టిని పూర్తిగా, ఉన్నది వున్నట్టుగా అవగతం చేసుకోవాలన్న ప్రయత్నంలో వీలైనంతవరకు అనేకములైన ప్రశ్నలు కురిపిస్తూ వెళ్ళాను. అయినాగానీ, చివరకు నా మనసుకు సమాధానం కుదిరిందనిగాని, పాఠకులకు కుదురగలదనిగాని నేను చెప్పజాలను. ఇదొక తాత్త్విక వివేచన. అయినా ఇది చదువుకుపోతూంటే విచారశీలుడైన పాఠకునికి అవశ్యం ఆనందమే కలుగుతుందని నేను ఆశిస్తున్నాను. మనందరకూ తన కథనముద్వారా ఆనందాన్ని చేకూర్చిన శ్రీ జైనేంద్రబాబుకు కృతజ్ఞులం కావలసిందే. ఆయన ఒక ఉపన్యాసంలో స్త్రీ యొక్క ఆదర్శాన్ని చక్కగా వివరించారు. అది ఉపయుక్తమైన విషయం కాబట్టి దాన్నే భూమికరూపంలో ఇక్కడ ఇస్తున్నాను.

ఇంద్రప్రస్థ కాలేజి,
ఢిల్లీ.
1—3—1953

సుశీలా అగ్రవాల్.

# భూమిక

మహిళల ఆదర్శాన్నిగురించిగాని, ఆదర్శమహిళనుగురించిగాని సూటిగా ఏమిచెప్పటానికీ నాకు కష్టమే. అదంతా ఒక చిత్రరూపంలో నేను మీకు ఇవ్వలేను. ఆదర్శాన్ని సమగ్రంగా ఎవరో ఒకరిలో బంధించి చూపటం ప్రమాదకరమైనపనేకూడా. ఏదో ఒక్కటిని మాత్రమే నమ్ముకునివుండటం జీవితంలో నాకింతవరకు సాధ్యంకాలేదు. ప్రతిచోటా ఏకొంచెమో వైలక్షి ణ్యం కనిపిస్తూనే ఉన్నది. అందువల్ల ఏమనిపిస్తుందంటే—ఆదర్శం అనేక రూపాలుకలది;దానికి బహుముఖాలు ఉన్నాయి;బహువర్ణాలు ఉన్నాయి. సౌంద ర్యమంతా ఒక్కచోటే కేంద్రీకృతమైఉండదు;ఒకచోట సౌందర్యాన్నితిలకించిన మన కన్నులు అక్కడే పరితృప్తంగా నిల్చివుండవు.ప్రతిచోటా దాని ఆభాస ఉంది; అయినా ఎక్కడి తళుకుబెళుకులు అక్కడివే; ఒకేరకంగా ఉండవు. కాగా ఆదర్శం కేంద్రితంకాదు; వ్యాప్తం. అది రూపరహితము, నిర్గుణము. నిరాకారమునకు ఆకారమునిచ్చుట, నిర్గుణమునకు గుణాలను సింగారించుట, మొత్తంమీద రూపంలేనిదాన్ని రూపవంతంగా ఆవిష్కరించుట అంత సుకర మైన పని కాదు. బహుశా ఆపని అవసరమైనదీ కాదు; కర్తలేకుండా జరిగేదికాదు.

ఆదర్శం అందుకోవాలంటే స్త్రీ నిర్గుణురాలు, రూపాతీతగా పరిణతి చెందుతూ పోవాలి. ఆమెపైన ఏదీ పేరుకోరాదు....నిలిచిపోరాదు. జలము చూడండి; ఏపాత్రలోవుంచేనా ఆరూపమే దానికి. సూర్యరశ్మి చూడండి; అందులో ప్రత్యేకంగా ఏరంగూ ఉన్నట్టు తోచదు; అయినా అన్నిరంగులూ అందులో వున్నాయి. ఏవాతావరణంలోనైనా ఆమె సమరస కాగలగాలి: కలిమిడిలేనట్టు కనిపించరాదు. అయినప్పటికీ తన వ్యక్తిత్వాన్ని ఎచ్చటనూ కోల్పోనవసరంలేదు. అవసరమైనపుడు చక్కగా మాటాడగలగాలి; కాని సమయంగుర్తించి అలాగే మౌనధారిణికావాలి. శాస్త్రకారులు రసాల్ని వేరు

వేరుగా విభజించారు. స్త్రీలో ఏరసమూ విడివడి వుండనక్కర్లేదు. అంటే- అసలు పుల్లదనమే పనికిరాదనీ, మొత్తం తియ్యగానే వుండాలనీ కాదు. ఉప్పు అవసరమయ్యేటంత పుల్లగా వుండాలనీకాదు. అవసరమైనంత నిష్పత్తిలో చేదుకూడా ఉండవలసిందే. ఇంకా ఘాటుతనాన్నికూడా పూర్తిగా నిషేధించటం నా అభిమతంకాదు. ఇవన్నీ కలిసి తయారైన రుచికరమగు వ్యంజనాన్నే నేను నిర్గుణం అంటాను. నిర్గుణం అంటే గుణహీనతకాదు; గుణాల సామంజస్యం అన్నమాట. అవి తగినపాళ్ళలో లేనప్పుడు గుణాలే అవగుణాలుగా కనిపిస్తాయి. కేవలం గుణాఢ్యయైన భార్యను భరించటం భర్తకు కష్టతరమనే నా భయం.

చక్కదనం అనే వస్తువు ఒకటి ఉంది. ఇది స్త్రీకి తప్పనిసరిగా ఉండితీరవలెనని భావిస్తున్నది లోకం. చక్కదనం అని దేన్ని అనవలెనో నాకు బోధపడటంలేదు. నిజానికి అది అవయవాల తయారీమీద ఆధారపడి వుండేదికాదు; దేహచ్ఛాయతోగాని, అలంకరణాలతోగాని దానికి సంబంధం లేదు. నేను చాలమంది రూపవతులనే చూచాను. కాని నేను చూచిన ఒక్క వెలుగుమాత్రం ఇన్నిసంవత్సరాలు గడిచినాకూడా నా స్మృతిపథాన్ని వీడకుండా ఉన్నది. కాని దానిని ఏవిధంగానూ 'చక్కదనం' అనే అక్షరాలలో వర్ణించేందుకు వీల్లేదు. రవిబాబు శాంతినికేతనంలోని సంగతి. ఇప్పటికి చాలసంవత్సరాలు గడిచాయి. భోజనంచేస్తున్నాం. విస్తరిమీదనుంచి దృష్టి ఎత్తినవాడిని ఎత్తినట్టు అలాగే విస్మితుడనై చూస్తూ ఉండిపోయాను. ఆమె ఒక ప్రౌఢవయస్కురాలు. భోజనం వడ్డిస్తూ వచ్చిన అతిథుల్ని సమాదరిస్తూ ఉన్నది. ఆమెలో ఏవిధమైన ప్రత్యేకవిశేషమూ లేదు. రంగు సామాన్యమే; రూపం సామాన్యమే; సామాన్య వస్త్రాలే ధరించింది. ఇంకా చెప్పాలంటే అవన్నీ సామాన్యస్థాయికన్నా తక్కువలోవే. కాని ఆమె ముఖంలో ఒకరకమైన నిశ్చలానందరేఖ, సౌహార్దభావమూ ద్యోతకమౌతున్నవి. ఆముఖం ఒక స్త్రీముఖంలాకాదు, దేవీముఖంలా కనిపించింది నా

కప్పుడు. ఆసమయంలో నిజంగా ఆమె మాత అన్నపూర్ణలా తోచింది. అందువల్లనే చెప్పాను: చక్కదనంఅనేది ఏమిటో నాకు తెలియదు అని. ఆతరువాత కొంతసేపటికామె ఎవరిమీదనో కోప్పడుతూవుండటంకూడా చూచాను. అప్పటి ఆమెతీరునుబట్టికూడా ఆమెలో అపరూపం ఏర్పడినట్టు నా కనిపించనేలేదు; అటువంటి అనుమానమే కలుగలేదసలు. ఎన్నో సంవత్సరాలక్రిందట నేను చూచిన ఆ రెండురూపాలూ నా నాకిప్పటికీ కళ్ళ యెదుట ప్రత్యక్షమౌతూఉంటాయి. 'చక్కదనం అంగాల్లో ఉండదు; అంతరంగాల్లో ఉంటుంది?' .......అనుకుంటూ ఉంటూ ఉంటాను.

స్త్రీయొక్క అదర్శానికీ, చక్కదనానికీ ఏవిధమైన సంబంధమూ ఉన్నట్టు నాకు తోచదు. ఆసంగతి చాలవరకు స్త్రీకే తెలియదు; అందువల్లనే మోసం తింటూవుంటుంది. అవయవాల్లో మిలమిలలాడే చక్కదనం, నిజంగా ఆలోచిస్తే ప్రకృతియొక్క మోసం. మాతృత్వం ఒక బాధ్యత. అది స్త్రీకి లభించేందుకుగాను చక్కదనం ఒక వ్యాజం. చక్కదనమే ఆమె స్వరూపం కాదు. ఆమె స్వరూపం సతీత్వం, మాతృత్వం. ఈ స్వరూపాన్ని గ్రహించని స్త్రీకి చక్కదనం వ్యంగ్యహేతువే ఔతుంది. అది ఆమెలో ప్రఫుల్లంకాదు; ఆమెకు అందాన్ని చేకూర్చలేదు. వయసు ముదిరినా నవీనురాలుగా కనిపించాలనుకోటం, తల్లి అయినతరువాత ఇంకా ప్రేమికావస్థ కోసం ప్రయాసపడటం — ఇవి స్త్రీత్వానికి శోభతెచ్చేవి కాదు; పైపెచ్చు జుగుప్సాకరములే అవుతాయి.

ఆదర్శాన్ని అందుకోవలెనంటే స్త్రీ ప్రప్రథమంగా చేయవలసిన పని: ఈశ్వరునితో తన్ను ముడిపెట్టుకోవాలి; అది అవసరం. తాను స్త్రీ. స్త్రీత్వమనే వరిధిని అతిక్రమించి ఆబైట తన జీవనసార్థకతను సాధించుకోవాలని హఠంచెయ్యకూడదు. పురుషునియొక్క పౌరుషంతో తాను స్పర్థపెట్టుకోరాదు. ఉన్నరూపంలోనే ఆ స్త్రీత్వాన్ని తనలో ధరించి కృతార్థతను

పొందాలి. సతీత్వం అంటే అదే అర్థం. ఇప్పుడు కెరియరిష్టు (careerist) అనే శబ్దం ఒకటి ఉంది. అది సతీత్వం అను పదంయొక్క అర్థాన్ని బాగా విశదంచేస్తుంది. 'కెరియరిజం'లో పురుషునితో పందెంఉంది; సతీత్వంలో పురుషునితో యోగం, సహయోగం ఉన్నాయి.

మనం సీతమ్మను ఆదర్శమూర్తినిగా పూజిస్తున్నాం. మర్యాదలు తెలిసిన పురుషోత్తముడు శ్రీరాముడు. ఆదర్శమహిళ మర్యాదలు సీతలో ఉన్నాయి. శ్రీరాముని ధర్మమే తన ధర్మం అనుకుని ఆమె తన్ను పూర్తిగా విసర్జించేసుకున్నది. భర్తకు తోడుగా వుండేందుకోసమే ఆమె కోరి వనవాసం వెళ్ళింది. అంతేకాదు; సమయంవచ్చినప్పుడు తోడు వీడిపోయేందుకుకూడా ఆమె అతిసహజంగా అరణ్యవాసాన్ని స్వీకరించింది. సమస్తమూ భర్తచేతులమీదుగానే తీసుకుంది; భర్త నిర్వహింపవలసిన ధర్మంలో ఎంత మాత్రం లోటు రానీయలేదు. భర్తను ఎన్నడు శంకించలేదు.

నా ఉద్దేశంలో స్త్రీకి పరమఆదర్శం సతీత్వమే. అందులో ఆమె తన స్వరూపాన్ని సంపూర్ణంగా స్వీకరించటం ఉంటుంది. మాతృత్వానికి విముఖమైన మరింకేదో స్త్రీకి కావాలనుకోటం పొరపాటు. మరింకేవిధమైన కోరికైనా వికారమే; అది స్త్రీయొక్క స్వరూపంకాదు; విరూపమే. ఆ స్వరూపసాధనమునే సతీత్వం అంటాం. భర్త అనే పేరుగల పురుషుడు కేవలం ఒక ఆలంబనప్రాయుడే; అంతే. ఇకపోతే సతీత్వం స్త్రీయొక్క స్వతంత్రసాధనే. ఈపద్ధతిద్వారానే స్త్రీ సమష్టిప్రాప్తికి యోగ్యురాలు ఔతుంది.

ఇక మరేస్వాతంత్ర్యమైనా స్త్రీకి మరీచికలాంటిదే. వట్టి భ్రమ. ఆర్థికస్వాతంత్ర్యం మొదలైనవాటివల్ల ఆమె జీవనసార్థకతను పొందజాలదు. గృహిణీధర్మమందే ఆమెకు సముచితమైన పరితృప్తి లభించగలదు.

కాని సతీత్వధర్మము, లేదా గృహిణీధర్మము ఒక బంధనతుల్యమైనది కాదు; ఈవిషయం సతీశిరోమణియైన రాధలో కనిపించే ఆదర్శంద్వారా తేట తెల్లం కాగలదు. భర్త ఒక ద్వారంవంటివాడు. స్త్రీయొక్క ఆత్మార్పణము భర్తద్వారా సమష్టిజీవనరూపమైన పరమేశ్వరునికే చెందుతుంది. అటువంటి స్త్రీయొక్క సహానుభూతికి ఒక హద్దుఅంటూ వుండదు; ఆమె అధికారానికి అంకుశం ఉండదు. సమస్త సమష్టియెడల ఆత్మీయతాభావం ఆమెలో ప్రపుల్లమై వుంటుంది. అయినప్పటికీ అటువంటి ఆమెకు 'కేంద్రం నుండి చ్యుతం కావలసిన అవసరంకూడా ఎన్నడు ఏర్పడదు.

సీత, రాధ—ఈ యిద్దరిలోనూ ఆదర్శవంతమైన సతీత్వం ప్రస్ఫురితం ఔతున్నది. అద్దానినిమించిన అధికసంపూర్ణత మరినాకింకెక్కడా కనిపించదు.

—జైనేంద్రకుమార్.

# కామము, ప్రేమ, పరివారము

## ఇంద్రియభోగం, బ్రహ్మచర్యం, పారివారికత

ప్రశ్న : మానవజీవితానికి మూలసఫలత బ్రహ్మచర్యసాధనయందే నిహితమైఉన్నదా ?

జవాబు : ఔను.

ప్ర : బ్రహ్మచర్యం అను పదానికి 'ఇంద్రియనిగ్రహం' అనే అర్థమే చెబుతారా మీరు ? అంటే సమస్తఇంద్రియాల్నీ సాంసారికవిషయాల నుంచి మరలించవలెననేకదూ !

జ : బ్రహ్మచర్యం అంటే బ్రహత్వసిద్ధికైన సాధన. ఆ పదానికి సరియైనఅర్థం అదే. సర్వం బ్రహ్మమయమే. అదికానిది వేరే యేముందీ ? కనుక బ్రహ్మచర్యం అంటే అర్థం సమస్తసృష్టితోనూ తాదాత్మ్యసాధన అన్నమాట; ఈ సృష్టిని కొనసాగిస్తున్నవిధానంతో సాయుజ్యసాధన; అనగా' పరమాత్మమయమనదగిన ఆచరణ. ఇటువంటి బ్రహ్మచర్యం ఈవిశ్వంతో యేవిధమైన సంబంధము లేక విభిన్నంగా వుండేదీకాదు; జీవితంలో యేదో ఒకానొక ఆశ్రమానికిమాత్రమే పరిమితమైవుండేదీ కాదు. మొదటినుంచి చివరివరకు బ్రతుకంతా వ్యాపించి, విస్తరించవలసినది. గృహస్థకర్మకూడ ఈరకమైన....ఉన్నతిశీలమైన బ్రహ్మచర్యమునందు అంతర్గతమైనదిగానే నేను భావిస్తాను. అయితే బ్రహ్మచర్యం అనేపదానికి స్థూలంగా చెప్పబడు తూన్న అర్థం ఇందుకు భిన్నంగా వుంటున్నది. ఈ మామూలురూఢార్థగత మైన బ్రహ్మచర్యం అసలైనబ్రహ్మచర్యానికి అనుకూలప్రదము, సహాయ కారి అయితే మంచిదే; హితకరమని చెప్పవచ్చు. కాని అలాకాకపోతే మాత్రం అది కేవలం బలవంతాన తెచ్చిపెట్టుకున్న 'ఇంద్రియదమనం' అని పించుకుంటుంది; అవాంఛనీయమైన పరిణామాలను తెచ్చిపెడుతుంది.

ప్ర : గృహస్థాశ్రమంలో బ్రహ్మచర్యసాధన ఎలాసాధ్యమౌతుంది ? గృహస్థకర్మయందు ప్రవృత్తులు నిమ్నోన్ముఖాలు ఔతాయి. ఈపరిస్థితి

బ్రహ్మచర్యానికి బాధాకరంకదా! బ్రహ్మచర్యసాధనకు యేకాంతస్థితి అవసరంలేదంటారా?

జ: ఊర్ధ్వం, నిమ్నం అనేవి పరస్పరవిరుద్ధములైన పదాలు. ఈ పై రుధ్యం ఆధారంగా వివేచన సాగుతూఉంటుంది; అంటే—బుద్ధిచాకచక్య ప్రసరణకు అది సహాయకారి ఔతుంది. కాని ఉపలబ్ధి ద్వైతంలో లేదు; అద్వైతంలో వుంది, సమన్వయసాధనలోవుంది. ఏమాత్రం క్రిందికి రాకుండానే వుండేట్టయితే పైకి తీసుకుపోవడంవల్ల ప్రయోజనం యేమిటి? తేలిగ్గా క్రింద వంపుల్లోకి నీళ్ళు తెప్పించేందుకేకదా మొదట దాన్ని ఎత్తుప్రదేశానికి తీసుకువెడతాం! లేకపోతే అంతయెత్తున నిలువజేసిన నీటిఉపయోగం యేమిటి? పైకివెళ్లిన మేఘాలు క్రిందికి వర్షిస్తేనేకదా వాటికి సార్థక్యత? కాబట్టి దీనివల్ల మనకేం తెలుస్తున్నది? నిమ్నభూములన్ని నిషేధించే ఊర్ధ్వస్థితి ముక్తి అనే అర్థంలో అంత స్పృహణీయమైన వస్తువేమీకాదని మనకు బోధపడుతుంది. ఊర్ధ్వముఖత, ఔను, మంచిదే. కాని గృహస్థధర్మం ఊర్ధ్వముఖికాదని, కాజాలదని-.ఆ భ్రమ ఎందుకు కలగాలి అసలు? ఇకపోతే 'యేకాంతస్థితి' అనేమాట ఉపయోగించావు. అంతరము, బాహ్యము అనబడే ఈ రెండు హద్దుల సామంజస్యము అవసరమని నేను భావిస్తున్నాను. కాబట్టి యేసాధనకైనా ద్వివిధమైన విస్తృతి కావాలి. కేవలం యేకాంతికమైన సాధన అనేది అసంభవం. వేరుగా, దూరంగా వెళ్ళిపోగలవు; కాని తిరిగివచ్చి కలుసుకోకతప్పదు. ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయి 'అడవినుండుట' భద్రము, శ్రేష్ఠము అయితేకావచ్చు. కాని మళ్లీ చివరకు తిరిగివచ్చి ప్రజాసేవకు అవసరమైన సామర్థ్యాన్ని సముపార్జించటమే అందలి ఉద్దేశం. బ్రహ్మచర్యంతరువాతనే గృహస్థాశ్రమ విధానం నిర్ణీతమైంది. అంటే— గృహస్థాశ్రమంలో అడుగు పెట్టగానే బ్రహ్మచర్యానికి స్వస్తి అనేనా మనం అనుకోవలసింది? అది అపోహ. నిజానికి గృహస్థాశ్రమం అనేది బ్రహ్మచర్యంయొక్క ఉత్తర పరిణతి. మొదటిదానికన్న తరువాతి ఆశ్రమం ఉత్కృష్టమైనదిగా అంగీకరించవలసిందే. లేకపోతే అర్థ—కామముల ప్రసక్తేరాదు మధ్యలో. అలాగే మధ్యన గృహస్థ— వానప్రస్థాశ్రమాల అవసరమేఉండదు. ఒక్క బ్రహ్మ

చర్యంద్వారానే అమాంతంగా మోక్షప్రాప్తివిధానం యేర్పడిపోయివుండేది. యోగ్యమైనవయసు వచ్చేవరకూ పరిపూర్ణసంయమం అలవాటైవున్నవాడే ప్రజోత్పాదనకు ఆదర్శప్రాయుడైన అధికారి అని నా విశ్వాసం. సఫలతను చూచి భయమందే లేక తిరస్కరించే సంయమాన్ని హఠంక్రింద, అహంకారంక్రింద పరిగణించవలసిందే. ఏనాటికైనా అది తొలగిపోకతప్పదు. కాబట్టి అది ఎంతతొందరగా తొలగిపోతే అంతమంచిది.

ప్ర : సఫలతను తిరస్కరించేసంయమం అంటే మీ ఉద్దేశం ?

జ : ఫలితం ఎప్పుడూ ప్రవృత్తియొక్క పరిణామమే. ప్రవృత్తి మార్గంనుంచి పూర్తిగా విముఖతను పెంపొందించే సంయమం ఫలితాన్ని తిరస్కరిస్తున్నసన్నమాటే. అది కృతార్థతకు దారితీయదు అని నా భావం.

ప్ర : కాబట్టి సాధనకోసం ప్రపంచాన్ని విడిచి దూరంగా యేకాంతవాసులైన తాపసుల అన్వేషణ నిరర్థకమనేనా మీ ఉద్దేశం?

జ : నేను అంతర్యామినేమీ కాదు. జీవితం దేశకాలపరిమితమైన అనుభూతిని పొందుతూవున్నదికదా ! విశ్వమునుండి అణువు వేరనీ, పరమాత్మనుండి జీవాత్మ వేరనీ, ఏకొంచెమో అటువంటి భావనే లేకపోతే ఇక ఈ అనుభూతులయొక్క అర్థం ఏమిటనీ ? ద్వైతంవల్లనే అనుభూతి సంభవమౌతున్నది. ఏమిటి మరి ఈద్వైతం ? ఏమిటి ఈ విభిన్నత ? అదే భోగం, యోగం అని నేనంటాను. భోగం ఉన్నది కనుకనే యోగంకూడా కోరుతున్నాం. అందులోనే జీవనోత్కర్షపరిభాష, వికాసప్రక్రియ అంతర్గర్భితమై వున్నాయి.

ప్ర : కనుక ప్రతి అధ్యాత్మికజిజ్ఞాసువునకూ భోగం అనేది అత్యవసరం అని మీ ఉద్దేశం అన్నమాట ! దాని అవసరం అతనికి అనుభవసిద్ధంగా స్ఫురించినాసరే, స్ఫురించకపోయినాసరే ! అంతేనా ?

జ : కాదు, కాని ప్రపంచంలో భోగం వున్నది; కాబట్టి ఉండితీరవలసినదే అనికాదు తీర్మానం. భోగం మన న్యూనతను ద్యోతకం చేస్తుంది. నీరు వెలితిగాఉన్నంతవరకు కుండలోతొణుకుతూనేవుంటుంది.ఆనీరే కుండలో నిండితే తొణుకుడు దానంతటదే ఆగిపోతుంది. భోగం అంటే ఇటువంటి తొణుకుడే అని తెలుసుకో. అలా సగంనిండిన కుండలుగా ఉండ

వలసినవాళ్ళమేనా మనం? పరిపూర్ణులమౌతూ వెడుతూన్నకొద్దీ ఈ తొణుకుడు తగ్గుతూవస్తుంది; చివరకు ఆగిపోతుంది. ఈవిధంగా భోగంయొక్క చరమపరిణామమే యోగం అని నేను భావిస్తున్నాను. ఈశ్వరపూర్వకమైన భోగం యోగమే.

ప్ర: భోగంద్వారా యోగం ఎలా సాధ్యం ఔతుంది? నిప్పులో నెయ్యిపోస్తే మంటలులేస్తాయిగాని చల్లారుతుందా? భోగవాసనాజన్యమైన ఆకాంక్ష, తృప్తిపరచే ప్రయత్నాలవల్ల, నానాటికీ వృద్ధిచెందుతుందేగాని అణగిపోతుందా? పైగా దానికి ప్రోద్బలంకలిగి, ఒక్కసారిగా మనిషిని తన బానిసగానే చేసుకోవచ్చుకూడా!

జ: ఏ ఇంద్రియవ్యాపారమైనాసరే 'వాసనారహితమైనది' అని చెప్పేందుకు వీల్లేదు. ఆ 'వాసన' అనే శబ్దానికి వెరచి ఇంద్రియాలనే అంతమొందించుకుంటామా? అది అసంభవం; అవాంఛనీయంకూడాను. కాని ఈ వాసనను అభిలాషక్రింద పరిణమించేట్టు చేయవచ్చు. అలా చేయగలశక్తే వ్యక్తిని పరిపూర్ణతవైపు తీసుకువెడుతుంది. ఆ శక్తి ఈశ్వరీయమైనది. వాసన అనబడేదాన్ని మనలోనుంచి తొలగించి, సత్యంతో - ఈశ్వరునితో జోడించివైచినట్లయితే అదే శుభప్రదమైనదిగా మారిపోతుంది. అంతేగాని ఇంద్రియవ్యాపారానికి 'వాసన' అని ఇష్టంలేని పేరేదో పెట్టేసి, మనల్ని మనం హ్రస్వపరచుకోరాదు, రిక్తపరచుకోరాదు. అది దివ్యమార్గం కాదు; అధర్మమార్గం. అది మనకు జడత్వం తెచ్చిపెడుతుంది. అరుచికరమైన విశేషణం తగిలించి ఇంద్రియవ్యాపారాన్ని నిషేధించటం మూలశక్తిమీదే గొడ్డలిపెట్టు ఔతుంది. అది పొరపాటు. అది మనకు పరిపూర్ణతను ప్రసాదించదు. పైగా న్యూనతవైపే తీసుకుపోతుంది. రుచికరము, అరుచికరము అనే సంకుచితభావంనుంచి మానవుడు ఉత్తీర్ణుడుకావాలనే ఈసందర్భంలో జిజ్ఞాసువుకు నా సలహా. ఈ సలహా పాటించిననాడు తన అహంకృతమతమంతవ్యాలవల్ల తిరస్కృతుడౌతూన్న వ్యక్తి అందరికీ ఆదరణీయుడుగా మారిపోతాడు. అంతేకాదు; దెబ్బలు తిని ఇతరుల దోషాల్నిమాత్రమే దర్శిస్తూవున్న మన సహానుభూతి ఆత్మదర్శనం, పరమాత్మదర్శనంవైపు పురోగమించగల అవకాశాన్ని పొందుతుంది.

ప్రశ్న : వాసన మనిషిని బంధించేస్తుంది. కనుక వాసనలకు, ఆకాంక్షలకూ అతీతుడై మానవుడు ఆత్మవ్యాపారమునందు, ప్రేమవ్యాపారమునందు సుస్థిరుడై యుండుటే మంచిదికాదా?

జ : ఇంద్రియవాసనలకు అతీతమైన ప్రేమవ్యాపారం, ఆత్మవ్యాపారం అంటూ ఏదైనా ఉన్నదా అసలు? ఏమో, నాకైతే తెలియదు. ఆత్మ అనేది ఒక వ్యాపారి కానేకాదు. దానికొక వ్యాపారం ఉన్నదీ అంటే—కర్మాచరణ కోసం దానికి ఇంద్రియాలనేవి లభించినతర్వాతనే సాధ్యం అయింది. ఈ ఇంద్రియాలకు అతీతము, విభిన్నము, వాటితో ఏవిధమైన సంబంధము లేనటువంటి ఏదో వ్యాపారం ఎలావుంటుంది? కాబట్టి ఆత్మవ్యాపారమునందు పరిపూర్ణలాభప్రాప్తి ఇంద్రియాలకుకూడా ప్రసరించవలసేవుంది. ఈ విషయాన్ని గుర్తించవలసినదిగా నా సలహా.

ప్రశ్న : వాసన అనబడేది ప్రేమకు ప్రబలశత్రువని మీరు అంగీకరిరా? వాసన మనిషిని బంధించేస్తుంది; ప్రేమ స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. ఈసంగతి మీకు కనిపించటంలేదా?

జ : అభిలాష అనేది ఏమాత్రమూలేని ప్రేమ అంటూ ఉంటుందా? అందులో కోరిక యేమీ లేనేలేదా? సర్వథా వాసనాశూన్యమైన ఆప్రేమను ఎరిగినవాడేడీ? కాబట్టి వాసనను ప్రేమకు పూర్తిగా విరుద్ధమైనదాన్నిగా భావించటం నాకు ఇష్టంలేదు. ఇంద్రియవాసనలలో పడికొట్టుకుంటున్నట్టు మనకు కనిపించే వ్యక్తులు జడత్వంలోకే దిగజారిపోతున్నట్టు భావించటం పొరపాటు. నిజానికి వారుకూడా ప్రేమతత్వాన్ని అందుకునేందుకు పెనగులాడుతూన్నవాళ్ళే. అలాగనే తోస్తుంది. నే నీ విషయాన్ని వారి హితంకోరి చెబుతున్నట్టు భావించవద్దు. అంతకుమించిన పరమసత్యం వేరే ఉండబోదు. ఒకానొక వ్యక్తిలో ప్రేమ భోగరూపంలోమాత్రమే ఉంటూ ఎంతకూ యోగదశలోనికి పరిణతిచెందటంలేదనుకుందాం. అయితే అటువంటి పరిస్థితికి నువ్వు, నేను కారణభూతులం కాదని ఎవరనగలరు? అటువంటివానియెడల సహానుభూతి చూపలేని మన అసమర్థతే అతనికొకబంధనం ఔతున్నదేమో! ఆబంధనంలో చిక్కుకుని యోగం భోగంఔతున్నదన్నమాట. ఈవిధంగా వాసనను బలవంతాన అణగద్రొక్కివేయకూడదు; పరిణతిచెందించాలి.

'వద్దు-కూడదు' అనే నిషేధపదాలవల్ల వికారం సమసిపోదు. సంస్కారం వికారానికి ఎదురుబొదురుగా నిల్చి దాన్ని సహజంగా పరిణతిచెందిస్తుంది. ఇకపోతే తిరస్కారం, ద్వేషం, ఏవగింపు మొదలైనవి వికారాన్ని ఇంకా వికృతంగా తయారుచేస్తాయి, అంతే.

ప్రశ్న: అంటే మీ ఉద్దేశం బ్రహ్మచర్యసాధనకు అన్నిరకాల ఇంద్రియవాసనల పరితృప్తి తప్పనిసరిగా అవసరం అనేనా?

జ: తృప్తి అనేది బహుముఖంగా వున్నంతకాలం అది అతృప్తి అన్నమాటే. కనుక సుస్థిరమైన పరితృప్తినే ఇంద్రియాతీతం అని అంటున్నాం. అంటే అది ఇంద్రియాలను మధ్యలోనే అతృప్తములుగా విడిచివెళ్తేస్తుందనికాదు భావం. అది ఇంద్రియాలలో విడివిడిగా విభక్తంకాజాలదు కాబట్టి ఆత్మగతం అని చెబుతున్నాం. అది ప్రత్యేకంగా ఒకానొక ఇంద్రియంలోగాని, వివిధేంద్రియాలలోగాని రుద్ధము, బద్ధము కాకుండా ఒక్కసారిగా మన పరిపూర్ణత్వాన్ని ఆవరించేస్తుంది.

ప్రశ్న: ఇంకేంమరి! కాబట్టి ఇంద్రియాలను విషయాలమీదికి విచ్చలవిడిగా పోనీయరాదన్న ప్రముఖనిర్ణయం ఆవిష్కృతమైనట్టేకదా! అవి ఆత్మపరితృప్తికోసం నియోజితాలుకావలసినవేకదా!

జ: ఆత్మ, ఇంద్రియాలు పరస్పరవిరుద్ధములన్న భావానికి అలవాటుపడివున్నాం మనం. నిజానికి అటువంటి వైరుధ్యం ఏమీలేదు. ఆత్మకు అనుకూలమైనది ఇంద్రియాలకు ప్రతికూలంకాజాలదు. ఆత్మ ఏకైకము, అఖండము. అంగాంగవిభిన్నమై వివిధరూపాలుకలిగి ఉన్నాయి ఇంద్రియాలు. కాబట్టి అవి అనేకములు. వేరువేరు ఇంద్రియాలకు వేరువేరు పరితృప్తి ఉంటుంది. కనుక విడివిడిగా ఒక్కొక్క పరితృప్తి నిజానికి అతృప్తే. అర్థాత్తు ఇంద్రియక్షేత్రంలో తృప్తి అనేది లేనేలేదు. ఉన్నది తృష్ణమాత్రమే. ఈ తృష్ణ ఎప్పటికప్పుడు తాత్కాలికంగా పరితృప్తిని వెతుక్కుంటూ ఉంటుంది; పొందుతూవుంటుంది. ఈ తృష్ణ, పరితృప్తి బహుసంఖ్యాకములు. అవి క్షణికములు; ధృవములు కావు. కాబట్టి అవన్నీ కేవలం భ్రమ: సత్యం కావు. కర్మేంద్రియాల్ని, జ్ఞానేంద్రియాల్ని, అన్నింటినీ ఒక్కసారిగా పరితృప్తపరచగలిగినప్పుడది ఆత్మపరితృప్తి ఔతుంది. కాబట్టి

అనాత్మభోగంకోసమైన ప్రతి ప్రక్రియలోనూ ఇంద్రియాలు ఆత్మయోగమునే వెతుక్కుంటున్నాయన్నమాట. అట్టి ఆత్మయోగం లభించినప్పుడే ఇంద్రియాలకు నిజమైన సార్థకత అనుభూతం ఔతుంది. అంతవరకున్నూ ఇంద్రియాలు తమతమ ప్రత్యేకక్రియలయందు ప్రతిక్రియాభోగాన్ని భోగిస్తూ ఉండవలసిందే.

ప్ర : భోగానుభవంద్వారానే ఆధ్యాత్మికసాధన కొనసాగించాలనికదా మీ రనేది ; అయితే సాంసారికభోగాలేమీ అనుభవించకుండా ఎవరికీ ఆత్మయోగం ప్రాప్తించదన్నమాటేనా ?

జ : భోగానుభవం లేకుండానా ? అంటే — ఏదో ఒకానొక విషయలాలసఅకృతార్థంగా మిగిలిపోయి భావరూపంగా నిలిచిపోయిందన్నమాటేగా; అనగా సాధకుని మనస్సులో....సౌందర్యాన్ని తృప్తిగా కళ్లువిప్పి చూడలేకపోతినే అనిగాని, పూర్తిగా సంగీతంవిని ఆనందించనైతినే అనిగాని, ఏదో ఫలానా స్పర్శసుఖాన్ని అనుభవించలేదే అనిగాని....ఒక అభావం కెలకవేస్తూ ఉంటుందన్నమాట. ఈ అభావం ముక్తిసాధనకు ఒక ఆటంకం. అటువంటి కెలకను మనసులో అలా వుండనిస్తే ఆత్మవికాసం సుసంపన్నం కాజాలదు. అయినట్టు కనిపించినా ఒకనాటికి అది కూలిపోక మానదు.

ప్ర : మానవుడు ఎల్లప్పుడు కొన్ని హద్దులకు లోబడి జీవించవలసినవాడు. కనుక ఎంత భోగానుభవం పొందినా ఏదోఒక లోటు అగుపించకుండా వుండదు. కనుక మనిషికి ఆత్మవికాసం అనేది అసంభవం అని చెప్పవలసిందేనా ?

జ : ఔను, హద్దు వుంది. బాహ్యపదార్థజగత్తులో ఈ హద్దును ఉల్లంఘించగలగటంగాని, దాన్ని నిర్మూలించగలగటంగాని సాధ్యంకాదు. అనగా ఈ ప్రపంచంలోని భౌతికపదార్థాలతోటి సంయోగంద్వారా లభించే తృప్తి ఎప్పుడూ అతృప్తిమూలకమైనదే. ఏదోలోటు మిగిలేపోతుంది; అది తప్పదు. అనంతము, అపరిమేయము అయినదానిలోగాని ఈహద్దు విలుప్తంకాదు. అంటే....ఈశ్వరప్రాప్తికోసం సన్నివిష్టములైన ఇంద్రియాల పరితృప్తి మాత్రమే సార్థకమైనది. లేకపోతే వ్యర్థమే. కనుకనే యోగసాధనద్వారా

లభించే ఆనందంముందు భోగానుభవంలోవుండే రుచి తుచ్ఛముగా భావించ బడుతున్నది.

ప్ర : భోగానుభవం లేకుండా ఎటువంటి పరిస్థితిలోనూ ఏకాయెకి భగవత్ప్రాప్తి సాధ్యంకాదని మీ రంటున్నారు. అయితే మరి రామకృష్ణ పరమహంస మొదలైన యోగిపుంగవులవిషమై మీరేంచెబుతారు ? భోగాల ఆవశ్యకత వారికెందుకు లేకుండా పోయింది ?

జ : వారికిమాత్రం సాధన అనేది అవసరం లేకుండా పోయిందా ? ప్రయత్నమే లేకపోతే జీవితంలో పురుషార్థమే లేదన్నమాట. రామకృష్ణుని జీవితంలో ఒక అవ్యాహతమైన ప్రయత్నం కనిపించదా ? ఆత్మయోగానికి భిన్నమైనది, ఏకాంచెమో ఇంద్రియభోగతుల్యమైనది లేకనేపోతే ప్రయ త్నంయొక్క ఆవశ్యకత ఏముందీ ? ఇంద్రియాలెప్పుడూ స్వచ్ఛందవృత్తిని కాంక్షిస్తూ ఉంటాయి. ఎప్పుడూ వాటిని వశంలో ఉంచుకోవలసివుంటుంది.

ప్ర : అటువంటి ప్రయత్నంయొక్క ఆవశ్యకత వివేకానందునికి ఉంటే ఉండవచ్చు; అందులో ఆశ్చర్యంలేదు. కాని రామకృష్ణుడు పెండ్లా డిన భార్యను విడిచిపెట్టేసి వెళ్ళిపోయాడు. మీరు చెప్పినటువంటి ప్రయత్నం యొక్క ఆవశ్యకత ఆయనకేమీ వున్నట్టు కనిపించదు.

జ : పైపైన చూస్తే అలాగే అనిపిస్తుంది. కాని లోతుకుదిగి ఆలో చిస్తేమాత్రం అలా అనుకోటానికి వీల్లేదు. ఏమైనా ఒక్కసంగతిమాత్రం విస్పష్టం : అంతస్థమైన భావం భగవద్భావమే. కనుక లోతుగా కొంతదూరం వెళ్లాక, ఆతరువాత అక్కడినుంచి నడక అనాయాసంగానే సాగిపోతుంది. అందులో ఆశ్చర్యం ఏమీలేదు. సూదంటురాయిచేత ఇనుము ఆకర్షితం కావటానికి పెద్దప్రయాస ఏముంటుందీ ?

ప్ర : రామకృష్ణునికి ఆ భగవద్భావం చాల చిన్నవయస్సునందే సంప్రాప్తమైంది. సాధారణమానవుల కది జన్మంతా గడిచిపోతున్నా లభిం చదు. మీరు ఒప్పుకుంటారా ఈవిషయం ?

జ : అయితే కావచ్చు. రామకృష్ణుని నేను చూడలేదు. అయితే చాలమందిని చూచాను, చూస్తున్నాను. ఈ అందరిలోనూ అంతరాలు కని పిస్తూనే ఉన్నాయి. ఇందుకు కారణం ఏమిటి ? వైవిధ్యం, విభిన్నత్వం—

ఇవి సృష్టిలక్షణాలు. కాని అందువల్ల భగవంతునిలోనే శకలత, పక్షపాతం ఉన్నట్టు నేను అంగీకరించను. ఆయన సాధులు, దుష్టులు....అందరియెడల సమానుడే.

ప్ర : రామకృష్ణునికి చిన్నతనంలోనే విరక్తి కుదురుకున్నది. అలాగే ఎవరైనా ఒకవ్యక్తికి జీవితంలో మొదటినుంచీ అది ఏర్పడివుండవచ్చు. అటువంటివానికి భోగాల్లో దిగబడిపోవలసిన అవసరం ఏముందీ?

జ: విరాగులు, విరసులు, ఎక్కడ అనురక్తులై ఉన్నారు, ఎక్కడి నుంచి వారికి రసోపలబ్ధి జరుగుతున్నది? అదీ ఆలోచించవలసిన విషయం. బాగా తరచిచూస్తే వైరాగ్యం, వైరస్యం అనేవి కేవలం శబ్దాలుమాత్రమే అని తేలుతుంది. నిజానికి వారుకూడా ఈశ్వరునిలో అనురక్తులై, అక్కడినుంచి రసప్రాప్తిని పొందగలసామర్థ్యాన్ని కలిగివున్నారు. అదే వారి యోగం.

ప్ర : పూర్తిగా ఈశ్వరునియందే అనురక్తి కలిగివుండటం అసం భవంగా తోస్తుంది. అయినా ఒకానొకవ్యక్తి ఈశ్వరోన్ముఖుడౌతూవుంటాడు. అటువంటివాడు మధ్యలో ఈ భోగాలు అవసరంలేకుండా పురోగామికాలేడా?

జ : కాజాలడనే నా అనుమానం. ఎందువల్లనంటే—ఉన్నదాని నుంచి విముఖుడై, లేనిదానివైపు వెళ్ళాలన్న ప్రయత్నం సఫలంకాజాలదు. పురుషునికిస్త్రీతత్త్వం, స్త్రీకి పురుషతత్త్వంకళ్ళయెదుట కనిపిస్తూనే ఉన్నాయి. భోగాన్ని నిషేధిస్తున్నామంటే ఆ తత్త్వాన్ని చాలవరకు శత్రుత్వదృష్టితో చూస్తున్నామన్నమాట. అది నాకు తలక్రిందువ్యవహారంగా అనిపిస్తుంది. అది మనల్ని ముక్తికి ఉన్ముఖంగా తీసుకువెడుతుందని నేను నమ్మలేను.

ప్ర : కాని మొదటినుంచీకూడా ఈశ్వరోన్ముఖుడైనవ్యక్తి గృహస్థా శ్రమాన్ని స్వీకరించవలసిందేననటంలో....ఈశ్వరతత్త్వంద్వంద్వాత్మకమన్న భావం సూచితమౌతున్నదికదా? తిన్ననైన ఒకే సూటిమార్గం దొరికితే ఈ ద్వంద్వం లేకుండానే పోతుందిగా!

జ : అదే గడ్డుసమస్య. ఈశ్వరు డంటూవుంటే—ఈ విశ్వమంతా అతనిలోనుంచిగాక, అతనికి బాహిరంగా మరింకెక్కడినుంచి ఊడిపడినట్టు? కనుక ఈశ్వరుడు, ప్రపంచం పరస్పరం విరోధులుకారు. కనుక ప్రపంచంలో

నుంచే ఈశ్వరుని మనం పొందాలి. ఈ ప్రపంచంనుంచి మార్మాగంపెట్టి పోవాలనుకుంటేమాత్రం ఎక్కడికిపోతాం? అదే నాకు బోధపడటంలేదు. అందువల్ల చివరకు చేతికి దక్కేదేమీ లేకపోగా, కృతార్థత చేకూరలేదే అన్న వ్యథ మిగులుతుంది. జీవితం ఒక బోలుకర్రలా తయారౌతుంది.

ప్ర : గార్హస్థ్యం స్వీకరించినతరువాత మళ్ళీ అందులోనుంచి పారి పోవడం సంభవిస్తే?

జ : సంభవిస్తే సంభవించవచ్చు. కాని అది నిశ్చయంకాదుగదా? భవితవ్యం ఎలా జరగవలసివుందో అలా జరుగుతుందిగాని, ఇలా జరగాలి అని శాసించేందుకు మనమెవరం? అటువంటి విరాగేగనక ఎవరేనా వుంటే భార్య అతనికి అనుగామినిగానే వుంటుంది. భార్య, సహధర్మచారిణి అయిన స్త్రీ పట్ల తాను శ్రద్ధాసక్తులుకలిగి మెలగలేననిగాని, ఆమెను కూడా కలుపు కుని తనమార్గంలో తోడుగా తీసుకపోలేననిగాని, అంత అవిశ్వాసం ఎందు కుండాలి ఆ విరాగికి? వివాహము, భోగము అనబడేవి ఈశ్వరత్వానికి, లేక బ్రహ్మచర్యానికి విరుద్ధమైనవిగా భావించవలసిన అవసరంలేదని నాకు తోస్తు న్నది. పైగా సముత్కటము, సుదృఢము అయిన భావనగలవ్యక్తి వివాహం ద్వారా బలమునే పొందుతాడని నా నమ్మకం.

ప్ర : వివాహబంధనంనుంచి విడిపోయి మానవసేవలో జీవితం గడపదలచుకుంటాడు ఒక వ్యక్తి. దీనికి మీరేమంటారు?

జ : వివాహంనుంచి తప్పించుకుందామన్న ఆలోచనతో ఆ యీ దోవలేవో అన్వేషించడానికి సిద్ధపడుతున్నావే....అయితే సృష్ట్యాదిలోకూడా ఆహారముతోపాటు ఒక అవ్వకూడా ఎందుకు ఏర్పడినట్టు? మనకు ప్రపంచం లోనికి ప్రవేశం కల్పింపగలిగినది ఒక్క వివాహసంస్కారమేనని నా విశ్వాసం. అందులో ప్రవేశించడానికి పూర్వమే ప్రపంచంలో ఈమార్గం అంతూవంతూలేనిదన్నభావం శ్రద్ధాపూర్వకంగా మన మనసులో కుదురు కొన్నట్లయితే, అందుకు భయం లేక పిరికితనం కారణమని చెప్పడం సహేతుకం కాదు. ఎవరేనా యువకుడుగాని, యువతిగాని ఇరవయ్యోయేడు రాకపూర్వమే నాకు ఇరవై ఒకటోయేడు రావాలి అనిగాని లేక ఇరవై ఒకటో

యేడులో నేను ప్రవేశించను అనిగాని అనటం అజ్ఞానంతోకూడిన అర్థంలేని హఠం అనిపించుకుంటుంది. అది కేవలం అహంకారం. ఇరవయ్యోయేడు పూర్తిఅయితే ఇరవై ఒకటోయేడు దానంతట అదే వచ్చేస్తుంది. వివాహ సంస్కారపరిణతికూడా ఇటువంటిదిగానే నేను నమ్ముతున్నాను. 'నేను పిందెగా, కాయగా మారను' అని పూవు మొండిపట్టుపడితే ఏం ప్రయోజనం? తన రూపసౌరభాలమీది మోహంగాని, తన నైజం మాసిపోతుందే అన్న భయంగాని అటువంటి అధికారాన్ని దానికి ప్రసాదించగలుగుతాయా? తనకు తాను ఫలరూపాన్ని పొందగోరని పూవు పూవుకాదనే నేనంటాను. ఎప్పుడూ ఒకేస్థితిని అంటిపెట్టుకుని ఉండజాలము. కాలధర్మాన్ని అనుసరించి పరిణామం వుంటుంది. బాలికలయొక్కగాని, బాలకులయొక్కగాని శరీరనిర్మాణంలో వయసుకు తగిన పరిణామం వస్తుంది. మరి అనంతా వ్యర్థమేనా? కాలం అంటే భయాన్ని గొలుపుతుంది బుద్ధి. అందువల్ల ముందడుగు వెయ్యటానికి బదులు మడమత్రిప్పి వెనుకముఖం పెడతాం. కాలపరిణతిని ఎదుర్కొనే సామర్థ్యం తగ్గుతుంది. స్మృతివిలాసం హెచ్చుతుంది. కాని పురోగమనాన్ని ఏవగించుకోటం మృత్యువును ఆహ్వానించుకోటమే. సృష్టి కార్యక్రమంలో ఒకటినుండి అనేకమును ఆవిష్కరించవలసిన పని భగవంతునికి ఉండనే వుంది. గుణితం కావటం చైతన్యంలోని సామర్థ్యంయొక్క ధర్మం. ఒకటి రెండు, రెండు మూడు అయితీరవలసిందే. ఇందులో భయమెందుకు? సంకోచం ఎందుకు? ఇందుకు భిన్నంగా దారితీసే వేదాంతం యావత్తూ ప్రమాదభరితమైనదే. మనల్ని ఒకేస్థితిలో అట్టిపెట్టి, కనిపెట్టి చూస్తూ వుండేందుకు కాదు ప్రకృతి వున్నది. విత్తనం విడిలి వాడిలి పోవలసిందే....వృక్షం ఆవిర్భవించేందుకు. మనకున్న హద్దుల్లోకూడా మనదైన అధికారం ఏమీలేదు. అందుచేత మనల్ని మనం నిరోధించుకోజాలము. మనం వ్యాప్తి చెందాలి. విస్తరించాలి. కాలాంతరంవరకూ మనంమిగిలివుండాలి. ప్రజోత్పాదనద్వారా వ్యష్టి తనను తాను సమష్టికి దానంచేసుకుంటున్నాడు. ఈవిధంగా వ్యక్తి సమష్టిగతుడౌతున్నాడు. ధర్మశాస్త్రాలు ఉన్నాయి; అవి నియమాల్నిగురించీ, సంయమాన్నిగురించీ ప్రబోధిస్తున్నాయి. నిజమే, కాని అవి పైనపేర్కొన్న విషయాలకు విరుద్ధ

ములుకావు. విరుద్ధములని భావించటం ధర్మాన్ని అధర్మంగా భావించటమన్న మాటే. బ్రహ్మచర్యం అంటే ప్రపంచాన్ని బీడుపెట్టి వుంచేదికాదు. ప్రపంచాన్ని పచ్చపచ్చగా పండింపించేదే బ్రహ్మచర్యం. ప్రపంచాన్ని ఒక బీడు పడిన బంజరుభూమిగా తయారుచేసేందుకు మనం ఉద్యమించటం చాల పొరపాటువని తెలుతుంది. మాతృత్వాన్ని మనం ఎందుకని ఇంతగా గౌరవిస్తున్నాం? అక్కడ శోణం క్షీరరూపం ధరిస్తున్నదికనుకనే; నెత్తురును పాలుగామార్చి పసిపాపకు ప్రాణంపోస్తున్నది కనుకనే; నిత్యం చూస్తున్నాము గనుక అదొక చమత్కారం కాదని చులకనచేయడం తగదు. మాతృత్వాన్ని మనం అర్థం చేసుకోగలం, వాత్సల్యాన్ని మనం అర్థంచేసుకోగలం, కాని దానిపట్ల మనకు గల బాధ్యతల్ని మనమీద వేసుకోకుండాఉండే షరతుమీదనా మనం మాతృత్వాన్ని గౌరవించవలసింది? ఈ పిరికితనానికి—ఈ భీరుత్వానికి కూడా హద్దు ఉండాలి. పిరికితనాన్ని ప్రసాదించేది ధర్మం అనిపించుకోదు. అనంతము దివ్యము అయినదాన్ని స్వీకరించేందుకు శక్తిని ప్రసాదించేటటువంటిదే ధర్మం అనిపించుకుంటుంది. కోసి ముక్కలుచేసి జీవితాన్ని హ్రస్వపరిచేటువంటిదాన్నే ధర్మం అని చెప్పేట్టయితే ఇక అధర్మం అని పేర్కొనతగినది యేదీ ఉండదు.

ప్ర : భోగాల అవసరం లేకుండా యోగి అయిపోయిన ఏ ఐతిహాసిక వ్యక్తినీ మీరు ఒప్పుకోరన్నమాటేనా?

జ; అటువంటివ్యక్తిని వెదకి ఆవిష్కరించవలసినపని నాకేముంది?

ప్ర : భోగాల ఆవశ్యకత లేకుండానే శుకదేవుడు యోగి అయినాడని మనం వింటున్నాంకదా?

జ : ఆయనలో ఒకవిధమైన శిశుభావం ఉంది. అందుచేత సిద్ధయోగులకు ఆదర్శమూర్తిగా ఆయన భావింపబడగలిగాడు. కాని బ్రహ్మచర్యం ఆయనలో పరిపూర్ణతను పొందివున్నట్టయితే ఆయన్ను అవతారపురుషులలో ఎందుకు పరిగణించరు? అంటే ఏకదేశీయమైన ఆదర్శాన్ని మూర్తిమంతం చేసేందుకే ఆయన ఉదాహరణ. ఆయనలో పూర్ణత్వాన్ని చూడ్డంగాని, ఆరోపించటంగాని పొరపాటు.

ప్రశ్న : అంటే నివృత్తి తనంతతాను సిద్ధిపొందజాలదన్నమాటేనా?

జ : ఔను; అది తనంతతాను సిద్ధిపొందాలన్నమాటకు అర్థంలేదు. అవ్యక్తభావాపేక్షనుండి నివృత్తమైనదే వ్యక్తరూపంలో ప్రవృత్తిఔతున్నది. ముక్తిలోనే సిద్ధి. అది కర్మద్వారాగాక కర్మయందే సంభవమౌతుంది. కర్మనే జగద్భాషలో భోగం అని పేర్కొనవచ్చు. ఎందువల్లనంటే— అందులోనే ఇంద్రియాల యోగం అవసరింకాబట్టి.

## కామము, ప్రేమ, పాపము

ప్ర : ఫ్రాయిడ్‌వలెనే మీరుకూడా కామేచ్ఛే అన్నింటికి మూలమని భావిస్తున్నారా ?

జ : ఫ్రాయిడ్‌ను నేను సమగ్రంగా ఎరుగను. కాని ఎరిగినంతవరకు మాత్రం నేనాయనతో ఏకీభవింపజాలనని చెబుతాను.

ప్ర : అంటే —మానవుని సర్వకర్మస్రోతస్సులందు కామశక్తిని అంతర్వాహినిగా అంగీకరించరన్నమాటేగా ?

జ : ఆదిలోనూ, అంతమందు నేను ఈశ్వరుని అంగీకరిస్తాను. ఇక మధ్యలో ఉన్నదని మనం అనుకుంటున్నది యావత్తూ సాపేక్షదృష్ట్యా మాత్రమే. 'కామం' అనబడేదాన్నికూడా నేను అలాగే అంగీకరిస్తాను.

ప్ర : కామవాసనకు, ప్రేమకు ఏమైనా భేదం ఉన్నదంటారా ? లేదంటారా ?

జ : సృష్టికి, స్రష్టకు ఏమి భేదం ఉంది ? కాని సృష్టిలో కొంత మాలిన్యం కనిపిస్తున్నది. కాబట్టి స్రష్టకూడా మలినుడేనా? ఇక్కడకూడా అదేసంగతి జ్ఞాపకంపెట్టుకోవాలి. ఒక చిత్రంలో ఉపయుక్తమైయున్న నలుపురంగు ఆ చిత్రంలోని భావాన్నికూడా నలుపుచేస్తుందా ?

ప్ర : నిర్మలమైన— పరిశుద్ధమైన ప్రేమకు ఉదాహరణగా మాతృప్రేమను అంటే మాతృవాత్సల్యాన్ని పేర్కొనవచ్చునా ?

జ : సర్వథా పరిశుద్ధత సిద్ధించేస్తే ఇంకా ఈ దేహం ఎందుకు ? సదేహావస్థలో తత్సంబంధమైన మాలిన్యం కనిపించే అవకాశం ఎప్పుడూ ఉంటుంది. ఎందువల్లనంటే ఆ అవస్థలో వ్యష్టిని సమష్టికి భిన్నంగా చూడటం పరిపాటి మనకు.

ప్ర : వాత్సల్యంలో పరిశుద్ధతకు స్థలనం ఎందుకుంటుంది ? భోగ వాంఛాప్రేరితమైన దాంపత్యభావంకన్న ఆ వాత్సల్యం శ్రేష్ఠతరంకాదా ?

జ : అంటే పరిశుద్ధత అనేదాని పరిమాణంలోమాత్రం తేడాలు సర్వత్ర సంభవమనా నీ అభిప్రాయం ? అసలు వాత్సల్యంలోనే అంతులేని తారతమ్యాలు ఉండవచ్చు. మమత మరీ ఎక్కువగావున్న తల్లి తన శిశువును రక్షించుకోవాలన్న చింతలో ఒకానొకప్పుడు క్రూరంగాకూడ వ్యవహరించవచ్చు. ఇకపోతే దాంపత్యసంబంధంలో కొంచెం నిష్కామ పరత సాధించగలిగితే సాత్వికభావం ప్రకటంకావచ్చు. కాబట్టి మనకు ఇష్టులైనవారికి ఇష్టమైనవిషయాలను గురించిన విచారణే ఉచితమని నా ఉద్దేశం. తత్త్వనిర్ణయానికి విభిన్నమై ఒకరు అపేక్షించని విచారణ సాధించేదానికన్న బాధించేదే అధికం. అది ధర్మనిష్ఠయమంయి సంగతము, ఉపయుక్తము కాతుంది. కర్మ వ్యక్తిగతమైనది. కనుక ఒకానొకవ్యక్తినిగురించిన చర్చ అతడు అపేక్షించినప్పుడే న్యాయసంగతం కాగలదు.

ప్ర : అయితే మీరు భిన్నభిన్నములుగా వుంటున్న పలురకాల ప్రేమ సంబంధాలన్నింటినీ ఒకశ్రేణిలోవివిగానే భావిస్తారా ? ఒకదానికి మరోదానికి పెద్ద భేదం యేమీ ఉన్నట్టు మీరు ఒప్పుకోరా ?

జ : చెబుతున్నానుకదూ ; ఈసంగతులనుగురించి ఒక సిద్ధాంతాన్ని నిర్వచింపవలసిన అనివార్యత యేమీలేదు. భాషయొక్క, పదాలయొక్క పరస్పర విస్పష్టతకోసం యేదో ఈవిధంగా కొంచెం పరిశ్రమచేస్తే గ్రహింప దగినవిషయం ఒకటి బయటపడవచ్చు. అలాగాక కేవలం వాదప్రియులమే అయితే ....ఒకోచోట జీవితాన్ని వికాసవంతం చేసుకోలేకపోగా దాన్ని మరీ నీరసపరచుకోటమే జరుగుతుంది. మూలశక్తి ఒక్కటే : అదే ప్రేమ ; అంటే అందరిలోనూ ఆత్మికమైన అభేదస్థితి ఒకటి ఉన్నదన్నమాట. కను

కనే పరస్పరఆకర్షణ ఉంది. అదే నానారకాలుగా అభివ్యక్తమవుతూఉంది. తల్లికీ, బిడ్డకూ మధ్యనున్న ఆకర్షణను వాత్సల్యం అంటున్నాం; స్త్రీపురుషులమధ్యనున్న దాన్ని కామం అంటున్నాం; ఇలాగే అన్నీను. సర్వత్రా ప్రేమ ఉన్న హేతువుచేత అన్నిసంబంధాల్లోనూ ఒక సమమైన సామాన్యత ఉంది. దాన్ని విడిచిపెట్టిచూస్తేమాత్రం అన్నింటిలోనూ కనిపించేది విభిన్నతే. అంతేకాదు, ఒకేసంబంధంలోనే, ఒకచోట చిక్కిన మరోచోట పల్చన— అంతులేని వైవిధ్యం కనిపిస్తుంది.చివరకు ఏ యిరువురు దంపతుల దాంపత్యస్థితిలోనైనా సమానత్వంఉన్నదా? ఉండదు. ఈవిధంగా భిన్నత్వంవైపే వెళ్లేటట్టయితే వ్యక్తినీ, తత్కాలమునుపరిగణించవలసివుంటుంది. అంటే—ఆక్షణాన అతని పరిస్థితిని లెక్కలోనికి తీసుకుని, అది అప్రకారంగా ఎందుకున్నదీ అనే చర్చచేస్తే సుసంగతంగా వుంటుంది. లేదా చర్చను అభేదంవైపు తీసుకువెళ్ళాలి. జీవితంయొక్క, జీవితానికి సంబంధించిన చర్చయొక్క గతిఎప్పుడూ స్థూలమునుండి సూక్ష్మమువైపు, విభిన్నత్వంనుండి యేకత్వము వైపు నడుస్తూఉండాలి.

ప్ర : ఇలా అభివ్యక్తములౌతూవుండే ఈ నానారకాల ప్రేమల శుభాశుభపరిణామములయందుకూడా విశేషఅంతరాన్ని మీరు అంగీకరించరా? దాంపత్యప్రేమలో కనిపిస్తున్న అశుభపరిణామం వాత్సల్యంలో ప్రకటం కావటంలేదే !

జ : అన్నిప్రేమలు సహాయకములే. అన్ని స్వార్థములు అథవా అహంకారములు బాధాకరములే. అన్నిరకాల లౌకికప్రేమలయందు స్వార్థాహుతివుంది,స్వార్థపూర్తి ఉంది. ఆ రెంటింటి మిశ్రమములే లౌకికప్రేమలు అన్నీ. కాబట్టి అన్నింటిలోనూ సాధకబాధకాలు రెండూ కించిత్తుగా, క్వచిత్తుగా ఉండనేఉన్నాయి.

ప్ర : అయితే ఎందుకని మరి ఒకానొకయువకుడు పెళ్ళిఅయిపోవటంతోనే....చిన్నప్పటినుంచీ తనను అంటిపెట్టుకునివున్న తల్లిని, అక్కచెల్లెళ్ళను త్రోసివేసి, క్రొత్తగావచ్చిన భార్యయందే అత్యధికంగా ఆసక్తుడౌతున్నాడు ?

జ : ప్రేమయందు అశేషమైన దానం అనివార్యమౌతున్నది. కాని మనం 'చెడు'గా భావించేదికూడా మనలో చాలానే శేషించివుంటున్నది. ఈ చెడును మనం ఒక్కసారిగా ఇతర్లకు ఇచ్చివెయ్యటానికి ఇచ్ఛగించము. కాని భార్యకుమాత్రం ఈ శేషభాగాన్ని అందించకుండా మిగిల్చుకోవలసిన అవసరంలేదు. తప్పనిసరిగా అందించుకోవలసివుంటుందికూడా. భార్యఅంటే అటువంటి సంబంధి అన్నమాట. అందువల్లనే దాంపత్యం ఒక ఘనిష్టమైన సంబంధంగా పరిగణింపబడుతున్నది. తల్లితోటి, అక్కచెల్లెళ్ళతోటి వుండే సంబంధం కొంచెం ఔపచారికమైనటువంటిది; అంత సర్వగ్రాహి కాదు.

ప్ర : అంత ఘనిష్టమైనదికాబట్టి అందులో స్థాయిత్వంకూడా అధికమేనంటారా ?

జ : ఏం ? స్థాయిత్వం ఎక్కువైతే ఇబ్బందేముంది ? కాని ఇంతకూ భార్యాభర్తలమధ్య కాపట్యం, దాపరికం ఆరంభమైనక్షణంనుంచీ ఘనిష్టత క్షీణించిపోవటం మొదలౌతుంది. చివరకు ఎంతవరదాకా వస్తుందంటే— ఉత్కటమైన అనురాగంతో ఆరంభమైన సంబంధం వికటద్వేషంలోకి దిగవచ్చు.

ప్ర : అటువంటి కాపట్యం, దాపరికం పొడసూపనంతవరకూ భోగాసక్తుడైన వ్యక్తికి కామవాసనలనుంచి విడుదలపొంది బయటపడే మార్గం దొరకదన్నమాటేగా! అతడు జీవితపర్యంతం విషయలోలుడై కొట్టుకుంటూ ఉండవలసినదేగా !

జ : చెప్పానుకదూ ; భోగంలో సహజంగా సగంతృప్తేగాని, నిండు తృప్తి లేదని. కనుక భోగం భోగంగానే వున్నంతకాలమూ అది అశాంతమే, అతృప్తమే వ్యథాభరితమే.కాగా అది తప్పనిసరిగా వితృష్ణాజనకము, విక్రయాజనకము అయితీరుతుంది. యోగావశ్యకతకు దారితీయకుండా ఉండటంఅనేది భోగంయొక్క వశంలోవున్న అంశంకాదు. అనగా భోగంలోనుంచి ఒకనాడు యోగం ఉత్పన్నంకావలిసిందే. ఈ నమ్మకంతోనే మనం భోగంపట్ల సహిష్ణువులంగా, సహానుభూతిపరులంగా మెలగటం నేర్చుకోగలము.

ప్ర : భోగమునుండి వితృష్ణ ఉత్పన్నమైనప్పుడు భోగభాజనమైన వస్తువుపట్ల లేక వ్యక్తిపట్ల కూడ తప్పనిసరిగా అసహ్యం కలుగుతుందా ?

జ : ఔను, అలాగూ జరగవచ్చు. కాని తప్పనిసరిగా కలగవలెనని లేదు. స్వయంగా భోగమే అసహ్యాన్ని పుట్టిస్తుంది. కాబట్టి ఏహ్యాభావం భోగాన్ని ధ్వంసం చేయలేదు; పైగా దాన్ని మరింత పుష్టివంత చేయవచ్చుకూడా. భోగభాజనమైనవస్తువునందు ప్రేమ వున్నప్పుడే భోగమునుండి విరాగం సంభవమౌతుంది. అనగా భార్యమీద వుండే ప్రేమే ఒక్కొక్కప్పుడు మనలో నిష్కామపరతను జాగృతం చేస్తుంది. పరస్పరభోగం వున్నంతకాలం అక్కడ ఏహ్యాభావబీజాలుకూడా వున్నాయన్నమాటే. భోగవితృష్ణభోగభాజనమౌతున్న వ్యక్తియెడల విశ్వాస పూర్వకంగానే నాగుతూన్నట్టయితే ప్రేమభావాన్ని పెంపొందించటంలోనే సహాయకారి ఔతుంది.

ప్ర : అంటే — మనిషి తన భోగవాసనలవిషయంలో ఒక హద్దు, మర్యాద ఏర్పరించుకోవలసిన అవసరం లేదా ? తన ఇచ్ఛానుసారం ఆభోగ వాసనలబురదలో అంతకంతకు దిగబడిపోతూవుండవలసిందేనా ?

జ : హద్దు, మర్యాద ఎవరు ఏర్పరించాలి ? తనకు తానేగా ! తనకు తానే ఏర్పరచుకుంటున్నాడంటే అర్థంఏమిటి ? ముందుగా అటువంటి ఇచ్ఛ ఒకటి కలిగి, తదనుసారమైన ప్రయత్నంచేస్తున్నాడన్నమాటేగా ! ఇచ్ఛాను సారమైన ప్రవర్తనకాదూ మరి అది ? కాబట్టి తన ఇచ్ఛానుసారమైన ప్రవర్తనలేనప్పుడే మర్యాద(లేక హద్దు) వినష్టమైపోతుందని నాఅభిప్రాయం. ఎందువల్లనంటే — హద్దులను, మర్యాదలను సృష్టించేది ప్రేమ. ప్రేమలేక పోవటమే అవి భ్రష్టంకావటానికి హేతువు. నిజానికి లోలోపల మనం ప్రేమస్వరూపులమే. కాగా ఆత్మానుసారమైన ప్రవర్తన మర్యాదాశీలమే ఔతుంది; సామాజికనియమాల్ని, హద్దుల్ని అదే నిర్మిస్తుందికూడా. దానివల్ల మర్యాద భంగమైపోతున్నట్టు కనిపించుతున్నదంటే అది ఒక భ్రమమాత్రమే. నిజానికి దానివల్ల భగ్నమైపోయేది బూజుపట్టిన ఏదోఒక పాతసాంప్ర దాయమే. ఆ పాతసంప్రదాయం పోయాక దాని స్థానంలో ఒక సజీవమైన క్రొత్తరీతి, పద్ధతి కుదురుకుంటుంది.

ప్ర : వాసనాతృప్తికోసం మానవుడు యత్నిస్తున్నకొద్దీ అది నానాటికి పెచ్చుపెరిగిపోతూ, సర్వథా మర్యాదానియమాల్ని ఉల్లంఘిస్తూవుండటమే మనం ప్రపంచంలో చూస్తూఉన్నాం. అందులోనుంచి మనిషికి విడుదల పొందేదారి కనిపించకుండావుంది. అటువంటివ్యక్తికి మర్యాదానియమాల్ని జ్ఞాపకంచేసేందుకు మరోవ్యక్తి సాయపడగలదా ?

జ : ఏమాత్రం సాయపడలేదు. ఎందువల్లనంటే—మరోవ్యక్తిచేత జ్ఞాపకంచేయించుకోవలసిన అవసరం ఏముందక్కడ ? మర్యాదస్థుడైన ఒక పురుషోత్తమునికి మర్యాదానియమాల్ని జ్ఞాపకంచేయటమా ? అలాగ అనుకోటమే చాల ప్రమాద హేతువు. కాని ఈ నా మాటల్లో యథార్థంగా వున్న అర్థమే గ్రహించాలి. అంటే- -సహానుభూతి లేకుండా అందింపబడే సాయం గాని, ఉద్ధరిద్దామన్న ప్రయత్నంగాని నిష్ప్రయోజనం.

ప్ర : అటువంటివ్యక్తి ప్రవర్తనవల్ల ఆ ప్రభావం కొంత ఇతర్ల జీవితంపై పడవచ్చు. వాళ్ళకు కొన్ని కష్టాలు ఏర్పడవచ్చు. ఆకష్టాల్ని నివారించుకునేందుకు వాళ్ళేంచెయ్యాలి మరి ?

జ : నీ సమస్య ఎప్పుడూ మరొకరిలోనించి ఉద్భవించదు. నీకున్న సమస్యను మరొకరిమీద వేసి పరిష్కారంవైపు పురోగమించలేవు. విచారమనేది ఎల్లప్పుడు స్వకీయం. పరాత్మవిచారం మిథ్య.

ప్ర : పరాత్మనుగురించిన ప్రశ్నేముంది ? స్వకీయమైనప్రశ్నే అడుగుతున్నాను. మనకు దగ్గరగావుండే ఒకానొకవ్యక్తి ఆచరణవల్ల మనమీద వచ్చిపడే కష్టాలనుండి మనకు విముక్తిలభించే ఉపాయం ఏమిటి ? ఉదాహరణకు ఒక త్రాగుబోతు, వ్యభిచారి అయిన భర్తమూలాన భార్యకు వచ్చే కష్టాలు తొలగడం ఎలాగ ?

జ : అందుకు ఉపాయం ఏమిటంటే—(1) త్రాగుబోతు కేవలం త్రాగుబోతు, అవగుణుడు మాత్రమేకాదనీ, పైగా గుణవంతుడుకూడాననీ భార్య తెలుసుకోవాలి. అవగుణుడన్న భావనకంటే ఎక్కువగా గుణవంతుడే నన్న విశ్వాసము, ఆ గుణములపట్ల శ్రద్ధ కలిగివుండాలి. ఆ విశ్వాసాన్ని శ్రద్ధను ఎన్నడూ కోలుపోరాదు; (2) ఇలా వుండటంవల్ల్...ఆమె తనకు

సంభవించే సకల కష్టాల్నీ తేలిగ్గా సహించగలుగుతుంది. తనకువచ్చిన బాధల్ని అతనిమీదికిరూడా విసిరికొట్టి అతన్నికూడా బాధించదు. జ్వరంవచ్చిన పసిపిల్లవాడినివలె అతన్ని సేవిస్తుంది; (3) తరువాత అతనిచేత త్రాగుడు మాన్పిస్తుంది; (4) ఒకప్పు డామెచేసే సదుపదేశంవల్ల మంచి లభించక పోగా వ్యతిరేకపరిణామం ఏర్పడవచ్చు. అప్పుడామె అతనికేమీ చెప్పటమే మానేస్తుంది. యథావిధిగా సేవిస్తూమాత్రం ఉంటుంది. అందువల్లకూడా వ్యతిరేకపరిణామమే సంభవిస్తున్నట్లు కనిపిస్తే....నా అంతస్సులోని సాధు త్వముపట్ల నాకు ఉండవలసిన నిష్ఠ తగ్గిపోయింది కాబోలు !....నా సేవా తత్పరతలో లోపం వచ్చిందేమో !....అని తనకు తాను అనుకుంటుంది; అతనియెడల తటస్థురాలుగా వుంటూ....అతనిపట్ల తనకుండవలసిన సంవే దన ఇంకా హెచ్చుకావలెనని కోరుకుంటూ....ఈవిధంగా తన్ను తాను సంస్కరించుకునేందుకు, సముద్ధరించుకునేందుకు ప్రయత్నిస్తుంది.

ప్ర : ఇంట్లో భార్య ఉన్నాకూడా ఒకవ్యక్తి ఇతరత్రా తిరుగుతూ ఉంటాడు. అటువంటి కాముకతకు మీరేదైనా మనోవైజ్ఞానిక కారణం చూపించగలరా ?

జ : అది అతని మేలుకోరేవారి ఆలోచనకు అందవలసినదే. నిశ్చ యంగా అతడేదో ఒక ద్వంద్వంలోపడి కొట్టుకుంటున్నాడన్నమాట. ఆ వివశత అతనిలోవుండి అతనిచేత అలా ప్రవర్తింపజేస్తున్నది. అతనియెడల మనం క్రూరంగా వ్యవహరించేట్టయితే అతడా దారినుంచి వెనక్కు మరలు తాడన్న నమ్మకం నాకు లేదు. అసలు కామం అనేది ఎప్పుడూ కేంద్రహీన మైనది. అది అన్నివైపులకూ పరుగెత్తుతూఉంటుంది. వ్యక్తియొక్క శ్రద్ధలో వుంటుంది కేంద్రం. శ్రద్ధలేనివాడు కామవివశుడు కాకుండా వుండటం అసంభవం. కాబట్టి నువు దేనికైతే కార్ణం అడుగుతూవున్నావో, అది నేను అకారణము లేక ప్రకృతము అని చెప్పినా ఇబ్బందిలేదు. భార్యను కామ్యవస్తువుగా, భోగ్యవస్తువుగా పరిగణించేట్టయితే, ఏదొంగదారినో ఉప పత్నికూడా వచ్చితీరవలసిందేగా ! భార్య అంటే సహధర్మచారిణి అనే పరిగణనవున్నప్పుడే అటువంటి అనర్థంనుంచి ముక్తిలభిస్తుంది.

ప్ర : శ్రద్ధ అంటే మీఉద్దేశం ?

జ : ఎందులోనైతే తనను తాను సమర్పించుకోవాలని—ఆ సమర్పణలో తనను తాను నిశ్శేషం చేసుకోవాలని వాంఛ ఉంటుందో అదే శ్రద్ధ. నేను పుచ్చుకోవాలి, నేను అనుభవించాలి అన్నది కామలక్షణం.

ప్ర : కాముకవ్యక్తి ఎల్లప్పుడూ శ్రద్ధావిహీనుడుగానే వుంటాడా ?

జ : ఎల్లప్పుడూ కాముకుడుగానే ఎవడూ ఉండడు. అనగా కాముకతకుకూడా ఒక హద్దు తదనుసారంగానే శ్రద్ధావిహీనతకూడా ఎల్లప్పుడూ ఉంది. ఉండదు. తెలిసిగాని, తెలియకుండాగాని అందరిలోనూ కించిత్తు శ్రద్ధ ఉంటుంది. ప్రతివ్యక్తికీ జీవితంలో ఏవరో ఒకానొక స్త్రీపట్ల కాముకతకన్న ఎక్కువగా భక్తిభావమే తొణికిసలాడుతూవుంటుంది. అటువంటిస్త్రీ ఒకతె ప్రతివ్యక్తికీ అవశ్యం ఉంటుంది. అతడామెపాదాల్ని తలమీద పెట్టుకుంటాడు. ఆమెపట్ల అతనికి భోగవాంఛ కలలోకూడా ఉత్పన్నంకాదు.

ప్ర : కాముకులను, భోగులనుకూడా మీరు పాపులుగా పరిగణించరా? ఇంతకూ కాముకులంటేనూ, శ్రద్ధావంతులంటేనూ, వారివారి గతులనూ విడివిడిగా విశదపరచి చెప్పుతారా ?

జ : ప్రతివ్యక్తి తన ప్రేమసార్థకతను అనేకరకాల సంబంధాల ద్వారా పొందుతున్నాడు. అవి అన్నీ పరస్పరం విశిష్టమైనవే. ఒకేవ్యక్తి ఒకరికి తండ్రి, ఒకరికి తోబుట్టువు, మరొకరికి పుత్రుడు, ఇంకొకరికి భర్త ఔతున్నాడు. ఈ అన్నిసంబంధాలకూ వాటివాటి మర్యాదలు ఉన్నాయి. అందుచేత ఇందులో ఏఒక్కటీ సమగ్రమైన సంబంధం కాదని చెప్పవచ్చు. ఒకరియెడల ఆదరంచూపాలి, సేవించాలి. మరొకర్ని లాలించాలి, బుజ్జగించాలి. మరొకరిపట్ల వుండేది స్నేహం, సహానుభూతి. ఇంకొకరి యెడల కామం. సేవ, మమత, స్నేహం, కామం - ఇవి నాలుగు వేరువేరు తత్త్వాలైనప్పటికీ, విడివిడిగా దూరంగా ఉండేవి అయినప్పటికీ, జీవితంలో వాటికి వేరువేరు గదులంటూ లేవు. అందుచేత వ్యవహారంలో తరచు గడబిడ కలుగుతూఉంటుంది. సాధారణంగా ఈ సంబంధాలన్నీ ఒకదాని కొకటి పూరకములే. కాని ఏకొంచెం ఏమరుపాటుగావున్నా ఒకదానిపై ఒకటి ఆక్రమణ సాగిస్తాయి. ఇలా వివిధ సంబంధాల పృథక్కరణంవల్లనే వదినా

ఆడుబిడ్డలమధ్య, అత్తాకోడళ్ళమధ్య, ఇంకా వారివీరిమధ్య పొరపులు పోట్లాటలు సంభవిస్తున్నాయి. సకామత్వం ఇలా ఒకరకమైన విపరీత ప్రవర్తనకు హేతువౌతుంది. దీని పరిణామం ఏమిటంటే—పురుషుడొకతెకు భర్త మరొకతెకు ప్రేమికుడు ఔతున్నాడు; లేదా స్త్రీ ఒకనికి భార్య, మరొకనికి ప్రేయసి ఔతున్నది. ఒకేస్త్రీకి... భర్త అనబడేవానిద్వారా ఛీత్కారం, తిరస్కారం లభిస్తూంటే మరోపురుషునిద్వారా సత్కారం, పురస్కారం లభిస్తున్నాయి. అదేపురుషుడు, అదేస్త్రీ; కాని ఆ యిద్దరిలోనూ ఒకరూపం అభ్యర్థనీయంగానూ, మరొకటి తిరస్కరణీయంగానూ కనిపిస్తున్నది. తండ్రిచేత తీవ్రమైన చెంపదెబ్బలు తినటానికిమాత్రమే యోగ్యురాలని భావించబడే ఒకానొక ఆడపిల్లపాదాలముందు తన హృదయపూజ యావత్తూ సమర్పించుకుంటాడొక యువకప్రేమికుడు. ప్రతివ్యక్తీ తన సమగ్రప్రేమపరిపూర్ణతను అన్నివైపులా వెతుక్కుంటూ, పొందుతూ ఉంటాడు, ఈ సందర్భంలోనే అటువంటి వైచిత్ర్యాలు సంభవమౌతున్నాయి. ఇందుకుగాను అతడు తన ప్రేమను అనేక విభావాల్లోనూ, విభాగాల్లోనూ విభక్తంచేసుకుంటున్నాడు. ఇది భోగియైన పురుషుని రీతి, గతి. ఇందులోని విషమపరిస్థితి స్పష్టంగా గోచరిస్తున్నది. ఇక యోగిఅయిన పురుషుడు అవిభక్తుడు. అతనికి అందరియందు సమభావం ఉంటుంది. అతని రాగం విభక్తం కాదు; విషమంకాదు. అందుచేతనే అతనిలోని సమభావానికి విరాగపరిభాషనుకూడ అన్వయింపజేస్తున్నాం. వైరాగ్యమంటే అసలైన అర్థం ఇదే. ఇందుకు భిన్నమైన మరో అర్థమేదో చెప్పటం దాన్ని అపార్థంచేసుకోటమే. ఉన్న చిన్న భేదం ఏమిటీ అంటే—అతనిలోని రాగము రాగముకాదు, ప్రేమ. అందులో ద్వేషానికి తావులేదు. అతని ప్రేమ అఖండము. వేరువేరు స్త్రీలపట్ల అది వేరువేరు రూపాలుగా ప్రసరించేది కాదు. అది ఒక్కొక్కరికీ అందరికీని సంపూర్ణ రూపంలో ప్రదత్తమౌతున్నది. కనుక ఏకాంగమైన ఏ విశేషణంకూడా దాని పూర్ణభావాన్ని వ్యక్తంచేయజాలదు. దాన్ని ఎవరు ఏ రూపంలోగ్రహిస్తారో ఆరూపంలోనే పొందుతారు అని చెప్పవచ్చు. కృష్ణునియెడల రాధకుగల ప్రేమను ఏవిశేషణం సమగ్రంగా వర్ణించగలదు? అన్నిభావాలూ అందులో వున్నాయి; లేని భావం అంటూ ఏదీ లేదు. కనుక దాన్ని 'నిర్గుణం, అతీంద్రియం' అనికూడా అనవచ్చు.

ప్ర : పాపం అని దేన్ని అంటారు మీరు ?

జ : ద్వంద్వమే పాపం.

ప్ర : ద్వంద్వంనుంచి విముక్తికి మార్గం ?

జ : కర్మ వాక్కునుంచి, వాక్కు మనస్సునుంచి, మనస్సు ఆత్మ నుండి ఆదేశాన్ని గ్రహించి పాటిస్తూవుండాలి. ఈవిధంగా మనోవాక్కర్మల ఐక్యత, తద్వారా ఆత్మయోగం సాధ్యమౌతుంది. ఇక దంద్వానికి తావు లేకుండాపోతుంది.

ప్రశ్న : శ్రీకృష్ణునియెడల రాధకుగల ప్రేమలో ప్రేయసీభావమేకదా వున్నది ? దానికి మరోరూపం ఎలా ఇవ్వగలం ?

జ : అంటే—అందులో వాత్సల్యం, భక్తి, మైత్రీభావం మొదలైన వాటికి అవకాశం లేదంటావా ? ఊహుఁ. నే నలా అనుకోటంలేదు ! వారిది కేవలం కామోద్వేగంతోకూడిన సంబంధమే అయితే అందులో ద్వేషం, హింసకూడా తప్పనిసరిగా వున్నాయన్నమాట. కాగా అది పవిత్ర పూజ్య భావంతో చూడదగినది కాదన్నమాట. నా ఉద్దేశంమాత్రం ఏమిటంటే – రాధప్రేమ అత్యంత సమగ్రమైనది. దాన్ని ప్రేయసీప్రేమగా మాత్రమే నిర్వ చించటం సబబుకాదు. అదికేవలం ఏకాంగీణమైన అభిప్రాయమే అవుతుంది.

ప్ర : రాధవిషయంలో కృష్ణుడు పరపురుషుడు. ఆమె అతన్ని ప్రేమించటంవల్ల ఆమెభర్తహృదయంలోనూ, భర్తగృహంలోనూ ఒక విరోధభావం, ఒక ద్వేషభావం వ్యాపించివుండదా ? అయినాకూడా అటువంటి ప్రేమను సమగ్రమైనదని మీ రెలాచెప్పగలరు ?

జ : ఆరంభంలో విరోధభావం ఉత్పన్నమై యుండవచ్చు. అది సంభవమే. కాని అది చివరిదాకా నిల్చివుండి వుండదు. 'సమగ్రం' అన్న విశేషణం వాడింది కేవలం ఒక్క రాధను దృష్టిలో పెట్టుకునే; మరేయిత రుల దృష్టినీ దృష్టిలోపెట్టుకొని కాదు. కాముకులవాంఛలోనే హింస, ఘృణా భావాలు అంతర్గర్భితంగా ఉండనే వుంటాయి, కాని రాధవిషయంలోమాత్రం అలాకాదు.

ప్ర : రాధవిషయంలో అలా కాకపోవటం ఎందువల్ల ?

జ : అటువంటికాముకత అభావాన్ని, వియోగాన్ని సహించదు. ఒకప్పుడు పొంగులా ఉబికివస్తుంది; కాని మళ్ళీ కాసేపటికి చప్పగా చల్లారి పోతుంది. అందులో ఒక పోటీభావం తప్పనిసరిగా ఉంటుంది. దానిఅడుగున వైషమ్యమే ఆధారపీఠం. రాధజీవితంలో ఇటువంటి లక్షణాలేమీ లేనేలేవు. కృష్ణునిమీది భక్తి....కృష్ణుడు దగ్గరలేకపోతే ఎప్పుడైనా ఆమెహృదయంలో సన్నగిలిందా? లేక ఆమెజీవితంలో అది ఎట్టివైషమ్యాన్నిగాని తెచ్చిపెట్టిందా? లేదు. అటువంటివేమీ జరగలేదు. కనుక అటువంటి ఆమెప్రేమవ్యాపారాన్ని ఏకాంగమైనదిగా అభిప్రాయపడలేము. దాన్ని సమగ్రమైనదిగా సర్వాంగీణముగా అంగీకరించితీరవలసినదే.

ప్ర : అయితే కృష్ణునియెడల రాధకుగల ఆకర్షణ మామూలు యువతీయువకులమధ్యనుండే ఆకర్షణకన్న భిన్నమైనదిగా భావిస్తున్నారా ?

జ : ఔను....

ప్ర : ఎందువల్ల ?

జ : ఎందువల్లనంటే—సాధారణయువతీయువకుల్లో కానవచ్చే పరిణామం అక్కడ లేదు కాబట్టి.

ప్ర : రాధకు కృష్ణునిపైగలిగిన ఆకర్షణకు వెనుకవున్న కారణం ఏమిటంటారు ?

జ : ఇది కఠినమైన ప్రశ్న. బహుశః కృష్ణుని వ్యక్తిత్వమే ముఖ్య కారణమై ఉండవచ్చు.

ప్ర : పవిత్రప్రేమను మాత్రమే ఆకర్షింపజాలిన అటువంటివ్యక్తిత్వం ఏ యే తత్త్వాలతో సమీహితమై ఉంటుంది ? ఈవిషయాన్ని మీరు విడమరిచి చెప్పగలరా ?

జ : పవిత్రత అనే శబ్దం మళ్ళీ 'రుచి' 'అరుచి' అనే భావాల్ని తెచ్చిపెడుతున్నది. మామూలుగా మనం ప్రేమను వేరు వేరుగదుల్లో విభక్తం

చేశాం; శరీరంవున్నచోట అపవిత్రతను. అది లేనిచోట పవిత్రతను ప్రతిష్ఠిస్తున్నాం. నేనుమాత్రం సమస్యను అలా చూడను. అపరిపూర్ణత అనగా తృష్ణార్తి అనే నా అభిప్రాయం. పరిపూర్ణమైనది ... అంటే ఆత్మార్పణమందు తనదీ అన్నదేదీ.... తన అంగాలనుకూడా.... మిగుల్చుకోకుండావుండేది ఏదో అదే సత్యమైనది. పవిత్రతకుకూడా అది ఆదర్శమైనది. పవిత్రత అనబడేది దాన్ని కప్పివేయజాలదు. రాధప్రేమను అపవిత్రమని చెప్పలేము. పైగా అది పవిత్రత అనబడేదానికన్న మించిపోయినటువంటిది. అది పవిత్రమైన దనిమాత్రమే పలికి వూరుకుండటానికి వీల్లేదు.

ఇకపోతే 'ఇటువంటి సమగ్రప్రేమను ఆమెలో ఉత్పన్నంచేయజాలిన శక్తి అవతలవ్యక్తిలో ఏమివున్నది?' అనే ప్రశ్న! అందుకు జవాబుగా కృష్ణుని పేరు ఉదహరించటమే చాలు. అంతకన్న ఎక్కువగా వ్యాఖ్యానింపబూనటం అనవసరం. పూర్వతరాలవారు శ్రీకృష్ణుడంటే భగవత్స్వరూపమే అనుకున్నారు. అలాగే వారు ఆయన్ను చూడటం సంభవించింది. కాని శ్రీకృష్ణుడంటే ఒక సశరీర సీమిత వ్యక్తిగానే పరిగణించేవారికి కృష్ణనామంతో సంతృప్తి ఎలాకలుగుతుంది? కాబట్టి కృష్ణనామం ఉదహరించినంతమాత్రాన చాలదు; రాధహృదయంలో అటువంటి సమగ్రమైన, పవిత్రమైన ప్రేమను ఉత్పన్నంచేయజాలినశక్తికి.... మనకు అర్థమయ్యే పేరొకటి పెట్టవలసిన స్థితి ఏర్పడింది. కృష్ణునిలో ఒక నిష్కామకామన ఉంది, ఒక ప్రఫుల్లజీవనావేగం ఉంది; అహంకృతివాసన లేదు. అతనిలోని ప్రేమ స్వకీయమైనదిగా గాక, మానవీయముగా ప్రసరించింది. ఆ ప్రేమలో ఆయన తనకోసమని యాచించినదేమీ లేదు. అది కేవలం ప్రకృతమైవున్న ఒక ఆనందాకర్షణ.... అంతే.

ఈతత్త్వం నీకుగాని, నాకుగాని, సామాన్యంగా అందరికీ అననుభూతము, అపరిచితము అనుకోటానికి వీల్లేదు. సాధారణంగా అది అందరికీ జీవితంలో అనుభవంలోకి వచ్చేటువంటిదే. మనం ఎల్లవేళలయందూ ఇంద్రియాధీనులముగానే ఉండిపోము. అతీంద్రియప్రేమ అనబడేది అనుభవంలోకి వచ్చే క్షణాలు కొన్ని అందరికీ అప్పుడప్పుడు లేక ఎప్పుడో

ఒకప్పుడు లభిస్తూనే ఉంటాయి. అట్టి అతీంద్రియప్రేమ నైజంచేత (అహం చేత) కప్పబడిపోయేది కాదు. నైజమే (అహమే) అందులో మునిగిపోయి అంతర్హితమౌతుంది.

మనకు ఏక్షణంలోనో ఎప్పుడో కొనంతసేపు అనుభూతమయ్యే ఇటు వంటిభావం శ్రీకృష్ణునిలో మిక్కిలిగా స్థిరీభూతమైవున్నదని విశ్వసించటం శ్రద్ధాయుక్తమైన మనస్సుకు అసంభవంకాదు.

ప్ర : కనుక ఆవిధంగా స్థాయీరూపంలో వుండే మానవీయమైన ప్రేమనే మీరు 'యోగం' అంటారా ?

జ : ఔను.

ప్ర : అటువంటి యోగియైన పురుషునికి అందరియెడల ఒకేభావం వుండాలికదూ ! ఒక్క రాధే అన్ననూటేమిటి, సమస్తవిశ్వమూ అతనికి రాధామయాంగానే కనిపించివుండాలికదూ !

జ : ఇంద్రియాల మధ్యమం (midium) ద్వారా మనకు విభేదం గోచరిస్తున్నది; కాని 'అభేదానుభూతి' అంటే దానిపట్ల కేవలం గుడ్డితనం వహించటంకాదు. అభేదంలో విభేదం సమీహితమైవుంది, విలుప్తంకాదు, అనగా మామూలువ్యవహారాల్లో తిరుగుతూవుండే మనిషివలెనే వ్యవహరిస్తూ వుండటం యోగికి దుస్తరంకాదు; పైగా చాల తేలిక. వ్యావహారికప్రవర్తన భేదదర్శనంమీదనే ఏర్పడుతుంది. అభేదానుభూతిపై వుండే శ్రద్ధవల్ల ఇంద్రియ దర్శనం వినష్టంకాదు; పైగా విస్పష్టం ఔతుంది. అట్టి దర్శనసాపేక్షత (relativity) ప్రతిక్షణమూ ప్రత్యక్షంగా ఉంటుందికాబట్టి తత్సంబంధమైన బంధనం మాత్రమే అతన్ని అంటకుండా నశించిపోతూఉంటుంది. దాని ఉపయోగంమాత్రం సమాప్తమైపోదు.

ప్ర : ఇంద్రియాలద్వారా కనిపించే విభేదంపట్ల, 'అభేదానుభూతి' అంటే కేవలం గుడ్డితనం కాదు—అనటంలో మీ ఉద్దేశం ఏమిటి ? లౌకిక వ్యవహారం యోగికి సహజం ఎలా ఔతుంది ? అభేదానుభూతిపట్లవుండే శ్రద్ధవల్ల ఇంద్రియదర్శనం విస్పష్టం ఎలా ఔతుంది ? ఇంద్రియాలద్వారా

ప్రవృత్తుడు అయిన యోగికి బంధనం సడలిపోవటం ఎలాగ? ఈవిషయా లన్నీ నాకేమీ బోధపడటంలేదే!

జ: ఇంద్రియాలద్వారా మనకు అనేక రంగులు, ఆకారాలు, స్వభావాలు ప్రతీతమౌతున్నాయి. తల్లి, తోబుట్టువు, ఆలు, కూతురు; పచ్చన, నలుపు, తెలుపు; చిన్న, పెద్ద; ఉచ్చము, నీచము—ఈ మొదలైనవన్నీ ఇంద్రియాలయందు ప్రవర్తమానమౌతున్న బుద్ధిద్వారా గ్రహిస్తున్నాం. యోగంలోని అభేదనిష్ఠ అంటే అభిప్రాయం....ఈ భేదాత్మకప్రతీతి అనుపలబ్ధమైపోవాలనికాదు.

భేదాత్మకప్రతీతి వుంటూనే, అడుగున అభేదాన్నికూడా గుర్తించిన యోగికి సమన్వయసాధన చాల సులభమైపోతుంది. చిన్నాపెద్దల మధ్య, ఉచ్చనీచాల మధ్య, ఇల్లాలుతోబుట్టువుల మధ్య, నలుపుతెలుపుల మధ్య వైరుధ్యాన్ని భావించే సంకటావస్థలో అతడు పడడు. ఈవిధంగా లౌకిక వ్యవహారప్రవర్తనము ఇతర్లకంటే అతనికే ఎక్కువ సహజం ఔతుంది.

భిన్నభిన్నములైనవి ఎక్కడివక్కడ తమతమ స్థానాల్లోవుంటూ, పరస్పరం ఒరసికొని, రగడచేయకుండావుంటే— అక్కడ దృష్టి విస్పష్టం అయేఅవకాశమే ఉంటుంది.

విభేదం రాగద్వేషాల్ని ఉత్పన్నంచేస్తూ, ఒకరిలో రతి, మరొకరిలో జుగుప్స సృష్టిస్తూఉన్న లావున వైజ్ఞానికదృష్టి ఉండదు; సమభావం నశించిపోతుంది; వ్యక్తికి కాలు, చేయి ఆడని నీరసపరిస్థితి ఏర్పడుతుంది. యోగిపురుషునికి ప్రతిఒక్కపరిస్థితి ఒక అధిష్ఠానం. భోగవృత్తి ఏర్పడిందంటే ఆ పరిస్థితి అతనికొక తెప్పలాంటిది ఔతుంది.

ఏమిటి? ఇంకా నీకు విషయం ఇదివరకటిలాగ అస్పష్టంగా లేదని భావించవచ్చునా నేను?

ప్ర:- ఏ ఒక్క పరిస్థితీ యోగిపురుషునికి బంధనహేతువు కానప్పుడు మరి ఇతర్ల సుఖదుఃఖాల ప్రభావం తనపై పడకుండాకూడా అతీతుడుగా వుంటాడా?

జ: ఉండడు. కాని వాటివల్ల అతనికి ఉత్తరోత్తరా ఆత్మసామరస్యం

ఏర్పడుతుంది. లాంతరు వెలిగిస్తాం. లోపలి దీపపు ప్రకాశాన్ని చిమ్నీ అడ్డగించదు సరిగదా, బైటికి ప్రసరించేందుకు సహాయకారి ఔతుంది; లోపలి దీపాన్ని సురక్షితంగా వుంచుతుంది. యోగిపురుషుని విషయంలోకూడా పరిస్థితి చిమ్నీవంటిరూపాన్నే తాలుస్తుంది. అర్థాత్తూ అది అతన్ని బంధించదు; స్వస్థునిగా, ప్రకాశవంతునిగా చేస్తుంది. వాంఛాగ్రస్తుడైన కాముకపురుషుడైతే ఆ పరిస్థితిపరిధితో అమాంతంగా ఢీకొని దాన్ని జడంగా, స్తబ్ధంగా తయారుచేస్తాడు. నిషేధపూర్వకంగా ఢీకొని దాన్ని మొద్దుబారిపోయేలాగ చేస్తాడు. స్వీకారపూర్వకంగా ఆత్మీయతచూపి దాన్ని సమైక్యం చేసుకోడు. భోగవృత్తికీ, యోగవృత్తికీ గల మూలవిభేదం ఇదే. దీన్ని అర్థంచేసుకొనటంలో కష్టం ఉండనక్కర్లేదు.

ప్ర : సుఖదుఃఖాలచేత ప్రభావితుడౌతూకూడా ఒక వ్యక్తి ఆత్మసామరస్యాన్ని, బ్రహ్మానందాన్ని, ద్వంద్వాతీతసుఖస్థితిని ఎలా పొందగలడు ?

జ : ద్వంద్వాతీతమైన అవస్థ అంటే— అది సుఖస్థితీకాదు, దుఃఖస్థితీ కాదు. అదొక అనిర్వచనీయమైన అవస్థ. యోగావస్థ అనబడేదాని సంపూర్ణ అర్థంలో నిర్ద్వయితము, నిర్ద్వంద్వము ఇమిడిఉన్నాయి— అని భావించేందుకు వీల్లేదు. మరి అది ఎలాంటిదీఅంటే—ఆస్థితిలో అతనికి సంబంధించినంత వరకు ద్వైతంగాని, ద్వంద్వంగాని అన్నివైపుల విముక్తమై ఏకస్థమై యేకాగ్రమై. తాను, భగవంతుడు. ఆత్మ, పరమాత్మ అనబడే ద్వైత— ద్వంద్వ రూపంలో ఉండిపోతుంది. ఇటువంటి అగాధమైన వ్యథను, వియోగాన్ని సుఖస్థితి అనాలో దుఃఖస్థితి అనాలో నేను నిర్ణయించలేకపోతున్నాను. ఈ స్థితి ఇతర్ల సుఖదుఃఖాలనుంచి తెగత్రెంపులు చేసుకుని పోయి దూరంగా వేరుగా విరాజమానమయ్యే స్థితి కాదు. పైగా వాటితో ఉత్తరోత్తరా యేకీకరణమును పొందజాలినది. కాగా....జీవాత్మ-పరమాత్మల మధ్యనుండే ఈ విరహవేదనకూడా ఉండని ఆ నితాంత నిర్మల కైవల్యావస్థను శబ్దరూపంలో ఈ నోటితో నే నెలా వర్ణించగలను ?

ప్ర : ఇతర్ల దుఃఖంతో ఉత్తరోత్తరా యేకీభావం పొందుతుందంటే మీ ఉద్దేశం....సాధారణమానవునికన్నా యోగిపురుషుడు ఎక్కువ వేదన

అనుభవిస్తాడనేగా? ఇతర్ల దుఃఖాలను పురస్కరించుకుని అలా ఆందోళి తుడు కావటంలో ఈశ్వరీయమైన న్యాయంపట్ల అశ్రద్ధ ద్యోతకం ఔతున్నది కదా?

జ: లేదు. ఈశ్వరీయమైన న్యాయాన్ని స్వబుద్ధికి ఆకళింపుచేసుకో జాలిన అసమర్థతే ద్యోతకంఔతున్నది. ఈఅసమర్థత అనే పెట్టుబడినుంచి ప్రయత్నం ఆరంభమౌతున్నది. వ్యక్తిలోని ఈఅసమర్థత భగవంతుడిచ్చినదే. ఎందుకిచ్చినట్టు? మానవుడు నిరంతరం జీవితాన్ని పురుషార్థసాధనలో విని యోగిస్తూ, కాలానికి సార్థకవికాసాన్ని కలిగిస్తూ ఉండాలనే. అకర్మణ్య త్వాన్ని నాస్తికతాలక్షణంగా పరిగణించవచ్చు. ఆస్తికభావంలో నిరంతరము ప్రబుద్ధకర్మాచరణ ప్రస్ఫుటితమౌతూ ఉండవలసిందే.

ఔను. వేదనే భక్తుని మూలధనం. దాన్ని అతడు భగవంతుని పరమప్రసాదంగా స్వీకరిస్తాడు. విశ్వంలోని సమస్త వేదనాభారమూ తన దిగా మోయగాలిగేందుకే అతని సాధన. ఇక అలా కాకపోతే మిగిలింది అహంకారమే. ఆస్తికత్వంకాదు.

ప్ర: ఈశ్వరునిమోలిల తన అసమర్థతను గుర్తించిన కారణంచేత మానవుడు తాను చేసేదియావత్తూ...."ఈశ్వరుని ఆజ్ఞ ఎంతవరకో అంత వరకేగాని ఆ పైని నా వశం కాదు" అన్న దృష్టితోనే చేస్తాడు; అందువల్ల పనిలో స్వకీయమైన పట్టుదల వుండకూడదు. నిరపేక్షదృష్టితో చేయాలి.... అంతేనా?

జ: ఔను. ఆస్తికత్వంకారణంగా అతనిలో కృషిమాంద్యం ఏర్పడే అవకాశం లేదు అయితే....కర్తృత్వాహంకారంకూడా అతనిలో ప్రవేశింప జాలదు. ఆత్మాభిమానంతోకూడిన పట్టుదల వుండదు. ఫలాసక్తి వుండదు. ఎటువంటి నిరాశగాని, ఉద్వేగంగాని ఉండవు. బుద్ధిసంబంధమైన, ఇంద్రియ సంబంధమైన జ్ఞానంలోనూ, శ్రద్ధాగతవిశ్వాసంలోనూ, కొంచెం వ్యత్యాసం ఉండకపోదు. ఈ వ్యత్యాసాన్ని తొలగించుకోవాలన్న వికలతలో—అర్థాత్తూ ఇంద్రియగతమైన బుద్ధిని శ్రద్ధాస్థితివరకూ సముద్ధరించుకునే సాధనలో— మంచి అతని సమస్త ప్రయత్నము బయటకు వస్తుంది. అంతరికవికలత

అతని కర్మణ్యదీక్షను ఉద్దీప్తంచేస్తుంది; ఆరిపోనీయదు. లోలోపలి ప్రాణాల వివశతలోనుంచి ప్రేరణలధిస్తూన్న హేతువుచేత అతని కర్మ బాహిరములైన ఆకాంక్షలచేత కళంకితంకాదు. చిక్కుల్ని తెచ్చిపెట్టదు; వాటిని తొలగిం చేస్తుంది.

ప్ర : ఆంతరికవికలతలోనుంచి ఉత్పన్నమయ్యే సర్వాత్మప్రేమ తనకు తానే కర్మయొక్క ప్రధానోద్దేశ్యాన్ని నెరవేర్చటంలేదా ? శరీరంద్వారా కర్మ క్షేత్రంలో ప్రవృత్తుడుకావటం సిద్ధపురుషునికికూడా తప్పదా ?

జ : కర్మ అంటే ఒక ఉద్దేశ్యం కాదు. అథవా కర్మలో ఏదో ఒక ప్రత్యేకమైన ఉద్దేశ్యం అంటూనూ ఉండదు. జీవనస్థితికే అది అనివార్య మైనది. లేవటం, కూర్చోటం, తినటం, త్రాగటం, ఊపిరిపీల్చటం, ఆలో చించటం, చింతన—ఇవన్నీకూడా కర్మలే. ఒక్క క్షణంకూడా శరీరం కర్మహీనమై జీవింపజాలదు. బహుశా కర్మ అంటే మీ ఊహ....రాజకీయ క్షేత్రంలో వినబడుతూవుంటే బృహత్కర్మ, లేదా యోజనాబద్ధకర్మ అని కాబోలు ! ఆదిశనుండి కర్మతత్వాన్ని గ్రహింపబూనటం నా అభిప్రాయాలకు దూరమైపోవటమే. ప్రేమవికలతలోనుంచి ప్రేరణపొందిన కర్మ చిన్నదైనా చాల గొప్పదే అనిపించుకుంటుంది. ఆకాంక్షాజన్యమైన ప్రయత్నంలోనుంచి బయలువెడలిన బృహత్కర్మకూడా కొసంతవిలువైనా లేనిదేకావచ్చు. కాబట్టి ప్రేమనుండి దూరంగావెళ్ళి, జీవనసారం యావత్తూ కర్మయందు విని యోగింపగోరుతున్నానని భావించవద్దు. కాని ప్రేమ ఏనాడైనా కర్మహీనంగా వుండి సార్థక్యత పొందగలిగినదా ? ప్రేమ సేవాభావాన్ని జాగృతంచేయ కుండా, సేవాకర్మను సూచించకుండా ఉండనేవుండనేరదు. దాని చరితార్థత అందులోనే ఉంది.

ప్ర : శరీరంలోనించి స్వతహాగా ప్రేమ వెల్లివిరుస్తూ, ప్రాపంచికచింత లేమీ స్పృశించకుండా, వ్యక్తిని బ్రహ్మానందంలో లీనంచేసుకునే సిద్ధావస్థ మానవునికి శరీరంవుండగా ప్రాప్తించటం అసంభవమా ?

జ : శరీరంలోనించి స్వతహాగా ప్రేమ వెల్లివిరుస్తూ ఉండటమంటే— కంటి చూపులోనూ, చేతి పనుల్లోనూ, కాలి నడకలోనూ—ఇంకా అన్నిటి

లోనూ అదే బయటికి కనిపిస్తూఉండవలెననేగా! మెదడులోని ఆలోచన లన్నీ ప్రేమచేత ఆప్లావితాలు కావలెననేగా! అంటే—అందులోనే తేలి పోతున్నదిగా! శరీరంకోసం శారీరకవ్యాపారాల నిర్వహణమును చాలించు కోవలసిన అవసరం లేదని. శరీరం అంటే అర్థం ఏమిటి? ప్రపంచం అని కాదూ! భౌతికఅర్థంలో శరీరం కొంత పుచ్చుకుంటుంది, కొంత ఇస్తూ వుంటుంది. ఆహార విహారాలు, శ్వాసప్రశ్వాసలు శరీరంతోపాటు అంటిపెట్టు కునే వుంటాయి, కాబట్టి శరీరం ఉన్నంతకాలమూ అలౌకికంగా తయారు కావాలన్న ఆశ అనవసరం. భగవంతునిది ఈప్రపంచం, కాగా వ్యక్తి ప్రాపంచికుడే అవటం భగవత్‌ద్రోహం ఎందుకౌతుంది? భగవంతుడే లేక పోతే ప్రపంచమేలేదు. కాబట్టి భగవంతుడినీ, ప్రపంచాన్నీ శత్రువులుగా నిర్వచించి పోరాడించినందువల్ల ఏమీ ప్రయోజనం కనిపించదు. అశరీరు డైననాడు అకర్మణ్యత్వం దానితోపాటు సహజంగానే లభిస్తుంది. కాని సశ రీరావస్థలో వున్నంతకాలమూ సహజంగా కర్మప్రవృత్తుడు అవటంలో వైపరీత్యం ఏముందీ? కర్మేలేకపోతే ఇక ఆధ్యాత్మరక్షణ ఎలా సాధ్యమో నాకు బోధపడటంలేదు. భక్తి, ప్రేమలు శరీరంద్వారా ప్రకటమౌతూ అనా యాసంగా కర్మస్వరూపం పొందుతాయి. భక్తి తత్పరమైవుంటే, అది కర్మ క్షేత్రంలో ప్రఫుల్లమై, ప్రకటంకాకుండా వుండజాలదు.

ప్ర : సశరీరుడైకూడా యోగి తన ఆత్మను పరమాత్మతో సమైక్యం చేసుకుని, తాను పరమాత్మతో తదాత్మ్యమును అనుభవించగలిగినప్పుడు అత డింకా చేయవలసిందీ, పెట్టవలసిందీ ఏముంటుంది?

జ : భగవంతుడు లీలామయుడు; అతనిలో ఐక్యమై తదాత్మ్యాన్ని పొందినప్పుడు ప్రవృత్తి వుండజాలదని ఎలా నిర్ణయించగలవు? అతడు లీలామయుడు. వ్యక్తికి లీలావిహీనుడయ్యే అధికారం ఎక్కడిది? ఆసక్తి, విరక్తి లేని కర్మే లీల.

# ప్రేమ, రొమాన్సు, వివాహం

ప్ర : ఈనాడు పరిపాటియైపోయిన ప్రేమవివాహాలు సఫలమౌతున్నా యంటారా ?

జ : సఫలంకావటంలేదు. ఆలోచిస్తే సఫలంకాజాలవని కూడా తోస్తున్నది. ఎందువల్లనంటే—వివాహవిషయంలో తల్లిదండ్రుల, గురుజనుల, బంధువుల సహాయోగము, ఆశీర్వాదములంత అవసరమైనదేమీ కాదు ప్రేమ(ఆకాంక్ష)తీవ్రత. వివాహం అనేది ఒక సామాజికసంస్థ. దానిద్వారా....సమాజానికి....ఒక 'యూనిట్' అనదగిన కుటుంబం అవతరిస్తుంది. వివాహమనేది కేవలం ఒక పురుషునికీ, ఒక స్త్రీకీ మాత్రమే సంబంధించినదని భావించటమూ, ఆ సిద్ధాంతం ఆధారంగా వివాహాన్ని జరిగించటమూ చాల పొరపాటు. అలాచేస్తే వివాహానికి భూమిక సామాజికముగాక, కాముకమే ఐపోతుంది. ఇక అటువంటి వివాహంలో సఫలత ఎలా ఉంటుంది ?

ప్ర : ఏం ? సఫలత సిద్ధించటంలో ఇబ్బంది ఏముంటుందీ ? ఆ యిద్దరికీ....ఒకరు లేకపోతే ఇంకొకరికి జీవితం శూన్యప్రాయమేనని అనిపిస్తున్నప్పుడు....వారు పరస్పరం ఒకరొకరిని పొంది....తమ కల్పనలననుసరించి సుఖంగా జీవించలేరా ?

జ : కల్పనల ననుసరించా ? ఊహుఁ. సుఖంగాజీవించలేరు. ఆ కల్పనల ననుసరించి కర్మక్షేత్రంలో దిగేసరికి, సుఖానికి బదులు వారిచేతికి అందేది దుఃఖమే.

ప్ర : కర్మక్షేత్రంలో వారికి ఉత్పన్నమయ్యే ఆటంకాలేమున్నాయి?

జ : అది వారి కల్పనలను త్రుంచివేస్తుంది. తమ కల్పనలను పరిహసిస్తున్నరూపంతో వాస్తవికత లేచి ఎదురువస్తుంది. దానితో వారిలో కోపతాపాలు రేగుతాయి. రుసరుసలు బయలుదేరుతాయి. ఇదివరకు ప్రేమఉండినచోట ఇప్పుడు ఘృణాభావం పుట్టుకొస్తుంది. అసలు ఎవరైనా మామూలుగా ప్రేమించేది వ్యక్తినికాదు; వ్యక్తి అనే ఉపలక్ష్యాన్ని. ఈసంగతి మరచిపో

కూడదు. ఎక్కడైనా ఆసక్తి పూర్వకంగా కేవలం వ్యక్తినే సమాదరించబోతే ఎదురయ్యేది నిరాశే. కల్పన మంచిదే; అది వ్యక్తిని దోషాలనుంచి దూరంగా పైకి తీసుకుపోయి కేవలగుణగణాల్లో నిలుపుతుంది. కాని కామం కేవలగుణగణాలతోనే సాగదు. దానికి సశరీరమైన వ్యక్తి అవసరం. కాబట్టి కర్మక్షేత్రంలో మనకు ఎదురుపడే వాస్తవికత కల్పితాదర్శానికి భిన్నంగానే కాదు, విపరీతంగాకూడా ఉంటుంది. చాల సుందరమైనదని పరిగ్రహించిన దానిలో అసుందరత కనిపించటం మొదలౌతుంది. ఇకనప్పుడు క్లేశజనకము, పాపజనకము అయిన ద్వంద్వం ఉపస్థితమౌతుంది.

ప్ర: ఎదురుగా సుపరిచితంగా వ్యక్తి కనిపిస్తూవుంటే ఉపలక్ష్యాన్ని ప్రేమిస్తున్నామంటారేమిటి?

జ: ఎదురుగా కనిపిస్తున్న వ్యక్తి అంటే—ఉపలక్ష్యమన్నమాటే. లక్ష్యం వ్యక్తే అయితే ప్రేమ మళ్ళీ స్థానాంతరం పొందకూడదు. కాని ప్రేమ కాలక్రమేణా ద్వేషాన్ని కలిగిస్తున్నదంటే, లేదా అది రానురాను నీరసించిపోతున్నదంటే—ఎందువల్ల? ప్రేమకథలన్నింటిలోనూ మనకు తెలియవస్తున్న అంశం ఏమంటే—ఎక్కడెక్కడ ప్రేమవున్నట్టు కనిపిస్తున్నదో అక్కడల్లా దానిలక్ష్యం దాన్ని మించినదే. అనగా తాత్కాలికంగా ఆదర్శంతో సమంగా కనిపించేదాన్నే (అనగా వ్యక్తిని, అనగా ఉపలక్ష్యాన్ని) తెలిసో, తెలియకో మనం ప్రేమిస్తూఉంటాం. ఆ ఉపలక్ష్యముద్వారా మన కలలు మనముందు ఒక చిత్రంలోవలె రూపుకట్టి కనిపిస్తాయి. ఆ ఉపలక్ష్యం ద్వారా మనం మన హద్దుల్ని అతిక్రమించి విముక్తులమౌతున్నట్టు సంభావించుకుంటాం: మనలోని క్షుద్రత విశాలావకాశంలో ఎగిరిపోతున్నట్టు అనుభవిస్తాం। ఇలా ప్రేమచేత బలవంతాన అటువైపు ఆకర్షింపబడతాం. కాని ఇక్కడ ఆ లక్ష్యం ఆభాసమాత్రంగాకూడా కనిపించకపోయేసరికి, అసలది ఇక్కడ దుర్లభం అయేసరికి, (పైనచెప్పబడిన) ఈ ఉపలక్ష్యము విరక్తి కారణమైపోతుంది. అర్థాత్తూ మనం కోరినా, కోరకపోయినా, మన ప్రేమ ఒక విశిష్టవ్యక్తిపై మాత్రమే నిల్చివుండకుండా నిర్విశిష్ట సమష్టిలోనికే వెళ్ళిపోతుంది.

ప్ర: ప్రేమకు బదులు రెండో వ్యక్తినుండికూడా ప్రేమ తప్పనిసరిగా ఆకర్షితమౌతుందా?

జ: రెండోవ్యక్తిసంగతి మనం ఆలోచించకూడదు. ఎందుచేతనంటే రెండోవ్యక్తిగా పరిగణించి ఎవరిని గురించి మాట్లాడుతున్నావో (నీ భావన ప్రకారమే) ఆవ్యక్తికి ఆ వ్యక్తి ప్రథమమేగా! కనుక ప్రథమంగా పరిగణించే లటియమైన విచారణ సాగించవలసివుంటుంది. అనగా ఇతర్లను గురించి మనం ఏమీ నిశ్చయపూర్వకంగా చెప్పనేకూడదు. అలా చెప్పబూనటం....ఆ రెండోవ్యక్తిలో స్వకీయమైన స్వత్వం ఏమీలేనట్టు భావించటమౌతుంది. కాని స్వకీయమైన స్వంత్వం ఏకొంచెమూలేని వ్యక్తి ఎక్కడా వుండడు. ఒక వ్యక్తియొక్క అంతర్గతనియమానికి భిన్నంగా ఆవ్యక్తి ద్వారా యేమీ జరగదు. కాబట్టి మన ప్రేమ ఆ రెండోవ్యక్తిచేత యేమి చేయిస్తుంది అనే ప్రశ్నకు తావేలేదు. మనప్రేమ మనకు విస్తృతిని, తద్వారా మనకు ప్రసన్నతను చేకూరుస్తుంది. అంతవరకేచాలు. ఇక శేషించినవానిలో (అంటే ఎదుటివారిలో) వచ్చే పరిణామంగురించిన పట్టుదల తెలివితక్కువ; నాస్తికత అనిపించుకుంటుంది. పరిణామం తెలుసుకోవాలన్న ఆసక్తిలోనూ పట్టుదలలోనూ ఏం కనిపిస్తున్నది? ఇతర్లకు వారివారి స్వత్వాలను నిలుపుకునేందుకవకాశాన్ని మనం ఇవ్వనిష్టపడటంలేదన్నమాట. అది తప్పు. అదే హింస అంటే! కనుక ధర్మవిచారం, తత్త్వవిచారం పరగతంగా ఉండనే కూడదు. అవి ఎప్పుడూ స్వగతంగానే ఉండాలి. స్వగతంగా వున్నప్పుడే నిజంగా అవి సమష్టిగతములౌతాయి. ఎందుచేతనంటే- ఒకటిలో ఉన్నదే అన్నింటిలోనూ ఉన్నది; పిండమందున్నదే బ్రహ్మాండమందునూ ఉన్నది.

ప్ర: ఒకవ్యక్తియొక్క ప్రేమప్రభావం మరోవ్యక్తిపై పడుతుంది కదా!

జ: ఎందుకు పడదు? తప్పకుండా పడుతుంది. ఒక్క ప్రేమప్రభావమేకాక, దానితోపాటు ఇంకా అనేకవిషయాల ప్రభావంకూడా పడుతుంది. తాను ఒకరకమైన ప్రభావాన్నిగాని. పరిణామాన్నిగాని ఇతరల్లో తీసుకురావాలని కోరుకునే అధికారం ఎవరిప్రేమకు ఉండదు. ప్రేమయొక్క సార్థకత ప్రేమయందే—ఫలితమునందుకాదు.

ప్ర : ప్రేమిస్తున్న వ్యక్తిని రెండో వ్యక్తి ప్రేమించకనేపోవటంకూడా ఉంటుందా ?

జ : ఉండవచ్చులాగే కనిపిస్తుంది. అంతేకాదు, ప్రేమిస్తున్నవ్యక్తిని ఆ ప్రేమపాత్రమైన వ్యక్తి తిరస్కరించటం, ద్వేషించటం కూడా కనిపిస్తునే ఉంది. అయినప్పటికీ ప్రేమ ప్రేమను ఉత్పన్నంచేయజాలదు అనే. అవిశ్వాస పూర్వకమైన నిర్ణయానికి అవకాశంలేదు.

ప్ర : ఒకవ్యక్తిలోని ద్వేషభావప్రభావం రెండో వ్యక్తియొక్క ప్రేమపై కూడా పడుతుందా లేదా ? అప్పుడా ప్రేమ ద్వేషంగా మారిపోదా ?

జ : శక్తి ద్వేషంలో ఉన్నదని నేను ఒప్పుకోను. ప్రేమలోనే శక్తి ఉన్నదని నా విశ్వాసం. ప్రేమయొక్క విపర్యయమే ద్వేషం. ద్వేషానికి ఒక స్వతంత్రమైన అస్తిత్వం లేదు. అందుచేత అది ప్రేమను జయించలేదు, దాన్ని విచ్ఛిన్నంచెయ్యలేదు. ప్రభావాన్నిగురించి విచారించవలసివస్తే....చివరకు ద్వేషమే ప్రేమప్రభావాన్ని అంగీకరించవలసివస్తుంది. ప్రేమ స్వయంభువు. ద్వేషం ఒక ఆలంబనం లేకుండా జనింపనేజాలదు; అది ప్రతిక్రియ. కనుక నశించిపోవలసినది ద్వేషం; జయించవలసినది ప్రేమ. ప్రేమఎల్లప్పుడూ అవ్యర్థం. కనుక వేరేవిధమైన భయానికి తావులేదు. ప్రేమకుబదులు ద్వేషమే ఎదురౌతూవుంటే—ఆద్వేషం ఆ ప్రేమిస్తున్నవారిహృదయాల్నివిషపూరితం చేస్తున్నసందర్భాలు ఉన్నాయి. అందుకు కారణం— ఆవ్యక్తుల పరస్పరప్రేమ అప్రేమే; అనగా అహంకారతత్వమిశ్రితమై సాగుతున్నదన్న మాట. లేదా ఇలా చెప్పవచ్చు : వారి ప్రేమ, అనక్తి అహంకారమిశ్రితం కావటంవల్ల చంచలంగా అస్థిరంగా వ్యవహరిస్తున్నదన్నమాట. ఇంతకూ ఏమైనాగానీ, ఈ తంటాలు, చిక్కులన్నింటియడుగునా ప్రేమ తన వ్యథ ద్వారా పరస్పరఉపలబ్ధిని ఏకాంచెమో సుసంపన్నం చేస్తూనేఉంటుంది. సంయోగంకంటే వియోగమే అధికంగా ప్రీతిపదము ఔతున్నవాడే ప్రేమకుడుకదా ?

ప్ర : ఈ ప్రేమే వివాహంగా పరిణమిస్తే ఆ ప్రేమ విచ్ఛిన్నమై పోతుందని మీరన్నారు. ఇద్దరువ్యక్తులమధ్య యథేష్టమైన పరిచయం

వుంటుంది; కల్పనాత్మకభావాలు లేవనుకుందాం; అప్పుడు వారి ప్రేమ నిలకడగా వుంటుందంటారా ?

జ : ఏం ? కల్పన ఎందుకుండదు ? ఉండితీరుతుందనే నా ఉద్దేశం. కల్పనేలేకపోతే రొమాన్సేవుండదు. వివాహాల్లో రొమాన్సు తక్కువగావుండి, వివేకం హెచ్చుగావుంటే—పరిణామంకూడా ఆ హెచ్చుతగ్గులదామాషాను అనుసరించి భిన్నంగానే వుంటుంది. నిజానికి శుద్ధవివేకం బ్రహ్మచర్యంలోనే ఉంది — దానంతటదే ఒక బ్రహ్మచారి. అక్కడ వివాహప్రసక్తే ఇంచుమించు అసంగతం. ఇక శేషించినదానిలో ఏకొంచెమో వలపుకోరికల ఆకర్షణకు తావుఉండనేవుంటుంది. ఆ హద్దువరకూ ప్రతివివాహంలోనూ కొంచెం నిరాశ, నిగ్రహం పొడసూపకతప్పదు. కాగా గార్హస్థ్యం ఒక సుఖవంతమైన పెజ్జ కాదనీ; తపస్సుకూ, సాధనకూ తావుగల ఆశ్రమం అనీ నాకు అనిపిస్తున్నది.

ప్ర : రొమాన్సుస్థితి అంటే మీ ఉద్దేశం ? ఈస్థితిలో ప్రేమికా ప్రేమికుల పరిస్థితి ఎలాంటిదని మీ తాత్పర్యం ?

జ : పరిస్థితి అనేటువంటిదక్కడ ఇంచుమించు లేనేలేదని చెప్పవచ్చు. అక్కడ వుండేది ఒక తీవ్రమైన తరంగాల అలజడి— గమనం కాలచక్రంలోగాక మనస్సులో వున్నట్టు ! ఒక్కక్షణంలో మనస్సు ఆకాశాన్నీ, పాతాళాన్నీ రెంటినీ చుంబిస్తుంది. ఎగిరిపోతుంది, వెళ్ళి సూర్యగోళంలో వుంటానన్నట్టు; అవెంటనే జారిపడుతుంది : అగాధనరకరూపంలోకి త్రోవ చేసుకుంటున్నట్టు. అదీ రొమాన్సుపరిస్థితి అంటే. దాన్ని ఏ నియమమూ, ఏ తర్కమూ అర్థంచేసుకోజాలదు.అక్కడ వుండేదంతా విరోధాభాస, అంతా వైచిత్ర్యమే. అక్కడ లోపలవుండేదొకటి, బయటికి వ్యక్తమయ్యేది దానికి పూర్తిగావ్యతిరిక్తము. హృదయంలోని అంగీకారం నోటితో చెప్పబడదు. మనోవాంఛలోని తీవ్రత సిగ్గుతో సంకోచంగా తయారౌతుంది. ముందుకు సాగడానికే వెనుకడుగు పడుతుంది. చూడటానికే కళ్ళు మూతలుపడిపోతాయి. ఏపనీ అక్కడ స్వాధికారపూర్వకంగా సాగదు. మనోబుద్ధీంద్రియరజ్జువు గబగబ ఎగిరిపడుతూవుంటుంది. దాని ఐక్యత క్షణంలో వెయ్యిసార్లు విచ్ఛిన్నమై మళ్ళీ వెయ్యిసార్లు పెనవేసుకుంటున్నట్టు కనిపిస్తుంది. ఆసమయంలో

ప్రాణాలవేగం ఎంతతీవ్రంగా ఎలావుంటుందో వర్ణించాలన్నా, విశ్లేషణం చెయ్యాలన్నా దుస్సాధ్యం. కొంచెంలో చెప్పాలంటే --ఏది ఆధారంగా మనం జీవిస్తున్నామో ఆ మానమూ, దేనివైపు మన బ్రతుకు సాగుతున్నదో ఆ ప్రణయమూ --ఈరెంటిమధ్య ఒక మహాఘాతయుద్ధం సాగుతున్నదన్న మాట! ఆరెండూ తమ అమోఘమైన ద్విధాస్థితిని ఏకంచేసుకునేందుకు సిద్ధమైనట్టు రెండూ ఘోరంగా తలపడతాయి: ఏ ఒక్కదానికీ తెలియదు: తన్ను తాను నాశనంచేసుకోగోరుతున్నదో, రెండవదాన్ని నాశనంచెయ్యగోరుతున్నదో. ప్రేమసంబంధమైన ఈ సంగ్రామలీలను సాంతం వర్ణించగలిగిన వాడెవడూ లేడు. అందులోనే కవి తన స్వప్నాలను, తత్త్వవేత్త తన తత్త్వాన్ని వెతుక్కుంటూఉంటారు. జీవనసారసత్యం యావత్తూ నిర్విశేషంగా చరమసూక్ష్మరూపంలో అక్కడే ప్రస్ఫుటితం ఔతుంది. అందులోకి చొచ్చుకొనిపోయి నావంటివాడు ఇంకా సవిస్తరంగా చెప్పవలసిందేముంది?

ప్ర: రొమాన్సుస్థితిలోనే వుంటూ ప్రాప్తికోసం ప్రయత్నించక పోవటం—అనేది సంభవమేనా?

జ: ఎవడికి సాధ్యంఅయితే వాడు ఉంటాడు; ఉండనీ. కాని త్రికాల స్థాయి అయిన రొమాన్సు ఈశ్వరప్రేమే అని నా కనిపిస్తున్నది. అది ఎల్లప్పుడూ లభిస్తూనేవుంటుంది. ఇంకా లభించేందుకు మిగిలికూడా వుంటుంది. ఇక మిగతా రొమాన్సులన్నీ అస్ఖలితాలని నేను అంగీకరించలేను. ప్రతి ఆదర్శవాదమూ ఒక రొమాన్సే. కాని భగవత్ప్రేమకు భిన్నమైన ఏ ఆదర్శప్రేమా జీవితపర్యంతమూ నిల్చివున్నట్టు కనపడదు. రసభంగంచేసి, విషాదాన్ని మిగిల్చి తాను తొలగిపోతుంది. ఐనాగానీ ప్లేటో (ఒకగ్రీకు తత్వవేత్త) నిర్వచించిన ప్రేమలో నాకు చెరుపుఏమీ కనిపించదు.

ప్ర: ఒకవేళ హఠాత్తుగా రొమాన్సులో పడిపోయి ప్రాప్తిభావనను బలవంతాన అణచుకున్నట్టయితే—దాని పరిణామం దమనరూపమైన అనిష్టకారే ఔతుందా?

జ: ప్రాప్తికోసమైన ప్రయత్నం వెనకాల లేకనేపోతే రొమాన్సు రానేరాదు; వచ్చినా నిలవదు. స్వప్నరూపంలో కల్పనకు లభించినదానిని

యథార్థరూపంలో కర్మేంద్రియాలసహితంగా పొందాలని మన శరీరంమాత్రం ఎందుకు కోరదు ? రొమాన్సు స్వయంగా సూక్ష్మభోగం. స్థూలభోగం దాని వెన్నంటే ఎందుకుండదు ?

ప్ర : రొమాన్సులో సూక్ష్మభోగం ఎలా వుంటుంది ? అందులో తన్ను తాను ఇచ్చివేసుకోవాలనీ, తాను విలుప్తమైపోవాలన్నభావనేగా ప్రధానంగా ఉండేది ?

జ : ఇచ్చివేసుకోటంలో సుఖం లేదామరి ? ఆ రసాస్వాదనను భోగం అని ఎందుకనకూడదు ? బ్రహ్మానందం అన్న శబ్దం వున్నదికదా మనకు ? ఆనందం అనేది భోగం ఎందుకుకాదు ? ఈ దృష్ట్యా 'భోగం' అనేశబ్దం పవిత్రవంతంకూడా ఔతున్నది. భగవంతుడికి అప్పాలుఅవీ చేయించి. గుడిలో భోగంచేయిస్తున్నామని చెబుతున్నాంకదా ! అందులో ఎటువంటి పావనభావం ఇమిడివున్నది ! విరక్తుడైన సన్యాసితో 'అన్నం తినండి' అని చెప్పం; 'ఈ భోగం స్వీకరించండి' అని పలకటమే సముచితం. అర్థాత్తూ రసాన్నీ, భోగాన్నీ నిషిద్ధములుగా భావించరాదు. రొమాన్సు శబ్దం ఆమూలాగ్రమూ రసమయమైనది. అందులో రసం ఉంది; అసలు అదే రసం అని చెప్పటం మరింత సత్యం. సూక్ష్మమైనదికాబట్టి వికారవిముక్తం కూడాను. దాన్ని అగ్రాహ్యమని భావించటం మనల్నిమనం హ్రస్వపరచుకొనటమే.

ప్ర : అప్పుడు త్యాగప్రేరితమైన రొమాన్సుకూ, స్థూలభోగానికీ భేదం ఏముంది ?

జ : స్థూలానికీ, సూక్ష్మానికీ ఉండే భేదమే.

ప్ర : అయితే మరి రొమాన్సులో భోగం, భోగంలో వికారం ఎలా సంభవిస్తాయి ? ఎందుకని ?

జ : అంటే—ఉత్సర్గపరాయణమైన రొమాన్సులోనుండి వ్యభిచారరూపమైనభోగం ఎలా పొడసూపుతున్నది ?—అనేగా నీప్రశ్న ! ఎంతో వస్తుదళం, దానివల్ల క్రోధం, అద్దానివల్ల హింస....అంతేగాక ఇంకా నానా సమస్యలనూ ఉత్పన్నంచేస్తున్న వ్యభిచారం రొమాన్సులోనుంచి ఎలా బయలు

వెడలుతున్నది? — అనేకదూ నీవడిగేది? మనలోని అహం నిర్వ్యక్తిక భావంతో ఎంతవరకు స్ఫూర్తిమంతమైయుంటుందో ఆ యవస్థవరకే దాన్ని రొమాన్సు అంటాం. ఎప్పుడైతే స్వయంగా అహమే దాన్ని ప్రేరేపింప మొదలిడుతుందో.... అంటే ఏక్షణంనుంచి అందులో కర్తృత్వభావం ప్రవేశిస్తుందో.... ఆక్షణంనించి వికారంకూడా వచ్చేసినట్లే భావించవచ్చు. అందుచేతనే కర్తృత్వభావాన్నీ, ఫలాపేక్షనూ త్యజించి కర్మచెయ్యవలెనన్న ఆశయం. అటువంటి అవస్థలో భోగం ఉంది; కాని వికారంలేదు, బంధనం లేదు. ప్రాప్తి 'నాకు' అన్న భావమూ, కోరిక 'నాది' అన్న భావమూ అహంభావంలో ఉన్నాయి. కనుక బంధనం, వికారం అహంభావంలోనివే. మనలోనుంచి అహంకృతి ప్రసరించిందంటే వికృతికూడా ప్రసరించినదన్న మాటే. ప్రస్తుతసమస్యకూడా అదే. రొమాన్సు శక్తిని చేకూరుస్తుంటే భోగం ఆ శక్తిని క్షయింపచేస్తూఉంటుంది. కాని రొమాన్సు వట్టి గాలిలా కంటాడకుండా ఊరుకోదు. అది దైహికంకావాలని కోరుకుంటుంది. దైహికాగానే దాని వేగంలో చాల తీక్ష్ణత వచ్చేస్తుంది. అందుకనే చెబుతున్నాను: వ్యక్తిప్రేమించటంమాత్రమే చాలదు; దానితోపాటు ఈశ్వరప్రేమకూడా తప్పనిసరిగా వుండితీరాలి. ఈశ్వరునిపట్ల మన రొమాన్సు అమరమై అవ్యాహతంగాసాగుతుంది. అటువంటి ఐశ్వరీయప్రేమే లేకపోతే వ్యక్తిప్రేమ తప్పనిసరిగా చిక్కులు తెచ్చిపెడుతుంది. ఈప్రకారమైన మానవప్రేమకే భోగవాదం అనిపేరు. అప్పుడెక్కువగా ధ్యానం ఈశ్వరునియందు లగ్నమైవుంటుంది; మనిషి కర్మలాచరిస్తూ ఉంటాడు. ఈ ఇరుదరులనూ ఒరసికొంటూనే జీవనప్రవాహం సాగిపోతూవుండాలి అని నా ఉద్దేశం. ప్రతివ్యక్తి జీవితానికీ ఈ రెండుతీరములూ ఉంటాయి — ఒకటి ఆదర్శము, రెండవది వాస్తవికత; ఒకటి ప్రేమపాత్రము, రెండవది భోగపాత్రము. ఈ రెండూ లేక జీవితం అసార్థకమౌతుంది. ఈ రెండు ఒడ్డులనూ హఠాత్తుగా కలిపివెయ్యాలని ప్రయత్నించటం జీవనవినాశహేతువే. ఒడ్డేలేకపోతే అది సముద్రం అన్నమాట. అక్కడ ప్రవహించటమనేది లేనేలేదు. కాని సముద్రభావనకూడా మళ్ళీ భూమి ఆరంభమయ్యేచోట అంతమైపోతుంది. ఈ విధంగా సముద్రానికికూడా ఒడ్డుఉన్నట్టు ఒప్పుకోవచ్చు. ఒడ్డులేదు అంటే

—ఆకారంలేదు అని అర్థం. అంటే ఒక రూపమే లేదన్నమాటే. కల్పన అక్కడికెలా చేరుకుంటుంది? సమయాన్ని తనలో సమాప్తంచేసుకున్న మహాకాలమేమో అది! తనలో అసత్యం స్వయంగా పరిపూర్ణమైపోయివున్న పరమసత్యమేమో! ఈవాక్యాలుకొన్ని అతర్క్యములుగా గోచరిస్తున్నాయి కాబోలు. నేను చెప్పదలచుకున్న అంశం ఏమంటే—రెండు ఒడ్డుపెట్టుకుని వాటిమధ్య మన జీవితం సాగుతూ ఉంటుంది. ప్రతివ్యక్తి జీవితానికి ఇది అనివార్యమని నేను అంగీకరిస్తున్నాను—ఒకరియెడల ప్రేమ, మరొకరితో భోగం.

ప్ర: అహంకృతినీ, కర్తృత్వాన్నీ మీరెలా సమన్వయపరుస్తారు?

జ: వేరే సమన్వయం ఎందుకూ? ఆ రెంటినీ నేను ఒకేఅర్థంలో ప్రయోగించాను. 'నేను' అనుకోటం అహంకృతి. కర్తృతమన్నా 'చేసే వాడు'....నేను....అని అనుకోటమే.

ప్ర: ప్రేమ వ్యభిచారంగా ఎలా మారుతుంది? క్షోభను ఎలా ఉత్పన్నంచేస్తుంది?

జ: దీనికి జవాబు ప్రత్యక్షంగానే ఉండాలే. ఆక్రమించాలన్న ఉద్దేశం తదేకమైన ప్రేమలో ఉండదు; అహంకృతప్రేమలో వుంటుంది. వ్యక్తి తన్ను తాను ప్రేమకు అధీనంచేసుకోడు. అందుమూలాన తాను ప్రేమించు తున్నట్టుగా భావించుకుంటాడు. అక్కడించే చిక్కులు ఆరంభమౌతాయి. కర్మ ఏదిన్నీ కేవలం నాచేతనే అవదు. ఉపాదానము, నిమిత్తము, సహాయో గము మొదలైన అనేక యితర హేతువులుకూడా వుంటాయి. నేనే కర్తను అని భావించుకొనటంవల్ల ఉపాదానాదులకు ఇవ్వవలసిన మహత్వము నివ్వ కుండ నేను చ్యుతుడనుకావచ్చు. అవిధంగా కర్మలో అజాగ్రత ఏర్పడు తున్నది. 'యోగః కర్మసుకౌశలం' అను వాక్యం ఈ అర్థంలోనే చెప్పబడింది. అనాసక్తిద్వారానే కౌశలం సిద్ధిస్తుంది. అనాసక్తులమైనప్పుడే కర్మకు సంబం ధించిన ప్రతి అంగముపట్ల సావధానులమై వ్యవహరింపగలుగుతాము. అహంభావంలో అట్టి సావధానత జాగృతమై వుండజాలదు. కాగా సఫలత యందు అటంకం ఏర్పడుతుంది. అదే క్షోభకు కారణం, అహంకారం

మనల్ని ఇతర్లతోనూ, ఇతరసాధనలతోనూ ఢీకొనేలా చేస్తుంది. ఈవిధంగా విఫలతను, అకృతార్థతను ఎదుర్కోవలసివస్తుంది. తత్ఫలితంగా క్లేశము, తాపము ఉపజాతములౌతున్నాయి.

ప్ర : మీరు ఇందాక రెండు ఒడ్లు ఉండాలన్నారు. ఒకరితో ప్రేమ సంబంధము, మరొకరితో భోగసంబంధము ఉంటాయన్నారు. అంటే ఎవర్తితోనైతే స్థూలభోగసంబంధంవుంటుందో ఆవ్యక్తిపై ప్రేమ రానురాను తునిగిపోతుందనేగా ! కాని మన ఆదర్శముతో తుల్యమైనటువంటిది ఏ వ్యక్తిలో దొరుకుతుందో ఆవ్యక్తినే మనం ప్రేమిస్తాము. ఆ సామ్యాన్ని ఆధారంగాచేసుకుని వివాహానంతరంకూడా ప్రేమ ఎందుకు నిల్చివుండ కూడదు ?

జ : మూలితః అన్నిచోట్లా లేనటువంటి దొకటి ప్రత్యేకంగా ఏవ్యక్తి లోనూ వుండదు. ఒక్కవ్యక్తిలోనే సౌందర్యం, గుణగణాలు ఉన్నట్లయితే ఆ ఒక్కవ్యక్తిమినహా మరొకరు ప్రేమపొందటంగాని ప్రేమించటంగాని అసంభవమే ఔతుంది. కన్నులు రూపసృష్టిని చేస్తాయి. కనుక కన్నులే తమ కోసం వేరువేరు ప్రేమపాత్రములను వెతుక్కొని తెచ్చుకుంటాయి. ఆద ర్శంతో తత్సమమైన ఉపలక్ష్యమొకటి తాత్కాలికంగా మనదృష్టికి లక్ష్యంగా గోచరించవచ్చు. కాని అది ఇంచుమించు (స్థూలంగా) చేతికి ప్రాప్తించేసరికి అందులోనించి ఆదర్శభావం తిరోహితమైపోతుంది. అప్పుడక్కడి గుణములే అవగుణములుగా కనిపిస్తాయి. గుణమురైనా అసలు మనం ఆరోపించి నటువంటివే. తత్త్వము వాస్తవంగా నిర్గుణమే. ఈవిధంగా గుణాలు అవ గుణాలుగా కనిపించటమనేది ఒక అసంభవవిషయంగా భావించనక్కర్లేదు. ఎల్లప్పుడూ అన్నిచోట్లా కనిపిస్తున్న విషయమే అది. మనకు ఆనందం కలిగించినప్పుడు గుణాలుగా కనిపిస్తాయి. అవే అవగుణాలుగా ప్రతీత మౌతాయి మనకు చిక్కులుతెచ్చిపెట్టి బంధనతుల్యములైనప్పుడు. సౌంద ర్యాన్ని పూజిస్తాం; కాని దానిపై అనురక్తిద్వారానే విరక్తి సంభవించి నప్పుడు ఆసౌందర్యానికే తిట్లు, చివాట్లు లభిస్తాయి. మొదట ఎందులోనైతే దివ్యత కనిపిస్తుందో, చివరకదే దుష్టతకు దృష్టాంతంగా తోస్తుంది. కనుక వస్తువులోగాని, వ్యక్తిలోగాని ఏదోఒక సత్తావుంది. అది ఒకోవస్తువును

గాని, మరోవ్యక్తినిగాని తనలో కేంద్రీకరించుకోగలగటం—నేను ఒప్పు కోను ఆ విషయం. అట్టిశక్తి ఒక్క శ్రద్ధలోనే నాకు కనిపిస్తున్నది. శ్రద్ధ పనికిరానివస్తువులోకూడా ఐశ్వర్యాన్ని సృష్టించగలదు.

ప్ర : అయితే మీ ఉద్దేశంప్రకారం ప్రతివాడూ కళ్ళుమూసుకుని ఎవరినైనాసరే పెళ్ళిచేసివేసుకోవచ్చు. వివాహానంతరం ప్రేమ అప్రేమగా మారిపోయేదేగా !

జ : కళ్లు మూసుకునైనా చేసుకోవచ్చు; ఇబ్బందేం లేదు. తల్లి దండ్రులుమాత్రం కనువిప్పు కలిగివుంటే భావివధూవరులు హాయిగా కళ్ళు మూసుకునే వుండవలెనని నా సంహా. అందులోనే వారి శ్రేయస్సు.

ప్ర : కాని తల్లిదండ్రులు అంత ఎక్కువగా కనువిప్పు కలిగి వుండరు. వారు ఎక్కువగా డబ్బు మీద, ప్రతిష్ఠమీద పేరాసపెట్టుకుని ప్రాకు లాడుతూ ఉంటారు.

జ : అందుచేతే ఇబ్బంది మరి ! డబ్బే ప్రధానంగా వివాహం జరగ కూడదు. అటువంటి ఆశాపాతకపు పెండ్లివల్ల ఎవరికీ సుఖంలేదు. ఈ విష యంలో వధూవరులే బాగా కనువిప్పుకలిగి ఉండవచ్చునుగా ! అందులో నాకేమీ ఇబ్బంది కనిపించదు ! డబ్బులేనివాళ్ళను మనం అవజ్ఞచేసి. అనా దరంగా చూస్తున్నాం. అందువల్లనే డబ్బు సంకటాల్ని తెచ్చిపెడుతున్నది. తత్ఫలితంగా మానవసంబంధాలు విషపంగానూ, విషయాసక్తములుగానూ పరిణమిస్తున్నాయి. ఒకచోట పుట్టినవైషమ్యం అక్కడే సీమితమై వుంటుం దని అనుకోకూడదు; తన ప్రభావాన్ని నాలుగువైపులకు విరజిమ్ముతుంది. ఒక్కడు తెచ్చిపెట్టే చిక్కు సమాజమంతటినీ నీలుక్కుపోయేలా చేస్తుంది.

ప్ర : అసలు వివాహమే నిష్ఫలమని చెబుతున్నారుగా మీరు ! ఇక నప్పుడు తల్లిదండ్రులు కనువిప్పు కలిగివుంటేమాత్రం ప్రయోజనం ఏమిటి ?

జ : వివాహం నిష్ఫలమేనని నేనెప్పుడు చెప్పాను ? ధర్మపూర్వక మైనప్పుడే వివాహం సఫలమౌతుందనికదా చెప్పాను ! భోగమూలకము అయితే సఫలత అసంభవమే. ఇంతకూ వివాహసాఫల్యత అంటే ? ప్రేమ వివాహంద్వారా ఉత్తరోత్తరా ఘనిష్ఠము, వ్యాపకముకావాలి. అదే వివాహ

ప్రేమ తననుంచి దూరస్థమౌతుంది: అప్పుడా దూరాన్ని చూచి, తనకది సిద్ధించలేదని భావించి వికలుడౌతాడు; అటువంటివ్యక్తికి రొమాన్సులంటే ఓనమాలుకూడా తెలియవని చెప్పవచ్చు.

ప్ర : వియోగం సార్థకం ఎలా అవుతుంది? వియోగాన్ని సార్థకం చేసుకున్నవ్యక్తి అంటూ నేనెక్కడా చూడలేదు. శరత్‌బాబు సృష్టించిన పాత్ర దేవదాసు వియోగజనితవేదనతో చివరకు తాగుబోతుగా తయారైనాడు.

జ : దేవదాసులో తాగుబోతుతనాన్నే చూస్తున్నావన్నమాట! అతనిలోని అమిత సంయమం నీకు కనిపించలేదా? అతనిసమాగమంవల్ల ఒక వారవనితకూడా సామాన్యగృహిణిగా మారిపోయింది. అది అతనిలోని సంయమంయొక్క ప్రభావంకాకపోతే మరి దేనిపరిణామం అంటావు? ఇంకో సంగతి: పార్వతియొక్క పవిత్రజీవితంలో తనమూలాన ఏమాత్రపు మలినరేఖయైనా రానిచ్చాడా? ఉహుఁ. నిత్యజాగృతమై, జ్వలంతమైన ప్రేమ నిండిన గుండెగలవాడై అత డటువంటిపని చెయ్యలేదు. ఇకపోతే — అత డంత సిగ్గుమాలిన అధమ దుర్వ్యసనాలకెందుకు పాలుపడ్డాడు? అటువంటి వాడిని ఒక మాననీయవ్యక్తిగా ఎలా పరిగణిస్తాం? — అనే ప్రశ్నవస్తుంది. ఇక్కడ కొంచెం దృష్టిని మరలించవలసిన అవసరం ఉన్నదని నా ఉద్దేశం. దేవదాసు తనువు కళ్ళెముతెగిన గుర్రంవంటిది అయింది. అది తన రౌతును గోతిలో పారవేయటానికే సిద్ధమైంది. అటువంటిస్థితిలో ఆగుర్రాన్ని వొదిలివేయటం, రౌతు గోతిలోపడకుండా నిల్చిపోవటం గొప్పసంగతి కాదా! అటువంటి అవస్థలో పిచ్చెత్తిన గుర్రం పోయి గోతిలో పడితే పడింది; రౌతుమాత్రం సురక్షితంగా ఉంటాడు. దేవదాసుగాథలో ఈ ఉదాహరణను ఘటితపరచుకుని చూడగలిగినట్లయితే — అతని తనువు నెరపిన వ్యవహారంతో అతని మనస్సునుకూడా జతపరచి పరిశీలించాలన్న స్పర్థ మనకు ఉత్పన్నంకాదు. తనువుయొక్క విద్రూప విద్రోహాలవల్లకూడా భంగముపొందకుండా అతని మనసులోని నిశ్చలబ్రహ్మచర్యం విశుద్ధంగానే ఉండిందంటే — అది అతడు స్వీకరించిన ఆ వియోగశక్తిఆధారంవల్లనేకదా! దేవదాసు గనక వియోగాన్ని ఇంకా పూర్ణరూపంలో స్వీకరించియున్నట్లయితే,

నవలాసాహిత్యంలో అటువంటి యోగిపురుషుడు మరొకడు సాధారణంగా కనిపించడనే అనుకోవలసివుంటుంది. అతడా స్థాయికి అందుకోలేదని మనం చులకనగా మన కన్నులనే మోసగించుకుంటామా ? వియోగం మన సౌభాగ్యంగా పర్యవసించేలాగుచేసుకోవలసిన సాధన అసంభవం అని త్రోసివేస్తామా ? ఉహుఁ. అలా చెయ్యకూడదు. వియోగం అనివార్యం. కనుక ఆరంభంనుంచే దాన్ని మనం స్వీకారయోగ్యంగా భావించాలి. అహంకారమనే మత్తును పటాపంచలుచేయజాలిన ఔషధం మరియొకటి లేనేలేదు— ఈస్వేచ్ఛితవియోగం ఒక్కటితప్ప.

ప్ర : వియోగం అహంకారాన్ని ఎలా నశింపజేస్తుంది ?

జ : వియోగమంటే దుఃఖం. అహంకారమంటే సుఖేచ్ఛ. వియోగంలో విసర్జన ఉంది; అహంకారంలో పుచ్చుకోవాలన్న పట్టుదల ఉంటుంది. ఇలా స్పష్టంగా తెలుస్తున్నదికదా : అహంకారము విషం ; దానికి విరుగుడు మందు విరహం.

ప్ర : పార్వతికోసమైన విరహంవల్ల దేవదాసు అహంకారం ఎలా అణగిపోయిందో తెలియజెప్పగలరా ?

జ : తెలియజెప్పేందుకు వేరే ఏముందనీ ? అతని కథలో మొదటినుంచి చివరదాకా వ్యాఖ్యానం కనిపిస్తూనే ఉన్నదిగా : తనకోసమని ఏకొంచెమైనా పుచ్చుకోవాలన్న పట్టుదల దేవదాసుకు లేనేలేదు. సర్వమూ మరొకరికి దోచిపెడుతూకూడా గర్వభావమే లేదతనికి. ఒకవేళ దేవదాసు ఒకపెద్ద జమీందారుకుమారుడుగా పుట్టివుండకపోతే— అటువంటి చిత్తవృత్తిగల వ్యక్తి తప్పనిసరిగా ఒక యోగిచంద్రుడుగా మారిపోయివుండేవాడు అని నా కనిపిస్తూవుంటుంది. అతని డబ్బే అతనికి సారాయం అయింది; అదే అతన్ని ముంచింది అని నా ఉద్దేశం. కాని అదంతా కోరితెచ్చుకునే జంజాటం. దానితో మరీమరీ ఆటలాడి పొందగలిగిందేమిటి ? ఇంతకూ దేవదాసు పొందలేక పోగొట్టుకున్నది....వియోగాన్ని స్వీకరించకపోవటంవల్లకాదు; వియోగంతో విద్రోహంనెరపుతూవుండినకారణంచేతనే. ఏఅంశంవరకు —అధికాంశంవరకు అతడు వియోగాన్ని స్వీకరించాడో అంతవరకు

మాత్రం వియోగం అతనికి ప్రసాదమే అయింది. అంమలో దేవదాసు వర్ధి ష్ణుడే అయినాడు.

ప్ర: మనస్సు నిరంతరం ప్రాప్తికోసమే ఆకాంక్షిస్తూవుంటే అది దమనహేతువుకాదా?

జ: తనకేది ప్రాప్తించాలని మనస్సు కాంక్షిస్తూవుంటుంది? శరీర ప్రాప్తినికాదు. ఎందువల్లనంటే శరీరస్పర్శను మనస్సు అనుభవింపజాలదు. కనుక మనస్సు ఎప్పుడూ మనస్సునే కోరుతుంది. శరీరాన్నికోరేది శరీరమే. శరీరప్రసక్తివున్నచోట వ్యవస్థ, పదార్థం, పదార్థవ్యవస్థ....వీటికి సంబంధించిన ప్రశ్నలు ఉదయిస్తాయి. ఈక్షేత్రానికి సంబంధించినంతవరకు మర్యాదలు ఏర్పడ్డాయి; యమ-నియమాలు స్థిరపడిపోయాయి. ఈ సమస్త నియమ వ్యవస్థ మనస్సుకు బాధాకరం కాదు, కానేరదు. మనసునందుకాదు, మనసులోని ప్రేమయంచే ప్రియోపలబ్ధి. కనుక మనసులోని ప్రేమకు శరీరోపలబ్ధియందు సంకటమే ఏర్పడుతుంది. మనసు తనకు తానే సంకటాన్ని కోరుకుంటుందన్నమాట అబద్ధం. కనుక మనస్సు ఒక్క వియోగాన్నేతప్ప మరిదేన్నీ స్వీకరించదు. అయినా తనువు అని చెప్పబడుతున్నది మననుండి భిన్నమైన వస్తువా? దానివట్ల ఒక పరాయివస్తువన్నదృష్టితో మనం వ్యవహరించరాదు. కాబట్టి తనువును మనం త్రుంచకూడదు; అణచకూడదు; పైగా దాన్ని సముచితోపయోగంలోకి పట్టుకురావాలి. దాని కోరికలు తీర్చాలి. అది ఉన్నది. కనుక దాన్ని మనం అసత్తు అని త్రోసివెయ్యకూడదు; చెడ్డది అని అవజ్ఞ చెయ్యకూడదు. దాన్ని గౌరవంగా, ఆదరంగా చూడాలి. అవమానించామంటే అది ప్రతీకారంచేయకుండా ఊరుకోదు. కాని తనువుకు, మనస్సుకు మధ్య స్పర్ధఏర్పడి, అవిరెండూ ఆత్మను వేరువేరు దిశలకు లాగుతూ ఉన్నప్పుడు ఆరెంటినీ పరస్పరసంఘర్షణనుంచి కాపాడాలి. ఒకదానిపై మరొకదాని ఒత్తిడిసాగకుండా రెంటినీ స్వాధీనములను చెయ్యాలి. ఈవిధంగా అయితే— శరీరవ్యవహారములవల్ల ఏర్పడుతూ, సడలిపోతూవుండే సమాజవ్యవస్థ తన స్వతంత్రనియమమును సంఘటించుకోగలదు. కాని ఈ నియమాలు మనోవృత్తులమీద భారంగా ఉండవలసినఅవసరంలేదు. అంతేకాదు; అనుశాసితముగా, ఆఖ్యానముగా వుంటున్న వ్యక్తిజీవితము ఆ సమాజనియమాల

మధ్యలో వుంటూనే వికసించి, విప్పారి, ఉపయుక్తముగా వెలుగొందుటకు అవకాశము పొందగలుగుతుంది.

ప్ర: శరీరంయొక్క ఆకాంక్షలు స్వభావతః మనస్సుతో సంబంధం కలిగే వుంటాయి. వియోగాన్ని స్వీకరించినప్పుడు శరీరంయొక్క కోరికలు నెరవేరటం ఎలాగు?

జ: మనసుయొక్క కోరిక మనస్సుదే. మనస్సుకోరేది తనువుకు లభించకపోతే, తనువు ఎవర్నినిందించవలసిన అవసరంఏముంది? కనుక మనస్సుకు చేకూరిన ఉపలబ్ధి తనువుకుండనప్పుడు ఆ వియోగాన్ని అది సహించితీరవలసిందే. అలానే తనువుకు ప్రాప్తించినది మనసునకుండదు కొబట్టి ఆ వియోగాన్ని మనస్సు భరించవలసిందే. ఈవిధంగా ఒకవైపు ఉపలబ్ధి, మరొకవైపు వియోగం, లేదా ఒకవైపు వియోగం, మరోవైపు ఉపలబ్ధి—ఇలా వుంటటమే సముచితం. ఇందువల్ల జీవితంలో సంఘర్షణరాదు; పతనమైపోవటానికి కారణం ఉండదు.

ప్ర: సాధారణంగా మనకు మనసుకోరిక వేరు, తనువుకోరిక వేరు అన్నట్టుగా అనిపించదు. మనసుతోపాటే తనువుకోరికకూడా ఒకటిగా కలిసే వస్తున్నట్టు తోస్తుంది. అటువంటప్పుడు ఆ రెంటినీ వేరువేరుగా మీరెందుకు విభాగిస్తారు?

జ: తనువు, మనసు—ఈరెండూ ఆత్మకు అధీనములుగా, లేక అనుకూలములుగా ఉన్నట్టయితే, ఆ రెంటిలో విభిన్నతను చూడవలసిన అవసరంగాని, ఆ రెంటినీ వేరువేరుగా విభాగించవలసిన అవసరంగాని ఉండనే వుండదు. అలా కానప్పుడు....అవి రెండూ, మనం ఎంతకోరుకున్నాకూడా, ఒకేతలంలో వుండవు; కలసిమెలసి సాగిపోవు. ఈ మన అసమర్థతను ఒప్పుకొని మెలగటమే సమంజసం.

ప్ర: తనువు ప్రసక్తి ఉన్నన్నినాళ్ళూ, అనగా ప్రాప్తికోసమైన ఆకాంక్ష ఉన్నన్నినాళ్ళూ, వియోగంద్వారా ఆత్మోపలబ్ధి ఎలా సంభవం ఔతుంది? ఇతర్లకు ఇచ్చివెయ్యాలన్న భావనలోనే అహంకారప్రశమనం ఉంటుంది; ప్రాప్తికోసమైన ఆకాంక్షలో కాదుకదా!

జ : ఉపలబ్ధిలోనే వియోగం అంతర్గర్భితమై వుంటుంది. మనకు పై తోలు కావాలా? లోపలి రసం కావాలా? రసం కావాలంటే తోలు వొల్చివెయ్యాలి. తోలు వొలవకుండా ఉంచుకుందామనుకుంటే మనకు రసం అందదు. వియోగమే సర్వస్వమని నేను చెప్పిన మాటకు అర్థం ఏమంటే— మనం పరిపూర్ణంగా పరమాత్మను పొందకుండా, ఏకొంచెం ఎడంవున్నా, అక్కడ ఆగిపోదామని కోరుకోము. అందుచేత కొంతఉపలబ్ధి కలిగినా, 'న ఇతి' (ఇదికాదు, ఇంకా వుంది) అనే పదం మనలోనుంచి ధ్వనిస్తూనే వుంటుంది. పూర్తిగా పొందినవాడు ఆగేపోతాడు. ఇంకా ఇంకా పొంద వలసినవాడు, లేచి నడుస్తూ ముందుకుపోవలసినవాడు. సమష్టిప్రాప్తికి ఇవతలే నిల్చిపోకుండా వెళ్ళవలసినవాడు — అయినవానివద్ద వియోగంతప్పితే మరేముంటుంది? కాని అదొక రసహీనమైన అవస్థయని భావించరాదు. అందులోని రసం అతనికే తెలుస్తుంది.

ప్ర : ప్రతివ్యక్తి తప్పనిసరిగా మనసులోని ఆదర్శాన్ని పురస్కరించుకునే ప్రేమించటం మొదలుపెడతాడా? మామూలుగా చాలమంది తనువుయొక్క ఆకాంక్షను పురస్కరించుకునే వ్యవహరిస్తారని నాకు తోస్తున్నది.

జ : కాదు. ప్రేమ ఎప్పుడూ మనసులోనే ఉద్భవిస్తుంది. మనస్సు దానికి దోహదంఇవ్వకపోయేసరికి అదొక వ్యసనంగా తనువుకెగబ్రాకి భోగ జుగుప్సను ఉత్పన్నంచేస్తుంది.

ప్ర : వియోగంద్వారా వ్యక్తి ఖండితుడౌతాడనీ అన్నారు; పరిపూర్ణు డౌతాడనీ అన్నారు. పరిపూర్ణుడుకావటంవిషయమై చెప్పేశారు, అయింది. ఖండితుడైపోవటం ఏ యే సందర్భాలనుబట్టి వుంటుంది?

జ : దేన్ని అయితే వ్యక్తి మనసారా కోరుతున్నాడో దాన్ని పిడికి లిలో ఇముడ్చుకోవాలన్న కోరికకూడా వెనువెంటనే ఉంటుంది. ఆ లాలస లోనే వ్యక్తి ఖండితుడౌతున్నాడు. కారణం ఏమిటంటే— పిడికిలి మనది; దాన్ని మూసేసరికి లోపల ఖాళీ, ఏమీ చిక్కలేదని తెలుస్తుంది. ఈ నిరాశ వ్యక్తికి దుఃఖహేతువు, క్రోధహేతువు ఔతున్నది. వాటిమూలాన చివర కతడు ఖండితుడు, వికలుడు అయిపోతున్నాడు.

ప్ర : అంటే అర్థం — వియోగంవల్ల పరిపూర్ణుడౌతున్న వ్యక్తికి పిడికిలిలో ఇముడ్చుకోవాలన్నకోరిక ఉండదనేగా ? అట్టికోరిక అతనికికూడా ఉండేట్టయితే-- అప్పుడతడెలా పూర్ణత్వాన్ని పొందుతాడు ?

జ : అతడు వియోగాన్ని స్వయంగా స్వీకరిస్తున్నాడు. కాబట్టి పిడికిలిలో ఏదో ఇముడ్చుకోవాలని కోరడు. ఈఅంశమే అతని ఉన్నతికి, పూర్ణతకు సహాయకారి ఔతున్నది.

ప్ర : ఈలెక్కలో ఆలోచిస్తే నూటికి ఒక్కడుకూడా వియోగంద్వారా పూర్ణతను పొందజాలడు. ఎందువల్లనంటే — మీరుచెప్పిన రీతిలో వియోగాన్ని స్వీకరించేసామర్థ్యం సామాన్యంగా ఎవరికీ ఉండదు. అందరికీ పిడికిలిలో ఇముడ్చుకోవాలన్న కోరికే ఉంటుందికదా ? ఇందుకు మరి మీ సమాధానం ఏమిటి ?

జ : నూరు, వెయ్యి అని లెక్క ఎందుకు వెయ్యాలి ? బహుశః ప్రేమను శరీరస్థాయికి తీసుకురాకుండా, మనస్సుస్థాయిలోనే నిలిపియుంచుకోగలవారు నూటికి ఒక్కడుకూడా ఉండకపోవచ్చు. ఉన్నప్పటికీ అది ఆరోగ్యపరిస్థితియని నేననలేను. ప్రేమ ఖండస్థితిలో, లేదా ఒకానొక అంతస్తులో మాత్రమే ఉండి ఎందుకు తృప్తిపడాలి ? అది అఖండంగా విస్తరించి, వికాసవంతం కావటానికి ముందుగానే సుఖాన్ని, విశ్రాంతిని ఎందుకు పొందాలి ? నేనీవిధంగా అంగీకరిస్తున్నాను : నీవు చెప్పినట్టు వాళ్ళు నూటికి ఒకడుకూడా ఉండకపోవచ్చు; కాని వియోగాన్ని చాలభాగం సహిస్తూ, స్వీకరిస్తూ — సంయోగాన్ని అనుభవిస్తూ, భోగిస్తూ ఉండేవాళ్ళు ఇంచుమించు నూటికి నూరుమంది ఉన్నారు. ఎవడూ పశుతుల్యుడుకాడు. ఇలా సంయమం మనిషిలో తప్పనిసరిగా ఉండితీరింది. ప్రేమలోతులో, అభిలాషలో సంయమం అనబడేది సహజంగా సాధ్యమౌతుంది. ఏంటూంటే దాన్ని సిద్ధింపజేసుకోటం చాల దుర్గమమనిపిస్తుంది; అదొక అప్రాకృతిగా తోస్తుంది. శరీరంతో పోరాడిమాత్రం దాన్ని సిద్ధింపజేసుకోటం అసంభవమని నా నమ్మకం. కాని ఆత్మయోగాన్ని సాధింపవలసిన మనస్సుతోపాటు శరీరాన్నికూడా అటువంటి సాధనలో ముందుకు తీసుకొనివెళ్ళటం కష్టమేంకాదు. అప్పుడిక తనువుకు,

మనస్సుకుమధ్య లడాయి వుండదు. అవిరెండూ ఉత్తరోత్తరా ఉత్కృష్ట నిష్ఠాసమర్పితములై, పరిపూర్ణతను పొందగలవు.

ప్ర: వియోగాన్ని చాలభాగం సహించి, స్వీకరించి, సంయోగాన్ని అనుభవిస్తూ, భోగించటం అంటే మీ ఉద్దేశం?

జ: ఒక యువకుడు ఒకానొకయువతివైపు ఆకర్షితుడైనా డను కుందాం. ఈ ఆకర్షణే అతన్ని ఆ యువతినుండి దూరంగా నిలిపియుంచటం, అతడామెను మనసులోనే భావించుకుని సంతుష్టుడవటం — ఇదికూడా ఒక్కొక్కప్పుడు సంభవమే. తరువాత సమయంవచ్చినప్పుడు తల్లిదండ్రులేదో సంబంధం విచారించటం, అతడు వారి యిష్టప్రకారం వివాహంజేసుకోటం జరుగుతుంది.లేదా ఒక యువతి, ఒక యువకుడు పరస్పరం ప్రేమప్రకటించు కొని వివాహంచేసుకుందామని వాంఛించియున్నారనుకుందాం. అబ్బాయి యొక్కగాని, అమ్మాయియొక్కగాని తల్లితండ్రులు వారి వివాహానికి అంగీక రింపకపోవచ్చు. ఇటువంటిపరిస్థితిలో అనేక ఊహలకు తావుఉంది. ఆ యువకుడుగాని, ఆ కన్యగాని తమను తాము పూర్తిగా తల్లిదండ్రుల అధీ నానికి అప్పజెప్పుకోకపోవచ్చు. ఎక్కడో తల్లిదండ్రుల ఇష్టప్రకారం తమ వివాహాలు జరగటానికి అంగీకరింపకపోవచ్చు. అయినా తల్లిదండ్రులమీద వుండే గౌరవమర్యాదలు పురస్కరించుకుని కొంతకాలం వారు అవివాహితులు గానే ఉండవచ్చు. లేదా, ఆయిద్దరిలో ఒకరుమాత్రం తల్లిదండ్రుల ఇచ్ఛకు లొంగిపోయి, వారి యిష్టప్రకారం వేరే వివాహం చేసుకోవచ్చు. అప్పుడిక ఆ రెండోవ్యక్తి జీవితాంతంవరకూ పెళ్ళిలేకుండా ఒంటరిగానే ఉండిపోడానికి ప్రయత్నించవచ్చు. ఇలా అనేకవిధాలుగా సంభావించవచ్చు. ఇంకోరకమైన ఊహకుకూడా తావుఉంది: ఆ యిద్దరూగాని, లేదా వారిలో ఒకరుగాని ఇచ్ఛానువర్తులై పశుతుల్యులుగా ప్రవర్తించవచ్చు. ఇది అకల్పనీయమైన ఊహ. అయినా ఇటువంటి ఒక్క పరిస్థితిలోతప్ప మిగతా అన్నిసందర్భాల్లోనూ వియోగాన్ని సహించక తప్పదు. ఈవియోగాన్ని వ్యక్తి ఎంత ఎక్కువ హార్దికభావంతో స్వీకరిస్తే అంత మంచిది. వియోగం ఉపలబ్ధిశూన్యము కాదు అని ఇదివరకే చెప్పాను.

ప్ర: హార్దికభావంతో స్వీకరించే తెలివితేటలు ఉండటం కష్టమే.

జ : నిజానికి తెలివితేటలతో వియోగాన్ని హృదయపూర్వకంగా స్వీకరించనేలేము. ఆపని దుస్సాధ్యమేకాదు; అసంభవంకూడాను. అసలది తెలుసుకోకుండానే సిద్ధించే సంఘటన. ఆ అనిర్వచనీయ శక్తివల్లనే ఒకానొక దుష్టుడు ఒకప్పుడు చూస్తూచూస్తూండగానే సంయమిగా మారిపోతాడు. దానిని భగవత్కృప అనవచ్చు. ఎందువల్లనంటే—మరింకేపేరూ దాన్ని సరిగా నిర్వచించలేదు. తెలివితేటలవల్లనే జీవితంలో జటిలములు, కఠినములు అయిన సమస్యలు తారసిల్లుతూఉంటాయి. వానిని జయించేందుకే పురుషార్థం కావాలి. అంతా సునాయాసంగా సాగిపోతూవుంటే జీవితంలో పరిశ్రమానందం అనేది అదృశ్యమైపోతుంది.

ప్ర : ఇటువంటిస్థితిలో హార్దికస్వీకృతి ఎలా సంభవమౌతుంది ?

జ : హార్దికస్వీకృతి ఎప్పుడూ అసంభవంకాదు. ఎందువల్లనంటే— మధ్య ఎన్ని అభ్యంతరాలున్నా హృదయానికి హృదయం సంప్రాప్తమౌతున్నది. కాని కనిపిస్తున్నవియోగం దానికి మహత్వపూర్ణముగా తోచదు. అసలు స్వీకృతే ఉపలబ్ధి అన్నమాటయథార్థం. శుద్ధ నకారంలో స్వీకారానికేముంటుంది ? కాబట్టి వియోగాన్ని స్వీకరిస్తున్నామంటే—ఆ వియోగం లోపల—యోగం వున్నదని అంగీకరించవలసిందే లోపల స్వీకృతి వున్నట్టయితే— అనగా ధ్యానం, మననం, చింతన, స్మరణ ద్వారా ప్రియోపస్థితి అనుభూతమౌతూఉండగా—ఇక బాహ్యమైన వియోగభారాన్ని సహించటం ఏమంత కష్టంకాదు. పైగా చాల ప్రీతికరమేఔతుంది. ఈవిధంగా ప్రేమ వ్యథను సహించే నేర్పును ప్రేమేప్రసాదిస్తుంది. ప్రేమికునికి వియోగ విరహాలు వాటంతటవే రసప్రదములౌతాయి. ఇందులో విశేషంగా నేర్చుకోవలసిన అవసరంగాని, సాధించవలసిన అవసరంగానిలేదు.

ప్ర : ప్రియావియుక్తుడైన వ్యక్తి ప్రియురాలిమీదినుంచి మనసు మరలించుకుని మరొకతెపై మరులుకొనటం సంభవమేనా ?

జ : అటువంటి అవసరం నాకేమీ కనిపించటంలేదు. ప్రేమపాత్రమును అత్యంతనికటస్థముగా తెచ్చుకుని అప్రేమపాత్రమునుగా చేసుకున్నప్పుడే ఆధారము స్థానాంతరితముకావలసిన అవసరం ఏర్పడుతుంది. లేకపోతే అది విచలితము కావలసిన అవసరం ఏమున్నది ?

ప్ర : వియోగానికి మీరు ఇంతమహత్తును అంటగడుతున్నారు. కాని కొందరు దంపతులు కలిసివుండి పరస్పరం సంతుష్టులుగానే కనిపిస్తున్నారే!

జ : కనిపిస్తున్నారు, కాని అంతమాత్రాన్నే మనం ముందుకుపోయి వారివిగురించి ఏమిన్నీ నిశ్చింతగా చెప్పేందుకు వీల్లేదు. కేవలం భార్యాభర్త లైనంతమాత్రాన్నే ఏ దంపతులూ సంతుష్టులుగా ఉండజాలరు. సంతోషానికి భోగంతో విరోధం. దానికి దేనితోటిసహయోగం ఉన్నదో అది వారిద్దరికీ అస్వాస్థ్యకరమైన సాన్నిధ్యాన్నికాదు: స్వాస్థ్యప్రదమైన ఎడమునే చేకూరుస్తుంది. సీతారాముల పరస్పరసౌఖ్యానికి వారిద్దరూ ఒకేచోట కలిసివుండాలన్న షరతు లేదు. ఒకరిపైఒకరికి అగాధమైన విశ్వాసముంది. ఆతత్త్వమే వారిద్దరి మధ్య సమస్త అంతరాయాల్నీ నిశ్శేషంగా తొలగించివేసింది. వారు ఆదర్శ దంపతులనిపించుకున్నారు. ఇందుకు సీత నిర్వాసం, అగ్నిపరీక్ష— ఈ వ్యవధానంకూడా తపోరూపంగా సంఘటిల్లింది— తోడుపడింది. ఈ వ్యవధానం మనకు చాల దారుణమైనదిగా కనిపిస్తుంది. కాని అది వారి హృదయాలను దూరంచేయగలిగిందా? శంకాన్వితములనుచేయగలిగిందా?లేదు;లేశమాత్రమూ లేదు. భార్యాభర్తలై ఎవరైనా సంతుష్టులుగా వున్నారంటే—తమ యిద్దరి మధ్య ఒక్క ధర్మం తప్ప మరే యితర నియామకతత్త్వమూ లేనటువంటి దంపతులే. ఇటువంటి దంపతులు ఈనాడుకూడా చాలమందే వున్నారని నన్ను విశ్వసించమంటావా? నేనుమాత్రం అంతతొందరగా అలా విశ్వసించలేను.

ప్ర : చాలమంది దంపతులు పరస్పరం విశ్వాసపాత్రులుగా వుండటం లేదు. చాలసందర్భాలలో భర్త భార్యయెడల విశ్వాసఘాతుకంగా ప్రవర్తిస్తూ వుండటం చూస్తున్నాం. అటువంటిస్థితిలో భార్య అతన్ని స్వేచ్ఛగా వొదిలేసి ఊరుకోవలసిందేనా? లేకపోతే కొంచెం కళ్ళెం బిగించి ఉంచాలా?

జ : ప్రేమ ఒక్క విశ్వాసం అన్న బంధనంలోతప్ప మరేయితర బంధనంలోనూ ఇముడదు. విశ్వాసం స్వేచ్ఛను తగ్గించదు; మెల్లి మెల్లగా స్వేచ్ఛలో సహృదయతను సముత్పన్నంచేసేందుకు ప్రయత్నిస్తుంది. స్వతంత్రత—పరిసమానమైన సహృదయసమన్వితం అయినప్పుడు—అటువంటిశక్తి మరొకటి ఉండబోదు. ఆత్మానుశాసనమే దాని అస్త్రం. కనుక

ఆ శక్తి సామాజికమర్యాదలను భంగంచెయ్యదు; దృఢతరముగా చేస్తుంది ఇంకా అదే మర్యాదను సృష్టిస్తుంది అనికూడా చెప్పవచ్చు.

ప్ర : ఒక పురుషుడు పరస్త్రీని కోరుతూంటే—భార్య అతనికి స్వతంత్రం ఇచ్చివెయ్యవలసిందేనా ?

జ : లేకపోతే స్వతంత్రాన్ని లాగివేసుకోగలదా ?

ప్ర : ప్రేమకు బదులు ప్రేమ, విశ్వాసము లేకపోతే ఇక ప్రేమ ఏ ఆధారంమీద నిల్చివుంటుంది ?

జ : బహుశా నిలవదు.

ప్ర : పరస్పరం ప్రేమ, విశ్వాసం పెంపొందాలంటే ఏమిటిఉపాయం?

జ : నాకు తోస్తున్న ఉపాయం ఏమిటంటే—ఒకరు మరొకరికి పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చివెయ్యాలి, స్వేచ్ఛగా ఉండనీయాలి. అందువల్ల ప్రేమ తునిగిపోదు; విశ్వాసం పెంపొందుతుంది.... అని మనం ఆశించవచ్చు.

ప్ర : కాని పశ్చిమదేశాల్లో ఈస్వాతంత్ర్యపరిణామం చూస్తున్నారు కదా ! అది మంచిదేనంటారా ?

జ : అక్కడ వాళ్ళు స్వతంత్రం ఇవ్వరు; తీసుకుంటారు. అంటే.... తమకుమాత్రమే కావాలనికోరుకుంటారు. అటువంటప్పుడు మంచిపరిణామం ఎలా సాధ్యమౌతుంది ?

ప్ర : స్వతంత్రం తీసుకుంటున్నారుకనుకనే ఇస్తున్నారుకూడా. ఈ విధంగా ఇరువురూ స్వతంత్రంగానే ఉంటున్నారు; ప్రమాదం ఏముంది అందులో ?

జ : కాదు, తనలో స్వతంత్రం అనేది పరిపూర్ణంగా ఉన్నప్పుడే మరొకరికి ఇవ్వడం అనేది జరుగుతుంది. స్వతంత్రం తీసుకోబడుతున్న దంటే—అది అపహరణ అన్నమాటే. మనలో మనం ఒకరివద్దనుంచి ఇంకొకరు లాక్కొని, మన సొంతం అయిపోయినట్టు భావిస్తున్న స్వతంత్రం నాలుగువైపులా పారతంత్ర్యభావాన్నే విరజిమ్ముతుంది. ఈనాటి పరిస్థితి

కొంచెం ఇంచుమించు ఇలాగే వుంటున్నది. స్వాతంత్ర్యపుపిలుపులోనుంచే మనం డిక్టేటర్‌షిప్‌ను (నియంతృత్వాన్ని) ఆవిష్కరించుకున్నాంకదా! స్వాతంత్ర్యంలేనివాడే స్వాతంత్ర్యాన్ని కోరుతాడు. అట్టివాడు పరాధీనుడన్న మాటే. స్వాధీనత ఎప్పుడూ మర్యాదాశీలమైనది. భోగమునందుగాక అధికంగా సేవయందే దాని ప్రవృత్తి. తనకొరకై స్వతంత్రాన్ని కోరుకునే వానికి ఇక మిగతావిషయాలపట్ల అపేక్షఉండదు. ఈవిధంగా అతడు స్వకార్య నిర్వహణబాధ్యతనుకూడా ఒకవిధంగా ఇతర్లమీదే రుద్దుతాడు. తన అధికారం సాగవలసినచోట ఇతరుల కర్తవ్యాన్ని నియోగింపజూస్తాడు. ఇంకా విడమరచి చెప్పాలంటే—ఇతర్లయెడ తాను నిర్వర్తింపవలసిన కర్తవ్యంనుంచి తానుమాత్రం విముక్తుడౌతూఉంటాడు. ఇటువంటి స్వతంత్రం సమాజసంయమాన్ని శిథిలంచేస్తుంది; సహజమర్యాదలను నాశనంచేస్తుంది. దానిఫలితంగానే కృత్రిమములైన—చట్టనిర్మితములైన మర్యాదలను సృష్టించి సమాజాన్ని ఒకదారికి తేవలసివస్తున్నది. అది జీవనవికాసం కానేరదు. పతనమన్నమాటే.

ప్ర : ఒకరొకరికి స్వతంత్రం ఇచ్చుకున్నందువల్ల పరస్పరవిశ్వాసం, వికాసం సిద్ధిస్తాయి; కాబట్టి వివాహవిచ్ఛేదంవంటి ప్రశ్న ఉదయించదనే అంటారా?

జ : దాని తీవ్రతమాత్రం అవశ్యం తగ్గిపోవలసిందే. వివాహం ఏ క్షణంనుంచి ఒక నిర్బంధంగా మారుతుందో ఆక్షణంనుంచీ, విచ్ఛేదాన్ని సమర్థించటం ఆరంభమౌతుందని భావింపవచ్చు. విశ్వాసం, ప్రేమ నిండారి వున్న ఒక ఉత్కృష్టావస్థను నేను ఊహించగలను. ఆయవస్థలో భర్తగాని, భార్యగాని రెండవవారి ఘోరమైన వ్యాధిని, అసమర్థతను లేక అభావాన్నీ కూడ తన కృతార్థతగానే స్వీకరించగలగటం సాధ్యమే. నేనొక యిల్లాలిని ఎరిగివున్నాను, ఆమె....తన భర్త నపుంసకుడైనాకూడా....ఆదర్శగృహిణి యనిపించుకుని జీవితం గడిపింది; ఇప్పుడూ గడుపుతున్నది. భర్త నపుంసకుడన్న సంగతే తనకు తెలియనట్టుగా ప్రవర్తిస్తుందామె. అది మరొకరికి చెప్పుకునే విషయమా మరి! విశ్వాసముయొక్క, ప్రేమయొక్క సద్భావం మీద వివాహసంస్థకు సంబంధించిన బాహ్యనియమనిబంధనలు అనావశ్యక

మని నాకు తోస్తున్నది. ఈ అనావశ్యకతలో మర్యాదాభంగం ఏదీ కనిపించదు. అనివార్యంగా విచ్ఛేదం వస్తే వస్తుంది. విచ్ఛేదాన్ని కోరుకోటం మాత్రం భోగాన్ని కోరుకోటం అన్నమాటే. తదీయమైన ఆందోళనలో నాకు శుభలక్షణం ఏదీ కనిపించదు. విచ్ఛేదం జరగవచ్చు. కాని దాన్నిగురించిన ఆందోళనమాత్రం పనికిరాదు.

ప్ర : భార్యాభర్తలిద్దరిలో ఒకరు విచ్ఛేదంకోరుతున్నారు; మరొకరు కోరరు. అటువంటప్పుడు సమస్య ఎలా పరిష్కారం కావాలి ?

జ : విచ్ఛేదం ఇష్టంలేని వ్యక్తి విచ్ఛేదాన్ని కోరుతూన్నవ్యక్తిపై తన ప్రేమను క్రుమ్మరించి ఏమి సఫలీకృతుడౌతాడు ? చట్టం లేదనుకో, ఏమిజరుగుతుంది ? భార్యాభర్తలిద్దరిలో ఒకరికి కలిసి కాపురంచేయటం ఇష్టం లేనప్పుడు రెండోవ్యక్తి తనప్రేమను సార్థకంచేసుకోవాలని హఠంచేస్తే అది క్రూరతగా పరిగణించవలసిందేగా ! కాబట్టి చట్టంగురించిన సమస్యే లేదు. ఉన్న సమస్య అవతలవ్యక్తిని దారికి తీసుకురావటం ఎలాగ ?— అనే. ఆప్రేమను ప్రేమచేతనే జయించాలి. అంటే అర్థం ఏమిటంటే— ఒకప్పుడెక్కడేనా అప్రేమ ఆరంభం అయితే దాన్నికూడా మనం ఆదరించవలసిందే; సత్కరించవలసిందే. ఆగ్రహం (పట్టుదల) వున్నచోట ప్రేమకు తావ్వుదు. కాబట్టి నిరాగ్రహమైన ప్రేమే చివరకు విజయం పొందుతుంది. నిరాగ్రహియైన ప్రేమే సత్యాగ్రహి అవుతుంది. ఎందువల్లనంటే—మన ప్రేమ గనక భగవంతునిలో వున్నట్టయితే, మన ఆగ్రహం (పట్టుదల) సత్యంలో వున్నట్టే. అవిచ్ఛిన్నమైన భావసంపదతో ఆగ్రహహీనమైన ప్రేమే ఈశ్వరప్రేమ. దీన్నే మరొకవిధంగా చెప్పాలంటే—సత్యమునందు అవిచ్ఛిన్నమైన ఆగ్రహమే (పట్టుదలే) ఈశ్వరస్వరూపం.

ప్ర : ఒకవేళ భార్యాభర్తలిద్దరూ విచ్ఛేదాన్ని కోరుతూఉంటారు. అటువంటప్పుడుకూడా 'విచ్ఛేద' శబ్దం దోషభూయిష్ఠమనే మీ అభిప్రాయమా ?

జ : మళ్ళీ కలుసుకోటానికి ఆస్కారంలేకుండా విడిపోవటమనే—

'విచ్ఛేద'శబ్దంలోవున్న అర్థం. అందుచేత అది నాకు అంతప్రియమైనది కాదు. విచ్ఛేదం జరగవచ్చు;కాని మళ్ళీ మున్ముందు ఇరువురూ కలిసికొనేందుకుగాను ప్రయత్నం అందులో గర్భితమైవుండాలి. అథవా సద్భావం సమసిపోకుండా, కేవలం వ్యవస్థనుమాత్రం మార్చే విచ్ఛేదమైవుండాలి. ఇటువంటి వివేకపూర్ణమైన విచ్ఛేదంలో చట్టంప్రసక్తి రానేరాదు. చట్టబద్ధంకానప్పటికీ యిది చాలా శ్రేష్ఠమైనది. అందుచేత చట్టసమ్మతమైనవిచ్ఛేదం అవసరమే అయినాకూడా నాకు హర్షదాయకంకాదు.

ప్ర: ఇద్దరూ ఒకేచోట వుండి కలహాలుపెంచుకుంటూ క్లేశములపాలు కాకుండా వేరువేరుగాపోయి వుండటమే మంచిదికాదా?

జ: చెబుతున్నానుగా: మధ్యమధ్య ఎడమౌతూవుండటమే మళ్ళీ కలవటానికి సాధనం ఔతుంది. కాని రెండువైపులనుంచి విడిపోవటం అంటే మళ్ళీ కలుసుకొనే అవకాశాలు లేకుండాచేసుకొనడం అన్నమాటే. అలాంటి కఠోరమైన వీడ్కోలుకు ప్రపంచంలో ప్రకృతిభావంతో స్థానం లేదు. ఉన్నదీ అంటే—అన్ని వైపులా అది చిక్కుల్నే వ్యాపింపజేస్తుంది.

ప్ర: కాని అది అప్పుడప్పుడు తప్పనిసరి అయిపోతున్నది. భర్త మరింకెవరివాడో అయిపోయి, ఇల్లే పట్టించుకోకుండా తిరుగుతూంటే పాపం భార్య ఏం చేస్తుంది?

జ: ప్రేమతో, ధైర్యంగా సహించాలి.

# విచ్ఛేదం, వివాహం

ప్ర : మీరు విచ్ఛేదాన్ని సమర్థించరు. అయితేమరి, భర్త ఎక్కడికో వెళ్ళిపోయాడు మళ్ళీతిరిగివస్తాడన్న ఆశ ఏమాత్రంలేదు. అటువంటి ఒకమనిషి కోసమని జీవితమంతా వమ్ముచేసుకొనేకంటే.... అతనికి పూర్తిగా విడాకు లిచ్చేసి ఆ యిల్లాలు మరొక ఆశ్రమాన్ని ఎన్నుకోటం మంచిదికాదూ?

జ : జీవితాన్ని వమ్ముచేసుకోటం, సార్థకంచేసుకోటం అనేపదాల అర్థాన్ని మనం ముందుగా తెలుసుకోవాలి. జీవితం అకృతార్థమైపోయిందనే భావం మనసులో నింపుకొని జీవించేపద్ధతి నిజంగా తప్పే. తాత్కాలికంగా గాని, శాశ్వతంగాగాని కలిగిన భర్తృఅభావంవల్లనే జీవితం వ్యర్థం,నిస్సారం అయిపోయినట్టు భావించకూడదు. బాహిరములైన సుఖసంతోషాలు అనుభ వించే అవకాశమేనా జీవనసార్థకత అంటే? కనుక....వియోగమే మూల ధనంగా పొందిన జీవితమే....నా ఉద్దేశంలో....సేవాభావంవైపు సహజంగా ఉన్ముఖమై, విరాట్ తత్త్వంవైపు అగ్రసరమౌతుంది.

ప్ర : భర్త ఒక మహానుభావుడన్న అత్యధికశ్రద్ధ వున్నప్పుడే వియోగ మనబడే మూలధనం ప్రయోజనకారి ఔతుంది. కాని అటువంటి శ్రద్ధ లేనప్పుడు, పరస్పరప్రేమ అభావమైనప్పుడు, విచ్ఛేదమే వాంఛనీయంకాదా?

జ : ఈరకమైన చర్చకు ఒక కల్పితఉదాహరణను ఆధారంగా తెచ్చు కోవలసివుంటుంది. కనుక అటువంటిచర్చలోనుంచి నిజమైనవెలుగు బయల్ప డదు. ప్రతివానిలోనూ మహనీయత గర్భితమైవుంది. వ్యక్తంకాకపోతే నిద్రాణమైఉన్నది—అనేచెప్పాలి. మొదట తుచ్ఛుడుగా, సాధారణుడుగా కనిపించినవాడు తరువాత ఒక మహనీయుడుగా అసాధారణుడుగా మారి పోయిన ఉదాహరణలు లేవంటావా? తుచ్ఛమనబడేదానికీ, మహనీయత అనబడేదానికీ మధ్య దాటశక్యంకాని కందకమేమీలేదు. శ్రద్ధ ఒక సామాన్య వ్యక్తినికూడా ఒక పెద్ద విశిష్టవ్యక్తిగా మార్చగలదు. భర్తయొక్క వ్యక్తి త్వంలో భార్యకేమీ భాగంలేదనుకోటం పొరపాటు. అర్థాత్తూ భార్య తన స్నేహవిశ్వాసాలద్వారా తన భర్తవ్యక్తిత్వంలో అణగిమణగియున్న ఆశయా లను జాగృతంచేయగలదు, ఈమాట ఒక్క భార్యవిషయంలోనేకాదు; భర్త

విషయంలోకూడా చెప్పతగినదే. దాంపత్యసంబంధమందు పరస్పరసహిష్ణుత, ఉదారత, విశ్వాసంకలిగి వ్యవహరించేట్టయితే....ఒకరిలోపాలవల్ల మరొకరు భిన్నులుకావటంగాని, ఇరువురూ భిన్నులైపోవటంగాని జరగదు; పైగా సహానుభూతిద్వారా పరస్పరపూరకశక్తులుగానూ, సహయోగులుగానూ తయారౌతారని నా అభిప్రాయం. ఎటువంటి పరిస్థితిలోనైనాసరే, ఒకరొకరినుండి స్వతంత్రులైపోవాలన్న ఊహగాని, అటువంటి స్వాధీనతగాని ఉండరాదని నేనెలా చెప్పగలను? కాని స్వతంత్రతయొక్క నిజమైన ఉపయోగం స్వతంత్రాన్ని ఇవ్వటంలోనే అదికంగా కనిపిస్తుంది; తీసుకోటంలోలేదు. భార్య భర్తకు స్వతంత్రాన్ని వీలైనంతవరకు ఇచ్చివెయ్యాలనే నాకోరిక. అట్లే భర్తకూడా భార్యకు పూర్తిస్వతంత్రాన్ని ఇచ్చివెయ్యవలసిందే. ఈ దృక్పథం కర్తవ్యంమీద ఆధారపడివుండన్నమాట, అధికారంమీదకాదు. అధికారప్రవృత్తి వచ్చిపడింది అంటే దాంపత్యసంబంధం స్థిరంగా నిల్చివుండజాలదు. దానికి ఆధారం 'ధర్మం' అయినప్పుడు అది భవిష్యత్తులో స్థిరంగా నిల్చివుంటుందని ఆశించవచ్చు. ఈనాడు 'సోషల్ కాంట్రాక్టు' రూపంలో వివాహసంస్థ చిన్నాభిన్నము, ధ్వంసపటలము అయిపోతూవున్నది. అంతకన్నా దానికొక బలిష్ఠమైన ఆధారం లభిస్తే స్థిరంగా నిల్చియుండగలుగుతుంది.

ప్ర: సహిష్ణుతాగుణం దాంపత్యసంబంధంలో చాల హానికరంగా పరిణమిస్తున్నట్టు కనిపిస్తుంది. తల్లి సహించిఊరుకున్నందువల్ల కొడుకు, భార్య సహించిఊరుకున్నందువల్ల భర్త దుర్వృత్తులకు బలంలభించే అవకాశమే కనిపిస్తున్నది. ఇక సహిష్ణుతాగుణం ఎలా వాంఛనీయం ఔతుంది?

జ: సహిష్ణుతాగుణం....అన్ని సద్గుణాలకుమల్లేనే....మరీ మితిమీరితే అవగుణం ఔతుంది. కాని ఆ కారణం పురస్కరించుకుని సహిష్ణుతను అవగుణంగా వర్ణించరాదు. సహిష్ణుత అనగా కేవలం సహించిఊరుకోవటం, కేవలం అణగిమణగిఉండటం అని తలచరాదు. బుద్ధిని ప్రకృతిస్థముగా వుంచుకుని, సమభావంకలిగి, దాన్ని వినియోగించుకుంటూ వుండటమే సహిష్ణుత అంటే సరైన అర్థం. ఆవేశం, క్రోధం, కొరకొరలాడుతూ వుండటం—ఇవన్నీ పరిస్థితిని మరీ అస్తవ్యస్తంచేస్తాయి. ఎంత పెద్ద కలహా

మైనా సాగుతూవుండవచ్చు; కాని అందులోనే ఒక చాల చిన్నవిషయం ఏదో లభిస్తుంది; దాన్ని ఆధారంగాచేసుకుని ఏదో ఒకపక్షంవారు కొద్దిగా మందహాసంచేశారంటే చాలు, అంత పెద్దగందరగోళంకూడా నిమిషంలో సమాప్తమైపోతుంది. ఒకానొక వికారం వ్యక్తిలో ప్రవేశించిందంటే— దాన్ని మనం ఒక తాత్కాలికమైన రోగం అని పరిగణించగలిగినట్టయితే, చిర్రుబుస్సుమంటూ ఎదురుకోపం తెచ్చుకోము; సహానుభూతిపూర్వకంగా అతని రోగానికి ఉపచారంచెయ్యటంలో నిమగ్నులమౌతాము. సహిష్ణుత అంటే ఆ దిశలో అర్థంచేసుకోవాలని నా ఉద్దేశం. అణగారిపోవటం అనే అర్థంచెప్పుకోటం సరికాదు.

ప్ర : పరిస్థితి అస్తవ్యస్తమైపోవటమనేది తరువాత జరుగుతుంది. అసలు మొట్టమొదట ఇరువురి ప్రకృతిలోనూ ఉన్న వైరుధ్యమే పరస్పర సామరస్యాన్ని భగ్నంచేస్తుంది. అది కారణంగా ఒకరినొకరు సరిగా అర్థం చేసుకోటం ఉండదు. వారి ప్రకృతివైరుధ్యమే ఇద్దరిమధ్య ఒక కందకంలా ఏర్పడుతుంది. దాన్ని పూడ్చివెయ్యటం అసాధ్యం అయిన పరిస్థితిలోనయినా వారు విడిపోవచ్చునని మీరు సలహాఇవ్వరా ?

జ : వాళ్ళిద్దరూ విడిపోవాలనే కోరుకుంటూఉన్నప్పుడు ఇక మూడో వాడెవరో వచ్చి ఏదో చెప్పవలసిన అవసరం ఏముంటుంది ? ఇంతకూ విడిపోవలసివచ్చినా కోపతాపాలతో విడిపోకూడదు. ప్రసన్నచిత్తులుగానే విడిపోవాలి.

మరొకఅంశంకూడా నేను నమ్ముతున్నాను : ప్రపంచంలో ఏ ఇద్దరువ్యక్తులూ ఒకరొకరికొరకై జన్మించారు అని చెప్పదగినవారు ఉండరు. ఆకర్షణ, బెట్టు, బిగింపు స్త్రీపురుషులమధ్య సహజం. కనుక పరస్పర సామరస్యం స్వాభావికంకాదు. అది సాధించి పొందవలసినది. అందుకు సంయమంకావాలి; అభ్యాసం కావాలి. ప్రేమ అనే పేరుతో పిలువబడుతున్న ఆకర్షణ చంచలమైనది. దానికి మర్యాద తెలియదు. ఇటువంటి గుడ్డి ఆకార్షణ అనే భూమికపై సామరస్యం సంభవమే అనుకోటం ఒక భ్రమ. కాబట్టి ఈసమస్య ప్రేమావస్థలోనిదికాదు; ప్రేమకు పూర్వావస్థలోనిదీకాదు; ప్రాప్తికి తరువాతది. (అంటే వివాహోత్తరకాలమునకు సంబంధించినది—

అనుకో.) ప్రేమావస్థలో రెండవవైపున అంతా పరిపూర్ణంగానూ, సుందరంగానూ కనిపిస్తుంది. ప్రాప్తిఅనంతరం ఆ సౌందర్యం. కమనీయత ఎగిరిపోతాయి; ప్రేమపాత్రమైనవ్యక్తిలో రకరకాల విచిత్రాలు పొడసూపటం మొదలౌతుంది. ఆసమయంలో వ్యక్తియొక్క బాహ్యేంద్రియాలు, వాటి వశంలోవుంటున్న మనస్సు సామరస్యసాధనకు సహాయకములు కాకపోగా, విద్రోహకరములు ఔతాయి. అటువంటప్పుడు సహజంగా చంచలమైన మనస్సును వశంలోకి తెచ్చుకోజాలిన ఒక ప్రబలమైన నిష్ఠ అవసరం. అంతేగాని సామరస్యసాధనను ఇంద్రియాసక్తమైన మనస్సుకు. బుద్ధికీ వొప్పజెప్పేస్తేమాత్రం అది సిద్ధించనేరదు. కనుక నేను చెప్పేదేమంటే— ఇతర్లతో తర్కించటమంటూ పెట్టుకోని కర్తవ్యదృష్టే ఇటువంటి పరిస్థితిలో ప్రయోజనకారి ఔతుంది. లేకపోతే దోషారోపణ, ఛిద్రాన్వేషణ తప్పవు. దోషాన్వేషణప్రవృత్తి వచ్చిపడిందీ అంటే ఇక గార్హస్థ్యనౌకకు క్షేమంలేదు. తునిగిపోతుంది; లేదా మునిగిపోతుంది.

ప్ర : వివాహానంతరం భార్యప్రకృతికీ, భర్తప్రకృతికీ సామరస్యం కుదరకపోయేసరికి వారి మనస్సులు మరొకవైపుకు ఆకర్షితాయాకావచ్చు. అటువంటప్పుడా యిరువురు తమసంబంధాన్ని విచ్ఛేదంచేసుకుని ఆ మరోవైపుకు సాగిపోవటం ఉచితమంటారా, కాదంటారా ?

జ : సాధ్యమైనంతవరకు విచ్ఛేదంకాకుండా కాపాడుకోటమే మంచిది. మరోవైపుకు లాగుతున్న ఆకర్షణను తాత్కాలికమైన వికారంగా భావించి, ఎక్కువగా ఉద్విగ్నులు, అసహిష్ణువులు కారాదు.

ప్ర : చేసుకున్న భర్తతోగాక, మరొకపురుషునితో తన కెక్కువ ప్రకృతిసామరస్యం కలుగుతుందని తోచేట్టయితే, అతన్ని పరిగ్రహించి తాను సుఖంగా జీవించగలనన్న ఆశపొడసూపితే, ఆమె అలాగే ఎందుకు చేయకూడదు ?

జ : ప్రకృతిసామరస్యం ఏర్పడుతుందని తోచినంతమాత్రాన్నే నిజంగా అక్కడ ఆ సామరస్యం ఉండితీరుతుందని తొందరపడి నిర్ణయించుకోరాదు. ప్రేమావస్థలో అంతా సామరస్యమే సామరస్యంగా కనిపిస్తుంది.

ఆ భ్రమలోనేపడి వివాహంకూడా చేసుకుంటారు. కాని ప్రేమవివాహం జరిగిన అనంతరం సామంజస్యానికి బదులు హద్దుమీరిన అసామంజస్యమే ఉత్కటంగా, విషమంగా ఎదుర్కొంటుంది. తరచుగా ప్రేమవివాహాలు చివరకు ఘోరమైన మనఃక్లేశాన్ని తెచ్చిపెట్టేవే. పై కిమాత్రం మొట్టమొదట ఏదో గొప్ప ఆశ కనిపిస్తున్నట్టుగా ఉంటుంది. అంతమాత్రాన ఆ లోభంలో పడిపోవలసిన అవసరం ఏమీలేదు.

ప్ర : తొందరపడి నిర్ణయించటం జరగలేదనుకుందాం. బాగా స్థిర చిత్తంతో తాపీగా ఆలోచించుకున్నమీదటే ఫలానావ్యక్తిని వివాహంచేసుకుంటే జీవితం కృతార్థమౌతుంది అన్న నిశ్చయానికి వచ్చినతరువాత ఆ పరిస్థితిని స్వీకరిస్తే ఇబ్బందేమన్నా వుంటుందా ?

జ : వివాహమనేది మన చేతిలోవున్న సంఘటన కాదనీ, అది గ్రహాలద్వారా నిర్ధారితమౌతుందనీ విశ్వసించవలెననే అనిపిస్తూవుంటుంది నాకు అప్పుడప్పుడు. అది ఒకవిధమైన సంయోగం. ఎంతో జాగృతమై వుండే బుద్ధికూడా అక్కడ పొరపాటుపడే అవకాశంఉంది. టాల్‌స్టాయ్ తన ప్రేమను, ప్రేమపాత్రమును అత్యంతసూక్ష్మబుద్ధితో విశ్లేషించుకుంటూవుండేవాడు; రోజూ డైరీలో వ్రాసుకుంటూవుండేవాడు. ఎంతోజాగ్రతగా ఆలోచించాడు; ఆలోచించినమీదటే వివాహంచేసుకున్నాడు. కేవలం పర్యాప్తమైన ప్రజోత్పత్తిఅయిందన్న అర్థంలోమాత్రమే ఆవివాహం సఫలమైందని చెప్పాలి. కాని మరియొకఅర్థంలో విఫలమే అయింది. ఎందువల్లనంటే ఆయన కా వివాహంవల్ల ప్రబలమైన సంతాపం, క్లేశం కలిగాయి. సౌందర్యం, యౌవనం, సింగారం ఏమాత్రం తక్కువగాలేని ఈప్రపంచంలో వ్యక్తి భాగ్యాధీనుడుగా వుండవలసినవాడేగాని అంతకన్న ఏంచేయగలడు ? మనసువెళ్ళి ఎక్కడో ఒకవ్యక్తిమీద నిలుస్తుంది; కాని అంత్యకాలంవరకూ అది అక్కడే నిల్చివుండేట్టయితే దానికి 'మనస్సు' అనే పేరెందుకుపెడతారు ? దాని లక్షణం చంచలత అని విజ్ఞులెందుకు అంటారు ? కాబట్టి నీ యిష్టం, నీవేమన్నా అను; నేనుమాత్రం ఇష్టంచేతుల్లో కళ్ళెం వొప్పగించేందుకు సుతరామూ అంగీకరించను. పైగా విధిప్రేమోల నతమసక్తులమైవుండటంలోనే ప్రయోజనం ఉందంటాను.

ప్ర : ఏమైనా మనలో తెలివి అనే వస్తువొకటి ఏకాంచెమో ఉన్నది కదా? దానివల్ల ఫలానా వ్యక్తి నాకు అనుకూలంగా వుండవచ్చు అనిగాని, లేదా ఫలానా వ్యక్తి నాకు ప్రతికూలంగా వుండవచ్చు అనిగాని గుర్తించుకో గలుగుతున్నాం. దాన్ని ఉపయోగించుకొనే విషయంలో మీరేమంటారు ?

జ : ఉన్న తెలివిని నిద్రపుచ్చుకోవలసిన అవసరంలేదు. కాని మనిషిలో అంతకన్నా లోతైనతెలివి ఉండనేఉంది. అది సాధారణంగా మన పైపై తెలివికి అందేది కాదు. ఈ లోతైన తెలివిని జాగృతంగా వుంచుకోవ లసిన అవసరం ఎంతైనాఉంది. ఈ లోతైన తెలివి మనకు తెలియజెబు తుంది : గుణము—రూపము; శ్రేయము—ప్రేయము—ఈ జంటలు సర్వత్రా జంటగా ఉండవు; పైగా విరుద్ధంగాకూడా ప్రతీతమౌతూ ఉంటాయి అని. రూపాన్నిమనం త్రోసిపారవేయలేము.కాని గుణస్వీకారానికిమాత్రం ఆలోతైన తెలివే ప్రాతిపదిక. పరమాత్మ అందరిలోనూ వున్నాడని గుర్తించటం అన్ని తెలువులనూ మించిన అసలైన తెలివి. దాన్ని శ్రద్ధ అనవచ్చు. ఈ శ్రద్ధను పురస్కరించుకుని మనం ప్రవర్తించేట్టయితే ....స్వల్పయోగ్యతగల వ్యక్తిలో కూడా ఉన్నతాశయాలను జాగృతం చేయగల సామర్థ్యాన్ని నిశ్చయంగా మనం పొందగలుగుతాము. ప్రపంచంలోని వ్యక్తులంతా మనుష్యులే. ఎవరూ దేవతలు కారు. లోపలవున్న దేవత్వాన్ని మేల్కొలుపుకుంటూ క్రమశః దేవతలం కావాలి. తెలివిని వినియోగించుకోకుండా పనిజరగదు. కాని లోతైన తెలివిని అలా త్రోసిరాజని, రూపాకర్షణకే లోబడే తెలివితేటల చేతుల్లో జీవితపు చుక్కానిని అప్పగించుకున్నంతమాత్రాన పడవ నడవదు, పైగా మునిగిపోతుందికూడా.

ప్ర : భర్త భార్యలో—లేకపోతే భార్య తన భర్తలో దేవత్వాన్ని మేల్కొల్పలేనిస్థితిలోవుండి, మరెవరో ఇంకొకవ్యక్తిని పరిగ్రహిస్తే జీవన యాత్రలో చక్కని సహయోగం లభిస్తుందనే ఆశ మిక్కుటంగావున్నప్పుడు ఆమె భర్తకు విడాకులివ్వవచ్చునని సలహాయిస్తారా మీరు ?

జ : నీ ఉదాహరణ కల్పితం. సలహాకూడా కల్పనాగతమే ఔతుంది; అందుచేత అనవసరం. విడాకులిచ్చుకోటమే శ్రేయస్కరం అని నేను

సలహాలివ్వదగిన పరిస్థితి సంభవించవచ్చు; కాని అది కాల్పనికంకాదు; తాత్కాలికమే ఔతుంది.

భార్యాభర్తలసంబంధం అంటే ఎటువంటిదని ? అందులో వారికి పరస్పరం ప్రాప్తించేది ఒకరికొకరి ఉత్కృష్టతే కాదు; నికృష్టతకూడా పరస్పరం నివేదితమౌతుంది. ఈ అంశమే ఆ సంబంధానికి ఒక మహత్వాన్ని ఆపాదిస్తున్నది. ఔపచారికమైన సంబంధాల్లో మన నికృష్టతను మన దగ్గరే నిలుపుకుంటున్నాం; ఉత్కృష్టతనుమాత్రమే బయటపెడుతున్నాం. అంటే, అవి సమగ్రమైన నిర్బంధసంబంధాలు అనబడవు. ఏదోకొంత నికృష్టత ప్రతివ్యక్తిలోనూ ఉంటుంది. ఉన్నదని వ్యక్తికీతెలుసు. అది చూచుకుని తనకు తాను సిగ్గుపడటమూ జరుగుతూవుంటుంది. అది బయటపెట్టుకునేది కాదు; సర్వథా అదేయం. అయినాకూడా అది దాంపత్యసంబంధంలో మాత్రం పరస్పరం ఒకరిది మరొకరికి సంప్రాప్తమౌతూఉన్నది. అందుకనే భార్యాభర్తలు పరస్పరం కృతజ్ఞులుగా వుండవలసినకారణం ఏర్పడింది. ఒకరి నికృష్టత మరొకరికి సంప్రాప్తమౌతూవుండటం—ఇదేమంతసాధారణతహా గర్వకారణమైన విషయంకాదు. కాని అందువల్లనే దాంపత్యజీవితం గొప్పదిగా పరిగణింపబడుతూవుంది. కుత్సితము, జుగుప్సాజనకము అయిన ఈ నికృష్టతనుకూడా భార్య భర్తనుంచి, భర్త భార్యనుంచి స్వీకారపూర్వపూర్వకంగా గ్రహిస్తూ, ఒకరినొకరు సహించి నిర్వహించుకుపోతున్నారంటే—దాంపత్యసంబంధం కేవలం ప్రాకృతికంగాదు; సాంస్కృతికం అని చెప్పాలి. దానికి ఆధారం తపస్సు, సంయమం. లేకపోతే ఆకర్షణమీద ఆధారపడివుండే ప్రేమతోపాటే ద్వేషంకూడా వుంటుంది. అటువంటి ప్రేమ స్వేచ్ఛావిహారం చేసేచోట హింస, ద్వేషం, దురధికారంకూడా స్వేచ్ఛావిహారం చేస్తూంటాయి. ఆవిధంగా చతుష్పాత్తులు బ్రతుకుతూవుంటాయి. మనుజసమాజంమాత్రం ఆపద్ధతిలో పురోగమింపజాలదు.

వివాహసంబంధం వ్యక్తిని బంధించేస్తుందని భావించటం సహేతుకం కాదు. ఒక పురుషుడు, ఒక స్త్రీ భార్యాభర్తలై గార్హస్థ్యమనే జైలొకటి తమకోసం నిర్మించుకుంటారని కొందరుచెప్పే మాటను సమర్థించలేము. ఆ భార్యాభర్తల్లో వుండేటువంటిది—సమాజందృష్ట్యా అనుపదేయము, నికృ

ష్టము అనబడేదిమాత్రమే వారి దాంపత్యపుహద్దుల్లో నిల్చిపోతుంది. ఇక పోతే మిగిలింది సమాజానికి లభ్యమయ్యేందుకు సిద్ధంగా ఉండనేఉన్నది. అర్థాత్తూ భార్యాభర్తల ఉదారత, ఉత్కృష్టత, ప్రతిభ, మేధ, కుశలత, ఈ మొదలైనవన్నీ ఇతర్ల కోసం దానంచేయబడుతూ, వ్యయమౌతూ వుండ వలసిందే. అతుదానిజీవితంలో ఒక భర్తను మినహాయిస్తే మరే యితర పురుషుని సద్భావమూ పడకూడదనీ, మగవానికి ఒక్క భార్యతప్ప మిగలా స్త్రీప్రపంచమేమీ కనిపించనేకూడదనీ—ఇలాంటి మాటల్ని మనం మన్నించ వలసిన పనిలేదు. వివాహమంటే ఇటువంటి నిర్బంధాల్ని విధించే అర్థాన్ని చెప్పేట్టయితే నేనుమాత్రం అంగీకరించలేను.

ఒకానొకస్త్రీ ఒకపురుషునికి భార్యయై అతనిదృష్టికి మామూలు వ్యక్తిలా, అసలు లెక్కలోకేరాకుండా, మిక్కిలి తుచ్ఛపస్తువుగా కనిపిస్తూ వుంటుంది. కాని ఆవిడే మరొక పురుషుని దృష్టికి అత్యంతసౌందర్యవతిలా కనిపిస్తుంది. ఇటువంటి సన్నివేశాలు చూస్తూనేఉన్నాం. భర్త ఆమెను బావ గొడతాడు; ప్రేమికుడు ఆమెకోసం ప్రాణాలర్పించటానికి సిద్ధంగా వుంటాడు. ప్రేమదృష్టికి అప్సరసలా కనిపిస్తున్న అవ్యక్తే గార్హస్థ్యపు తిరుగలిముందు పనికిమాలినదే ఔతున్నదికదా? తండ్రిచేత, ఉపాధ్యాయుని చేత ఇంకా చెంపదెబ్బలు తినటానికే యోగ్యురాలైన ఒకానొక చిన్నది ప్రణయపిపాసియైన ఒక చిన్నవానికి అత్యంత ఆరాధ్య ఔతున్నది. ఒకవేళ ఆమెచేత తాను వంచితుడేఅయితే ఆ చిన్నవాడికి ఆత్మహత్యాప్రయత్నమే తప్ప మరింకో మార్గమే తోచదు; అంతతీవ్రంగా మరులుకుంటాడన్నమాట ఆమెమీద. ఇటువంటి ఉత్సర్గశీలములు, స్వాప్నికములు, ఉదాత్తములు అయిన భావముల క్రీడకు అవకాశం వివాహానంతరం సమాప్తమైపోరాదదు. భార్య అనబడే వ్యక్తియొక్క సౌందర్యం ఇనుపపెట్టెలో పెట్టి బంధించేం దుకు కాదు. అది ఆమెకు దోషరూపంలో వున్నది కాదు, గుణరూపంలో పరిగణింపతగినదే. దానిచుట్టూ ఒక ప్రహరీగోడ కట్టి నాలుగువైపులా దాన్ని బంధించియుంచే హక్కు వివాహానికి లేదు. అర్థాత్తూ దేవత్వాన్ని మేలు కొలపటంలో సౌందర్యానికి సామర్థ్యంఉంది; దానిఉపయోగం వివాహంతో సీమితమైపోరాదు; సమాప్తమైపోరాదు. అలా అయితే అది చాల అనిష్టం: వివాహంయొక్క సార్థకత అది కానేకాదు.

# స్త్రీపురుషుల స్థితిలోనూ ప్రకృతిలోనూ ఉండే వైషమ్యం

ప్ర : కాముకతవిషయంలో స్త్రీపురుషులమధ్య కొంత అంతరం వున్నట్టు ఒప్పుకుంటారా ? పురుషుడు స్త్రీకన్నా ఎక్కువ కాముకుడనీ, స్త్రీ చాలవరకు భక్తిప్రవణురాలనీ చెప్పవచ్చునా ?

జ : నేను వ్యక్తులలో భేదాన్ని ఒప్పుకుంటాను. వర్గాలమధ్య ఒప్పుకోను. వర్గాలమధ్య ఆనుషంగిక (functional)భేదం ఉంటుంది; ఆంతరిక భేదం ఉండదు.

ప్ర : ఆనుషంగిక (functional) భేదం అంటే మీ ఉద్దేశం శరీరధర్మము(function)ను గురించా ? ఈవిధంగా మీరెప్పుడూ శారీరికమనీ, మానసికమనీ విభజించే ఆలోచిస్తుంటారా ?

జ : ఆనుషంగికం (functional) అంటే కర్మవిషయికం అని చెప్పవచ్చు. తనువు-మనస్సుల భేదాన్నిగూర్చిన ప్రశ్న ఉదయించదిక్కడ. తనువుద్వారా కర్మ జరుగుతుంది; కాని ప్రేరణ మనస్సునుండే. కనుక స్త్రీపురుషభేదం కర్మవిషయికమే. ప్రాణవిషయికంగా మాత్రం అభేదమే.

ప్ర : స్త్రీపురుషులమధ్య ఏ భేదాన్ని మీరు అంగీకరిస్తున్నారో సవిస్తరంగా విశ్లేషణచేస్తారా ?

జ : ఏం ? అది అవసరమా ?

ప్ర : అవసరంకాబట్టే అడుగుతున్నాను స్త్రీ వికాసం పొందవలెనంటే ఒక వ్యక్త్యాధారం ఉండవలెననీ, పురుషునికిమాత్రం అలాగ వ్యక్త్యాధారం అవసరం అంతగాలేదనీ మీరు చాలసార్లు చెబుతూవుంటారు.

జ : ఇంకేం, అంతటితో సరిపెట్టుకోరాదూ ?

ప్ర : ఉహుఁ, అంతమాత్రాన విషయం సుస్పష్టం కావటంలేదు. ఏ ఆధారం పురస్కరించుకుని స్త్రీపురుషులమధ్య ఈ భేదాన్ని మీరు అంగీకరిస్తున్నారో తెలుసుకోవాలి.

జ : భేదం అంగీంరించవలసిన అధారంకోసం ఎక్కడికో పోవలసిన పనేముంది ? కళ్ళకు కట్టినట్టు అది కనిపిస్తూనే ఉన్నదిగా ! స్త్రీకి వ్యక్తాధారం కావలెననీ,పురుషుడు అవ్యక్తంపై పే ఉన్ముఖుడై ఉంటాడనీ—ఇది నేను స్వయంగా ఆవిష్కరించిన నిర్ణయమే. అంటే అది నాభాషే అనుకో. మనం ఉంటూన్న ఈ ప్రదేశానికి రెండు కొసలు ఉన్నాయి. ఒకటి: భూమి; రెండవది : ఆకాశం. ఇక సర్వం ఈమధ్యలో ఉంది. ఆకాశం ఎప్పుడూ ఒకేరకంగా నీలపురంగులో వుంటుంది. అసలు దానికి నిజంగా ఏరంగూ లేదు. నిజం చెప్పాలంటే దానిలో వస్తుతత్త్వమేలేదు. భూమి వ్యక్తము. గట్టిగా, దృఢంగా వుంటుంది. చిత్రవిచిత్రవర్ణములతో వివిధములైన ఫలపుష్పాదులతో—శోభాయమానంగా వుంటుంది. ఆకాశంలోకూడా ఉదయ సాయం సంధ్యలయందు చిత్రవిచిత్రములైన రంగులు వెల్లివిరుస్తూ అనుపమేయమైన అపూర్వశోభ తొణికిసలాడుతూనే వుంటుంది; కాని ఆ శోభ అంతా ఆకాశానిది కాదు; ఆకాశంమీదికి వచ్చిచేరుతూవుండేది. నా వుద్దేశంలో ఈ ధరిత్రి ఒక స్త్రీ. ఆమె తల్లి; ధరిస్తుంది; భరిస్తుంది. ఆకాశం ఒక పురుషుడు. ఉండటానికి ఉన్నాడు; అంతే. అక్కడ ఒక్క పువ్వుకూడా పూయటం, వికసించటం అసంభవం. మన భాషలో 'గగనకుసుమం' అనే పదం ఉంది—ఒకపెద్ద వ్యర్థతను చిత్రించేపదం అది. పురుషుడు వట్టి నిష్ఫలుడు. ఎంత నిష్ఫలుడంటే— వంధ్య అనే పదంకూడా అతనికి అన్వయింపజాలదు. అన్నిదేశాల్లోనూ, అన్ని కాలాల్లోనూ స్త్రీలు తళుకుబెళుకులు కులుకుతూవుండే చిత్రవిచిత్రమైన వస్త్రభూషణాదులతో కనిపిస్తూఉంటారు. అదంతా వృథా అని త్రోసిపారేయవలసిందేం కాదు. అది వారిలోని స్వభావధర్మం యొక్క అభివ్యంజనమే. ఇక నీ పీ ధరిత్రి, ఆకాశంమధ్య లఘాయి ప్రసక్తి ఎత్తబోకు. అవి రెండూ బింబ ప్రతిబింబ రూపంలో పరస్పరం ఒకదానినొకటిధరించవలసిందే. ఆకాశం భారహీనం, అయినాభారవాహికూడా తానే.

ప్ర : స్త్రీపురుషులమధ్య ఈ భేదం కనిపిస్తున్నప్పటికీ—ప్రత్యేకంగా

స్త్రీకి ఆధ్యాత్మికప్రాప్తికోసం వ్యక్తి ఆసరా ఎందువల్ల అనివార్యమో, పురుషునికి ఎందుకు కాదో—ఈ విషయం నాకు బాగా అర్థంకాలేదు.

జ : పురుషుడు ఆకాశంవలెనే తనపై దేన్నీ ధరించలేడు. అర్థవతి స్త్రీయే. కాబట్టి అర్థ-ధారణకోసం ఆమె మరోవ్యక్తిపట్ల అపేక్షాశీలి ఔతుంది. వ్యక్తిఆధారం ఆమెకు అవసరం అని నేను చెప్పింది ఈ అర్థంలోనే. ఆకాశానికి ఆ అవస్థలేదు. ఆకాశమనేది అసలు లేనేలేదని చెప్పవచ్చు. అంటే అది ఒక పరిధిలో లేదు. ఒక ధరిత్రినుంచి మరొక ధరిత్రివరకు, ఇక్కడినుంచి అక్కడివరకు వ్యాపించివుంది. ఏమీ లేకపోవటమే అది ఉన్నట్టు. దాని యిష్టం అంతే, స్వభావం అంతే. అది అవ్యక్తం; వ్యక్తమును అపేక్షించదు. ఇంతకూ ఈ నిరుపయోగమైన సూక్ష్మవిషయాలెందుకు నీకు? ప్రయోజనకరములైన మాటలేమన్నా కానీ.

ప్ర : ఇవికూడా ప్రయోజనకరమైన విషయాలనే నా ఉద్దేశం. పురుషుడేమో తాను లేనట్టుగా వుండటం, అంటే అతనికి మరోవ్యక్తి—అపేక్ష లేకపోవటం—అదేమిటో నాకింకా అర్థంకాలేదు.

జ : స్త్రీ తన ఫలమును పురుషునిలోనుంచి పొందుతుంది. పురుషుడు స్త్రీలో కేవలం తన మరణాన్ని వెతుక్కుంటాడు. 'మరణ' శబ్దం విని భయపడనవసరంలేదు. జంతుజగత్తులో ఈ మరణము బహుధా సంపన్నమౌతూనేఉన్నది. మానవుడు అందులోనుంచే తిరిగి క్రొత్తజీవనంతో ఉత్పన్నమౌతున్నాడు. మిధునాచారమందు అతనికేమీ ఫలాకాంక్షలేదు. ఫలములో అతనికేమీ సార్థక్యతలేదు. తన ఉనికే తనకొక ఇక్కట్టు. కాగా తాను లేకుండాపోవటమే అతని ధర్మం. ఈ ధర్మం అమాంతంగా వచ్చి అతని ఉనికిని ఆక్రమించేస్తుంది. వ్యక్తంలో మొదట అవ్యక్తం తిరోభూతం కావటం, తరువాత మళ్ళీ ఫలితంలోనుంచి అదే ప్రాదుర్భవించటం— ఈ నిసర్గచేష్ట సృష్టిపరంపరకు కారణమౌతున్నది.

ప్ర : తన్నుతాను లేకుండా చేసుకోటము పురుషప్రకృతిలోని ఒక అనివార్యమైన అంగంగా మీరు భావిస్తున్నారు. కాబట్టి తన్ను లేకుండా చేసుకొనే వ్యక్తసాధనకూడా పురుషునికి అనివార్యంగా కావాలని మీరు ఒప్పుకోవాలి. మరి పురుషునికి వ్యక్తాధారం అవసరంలేదంటారేం?

జ : సరే, ఒప్పుకున్నాను. అయితే....?

ప్ర : అది! — ఇప్పుడుచెప్పండి : 'వ్యక్తాధారం స్త్రీకి ఎంత అవసరమో, పురుషునికి అంతఅవసరంలే'దని ఇప్పుడు ఎలా చెప్పగలరు?

జ : స్త్రీకి ఫలం—అంటే జీవితం—కావాలి. పురుషునికి మరణం కావాలి. అతని మరణానికి ఉపలక్ష్యమౌతున్న వ్యక్తి ఆధారాన్ని ప్రయోజనకారి అనిగాని, సహాయకారి అనిగాని నీవు తర్కరీత్యా సమర్థిస్తే సమర్థించు. కాని అది ఆ మరణించేవానిపట్ల నిర్దయాత్మకప్రవర్తనే అవుతుంది.

అసలు నిజానికి పురుషుడు స్త్రీలో తన మరణాన్ని వెతుక్కుంటున్నాడేకాని పొందటంలేదు. ఎందువల్లనంటే—అవ్యక్తం వ్యక్తంలో వికసిస్తుందేగాని వినష్టం కాజాలదు. ఈవిధంగా పురుషుడు మాటిమాటికీ స్త్రీలో మరణిస్తూకూడా బ్రతికే వుంటున్నానని అనిపిస్తూవుండేసరికి....తన పూర్ణమరణం అక్కడ కాదని తెలుసుకుంటాడు. సర్వత్రా నిండివున్న ఆ వ్యక్తావ్యక్తముల అధిష్ఠాతయందే వున్నదది. ఆ సమష్టిగతభోగమునే బ్రహ్మచర్యం అని అంటాం. పురుషుని చరమపరిణతి అందులోనే ఉన్నది.

ప్ర : అంటే పురుషుడు తన చరమపరిణతిని స్త్రీయందు పొందజాలడనీ, స్త్రీకిమాత్రం పురుషునియందే తన పరమసిద్ధి లభిస్తుందనీ—అదేనా మీ అభిప్రాయం ?

జ : 'పరమ' అనే శబ్దం విడిచిపెట్టు. పురుషునితోడి సంయోగంవల్ల స్త్రీ సంతతిని పొందుతుంది. పురుషుడేమి పొందుతున్నాడు ? ఈ భేదాన్ని.... 'పరమ' అనే శబ్దాన్ని మధ్యలో తీసుకురాకుండా....గుర్తించటం అంత అసంభవమా ?—

ప్ర : స్త్రీకిగాని, పురుషునికిగాని ఇరువురికీ పరమసిద్ధి లక్ష్యమేకదా ! అందుకనే 'పరమ' అనే పదం వాడవలసిన అవసరం కనిపిస్తున్నది. నేను తెలుసుకోదలచిన విషయం.ఏమిటంటే—స్త్రీకి అది పురుషునిలోమాత్రమే లభిస్తుందా ? అంతకుమించి మరొకసాధన ఏదీ ఆమెకు అవసరంలేదా? పురుషునికి....పరమాత్మోన్ముఖమైన అతని మార్గాన్ని ప్రశస్తంచేయజాలిన అంశం ఏమీ స్త్రీలో ఉండవేఉండదా ?

జ : ఇద్దరిముఖాలూ ఎదురెదురుగావుంటే ఎవరూ ముందుకుపోలేరు. ఢీకొట్టుకుంటారు. అంతే. దారి క్లిష్టంగా వున్నప్పుడు ఒకరి ముఖం సూటిగా ఆకాశంవైపు ఉండాలి; రెండవవారి ముఖంకూడా అటువైపే ఉండాలంటే ముందున్నవారి వీపువైపు వుండాలి. ఆయిద్దరిలోనూ ముందుండవలసినది పురుషుడే. అది అతని ముఖాన రాసిపెట్టేవుంది. అది అతనికిగల ఒకగొప్ప అధికారం అని నేనేమీ చెప్పటంలేదు. అనేక విపత్తులతోకూడిన బాధ్యత అంటున్నాను. దారి అంత క్లిష్టంగా లేకపోతే ఇద్దరూ ఒకరి సరసన ఒకరు ముందు చూచుకుంటూ సాగిపోవచ్చు. కాని అది సంసారయాత్ర. తీర్థ యాత్ర అంతకన్నా కొంచెం దుర్గమంగానే ఉంటుంది. దానికొక చక్కని రాజ మార్గమేమీ ఏర్పరుపబడియుండలేదు. అటువంటిమార్గాన్ని పురస్కరించుకునే ప్రసంగం.

ప్ర : అంటే—స్త్రీ ఒక పురుషవ్యక్తి మాధ్యమం (medium) ద్వారా అవ్యక్తమును పొందగలుగుతుంది. పురుషుడుమాత్రం సూటిగా అవ్యక్తంవైపు సాగిపోగలడు అనేగా మీ ఉద్దేశం ? ఏమిటి ఈ విభేదంలో రహస్యం ?

జ : హృదయంలోని రాగం ఒక ప్రత్యక్షమైన సుస్పష్టమైన సంబం ధాన్ని కోరుతుంది. ఈ ఉపాసన సగుణపద్ధతిని అవలంబిస్తుంది. అయితే నిర్గుణోపాసనకూడా ఉన్నది; అది దీనికంటె చాల బౌద్ధికమైన వ్యవహారం; అది ప్రముఖంగా మానవుని మేధస్సును ఆశ్రయించి వుంటుంది.

ప్ర : బుద్ధిగనక స్వైరిణి అయిపోయినట్టయితే నాస్తికతవైపు, భోగాచారంవైపు ప్రవృత్తమౌతుందని మీ రిదివరకే చెప్పారు. మరి అటు వంటప్పుడు పురుషుడు బౌద్ధికుడై ఎలా సిద్ధి పొందగలుగుతాడు ?

జ : పురుషునిమార్గంలో ఆ అనిష్టం ఎప్పుడూ ఉండనే ఉంది. ఈశ్వరరూపమైన సత్యమును పొందు ప్రయత్నంలో మానవజాతివిజ్ఞానం అణుబాంబుల్ని సృష్టించేంతవరకూ వచ్చింది. ఇది ఆ యనిష్టమునే సూచిస్తు న్నది. అసలు మూలతః సూక్ష్మాతిసూక్ష్మ పరిమాణంలోనైనాసరే, పొరపా టనేది జరిగిందీ అంటే, భగవంతునిపేరుతో సైతానే వచ్చి మన నెత్తిన తిష్ఠ

వేస్తాడు. హృదయంలోని సూటియైన సరాగ సగుణోపాసనలోమాత్రం అటు వంటి అనిష్టంలేదు. భక్తి నిరాపదమైనది. కాని జ్ఞానం—దాని కథ, తీరు ఇతిహాసంలో కనిపిస్తూనేఉంది. అందువల్లనే చెప్పాను: .పురుషునిముఖాన వ్రాసిపెట్టియున్నది అతని గొప్పదనం అవిగాక, ఒక పెద్ద బాధ్యత అనే మనం భావించాలి— అని.

ప్ర : అంటే—పురుషునికిమల్లే స్త్రీకి బౌద్ధికవ్యాపారంలో పడిపోయే ప్రమాదం అంతగా వుండదనీ, అతనిమార్గంకన్నా ఆమెమార్గమే సుగమ మైనదనీ అంటారు—అంతేనా?

జ : ఔను. చాలభాగం అంతే. పతి సులభుడు; గురువు దుర్లభుడు. భర్తవున్నాడంటే సతీత్వమార్గం సుగమమే. కాని బుద్ధికి సంప్రాప్తించిన తర్కశక్తి ఒకపట్టాన ఒకర్ని గురువునుగా అంగీకరింపనిస్తుందా? అందు వల్ల ఆ మార్గం కొంచెం దుర్లభమైనదనే చెప్పాలి.

ప్ర : స్త్రీకన్నా పురుషుడు ఎక్కువగా బౌద్ధికుడెందుకు కావాలి? ఈ అంశంపై కొంచెం వెలుగు ప్రసరింపజేస్తారా?

జ : పురుషుడు పురుషుడే. అతడు స్త్రీ కాదు. అదే కారణం. అంతకుమించి ఇంకా ఏంచెప్పగలం? సృష్టికి మూలంలోనే ఈ భేదం ఉంది. అద్వైతం ద్వైతంగా ఎప్పుడు వ్యక్తం అయిందో ఈ విభక్తి కారణంకూడా అప్పుడే అక్కడినుంచే .జరిగింది. "ఎందుకు? ఏం కారణం?" అనే మన ప్రశ్నలు అక్కడికి ఎలా చేరుకుంటాయి? ఒకటి అనేకం కావలసిన ఆవశ్యకతలో, అక్కడ మూలంలోనే అది గర్భితమై వుంది. ఎవరైనా వచ్చి "స్త్రీయే ఎందుకు గర్భం ధరించాలి?" అని అడిగితే నేను ఏమి జవాబు చెప్పాలి?.... "ఆమె.స్త్రీ, అందుచేతనే" అని తప్ప?

ప్ర : స్త్రీ పురుషుల మూలప్రకృతిలో ఇలాగే ఇంకా భేదాలు ఉన్నట్టు మీ రభిప్రాయపడుతున్నారనే నేననభిప్రాయపడుతున్నాను. అవన్నీకూడా విశ్లేషించి చెపుతారా?

జ : విశ్లేషణచెయ్యవలసిన అవసరంలేదు. భేదం ప్రాణగతమైనది కాదు; కర్మగతమైనదే. కర్మ అంటే ఇంద్రియవ్యాపారం. మనస్సునుకూడా

ఆరవ ఇంద్రియంగా లెక్కవేసుకోవచ్చు. ఆ భేదం అయినా ఆధ్యాత్మిక దృష్ట్యా అంత మౌలికమైనదిగా అంగీకరింపలేము. అనగా ప్రాణం భూమికగా తీసుకుంటే — అర్థాత్తూ పరమేశ్వరుని దృష్టిలో స్త్రీపురుషులిద్దరూ అధిన్నులే, సమానులే. స్థూలవ్యాపారమందు ప్రత్యక్షమౌతున్న ఈభేదము ననుసరించే మనోభావాల్లోనూ తదనుకూలమైన భేదాన్ని ఊహించుకోవచ్చు. ఇంతకుమించి ఇంకా విస్తారంలోకి పోయి తెలుసుకోవాలని ప్రయత్నించటం వల్ల సమస్య ఇంకా క్లిష్టతరమైపోతుందేగాని చిక్కు విడదు.

# పురుషుని స్వేచ్ఛ, స్త్రీ ఓర్పు

ప్ర : ప్రకృతిపరంగా ప్రేమయాతనలో అధికభాగం స్త్రీపాలిటే పడుతున్నదికదూ ?

జ : ప్రకృతి వెళ్ళి జవాబేమిచెబుతావు అని పురుషుని అడగదు. తానొక తల్లి అయేందుకు స్త్రీ వెనుకనే ఉండిపోతుంది. ఇది ప్రకృతిమాత యొక్క పక్షపాతం అని అంటే అను; కాని ఒక తథ్యరూపంలో ఈ అంతరం అనుల్లంఘనీయం. ఎట్టి పరిస్థితిలోనూ స్త్రీకిబదులు పురుషునికే మాతృత్వం లభించటం అసంభవం. ఈ అంతరాన్ని చూచి రోషం తెచ్చుకుంటే లాభంలేదు. సంతోషంగా, అందులోనే కృతార్థత వున్నదనుకుంటూ స్వీకరించాలి; సార్థకం చేసుకోవాలి. ఔను, నేను అంగీకరిస్తాను : దుఃఖం బైటినుంచి వచ్చేది కాదు; లోపలినుంచే వస్తుంది. అంటే — దాన్ని ఇతర్ల మీదికి తోసిపారేయలేము; అనుభవించి తీరవలసిందే. దాన్ని ఇచ్ఛాపూర్వకంగా అనుభవించేవారికి ఇతర్ల మీదికి తోసిపారేయవలసిన అవసరం వుండదు. దుఃఖాన్ని కలిగిస్తున్నట్టుగా కనిపించే వ్యక్తి నిజంగా తానే స్వయంగా దుఃఖాన్ని పొందుతున్నాడన్నమాట. దాన్ని తాను ఇచ్ఛాపూర్వకంగా స్వీకరించలేకపోతున్నాడు; బలవంతాన మోస్తున్నాడు. అందువల్లనే అతడు తన దుఃఖభారాన్ని ఇతర్లపై దించుకుని తాను తేలికపడాలని వాంఛిస్తున్నాడు. ఇతర్లకు దుఃఖం కలిగిస్తున్నప్పుడు అక్కడ మధ్యమం (medium) ఆత్మీ

యత. ఆత్మీయులు కానివాళ్ళకు మనం దుఃఖం కలిగించలేము. కనుక పురుషునిద్వారా లభిస్తున్న దుఃఖాన్ని స్త్రీ ఒక విచారకరవిషయంగా భావించకూడదు. పైగా తలచుకుంటే ఆమె అతనియెడల కృతజ్ఞురాలుకూడ కాగలుగుతుంది. కుర్రవాడు తల్లినే పీడిస్తాడు; లేకపోతే తన బాధ తొలగించుకునేందుకు మరెక్కడికిపోతాడు? ఒక స్త్రీని ప్రేయసిగా స్వీకరించి, తన సర్వస్వాన్నీ ఆమె ముందు బలియిచ్చుకోక గత్యంతరంలేని పురుషుడు తన దుఃఖాన్ని ఆమెపైగాక ఇంకెక్కడ దింపుకుంటాడు పోయి? ఈసంగతి స్త్రీ గుర్తించాలి. ఒక పురుషునికి ప్రేయసిగాకుండా స్త్రీ ఉండజాలదు. ప్రేయసి ఔతున్నది; కనుకనే దాసి కాగలుగుతున్నది. అందుచేత పురుషునిద్వారా లభిస్తున్న దుఃఖం ఆమెకొక చింతాకరమైన విషయం కానప్పుడు—ఆమెలో తనకుతానై ఉత్పన్నంచేసుకొనే దుఃఖమే గంభీర చింతావిషయుకమౌతుంది. ఆమెను బాధపెట్టే అసలుదుఃఖం అదే. దాని మూలరూపం వైయక్తికం, ఆత్మికం, మానసికం; ఉపచారభావంతోమాత్రం దాన్ని సామాజికం అంటాం.

ప్ర : కాని ఇటువంటి దుఃఖం పురుషునిపాలపడేది తక్కువేగా! అందుకు కారణం వారి వారి ప్రాకృతికవిభేదంలోనే వున్నదంటారా?

జ : కాదు, దుఃఖం బాహ్యప్రకృతినుంచి సంక్రమించేది కాదు; అంతఃప్రకృతినుంచే వస్తుంది. స్త్రీ పురుషుల అంతఃప్రకృతియందుమాత్రం జాతిగతభేదం లేదు. కాబట్టి దుఃఖాధికారం స్త్రీ పురుషులలో ఒకరికి ఎక్కువని, మరొకరికి తక్కువని అనుకోవలసిన అవసరంలేదు.

ప్ర : కాని నాకుమాత్రం స్త్రీపురుషుల . అంతఃప్రకృతియందు స్పష్టంగా భేదం కనిపిస్తున్నది. స్త్రీలో అతిసహజంగా ఉంటున్న విశ్వాసబుద్ధిని పురుషుడు స్వలాభానికి వినియోగించుకుంటూనే ఉన్నాడు. ఇందుకు ఉదాహరణలు నిత్యజీవితంలో కనిపిస్తూనే ఉన్నాయి.

జ : స్త్రీవల్ల పురుషుడు లాభం పొందుతున్నాడంటే—స్త్రీకి పురుషునిపై ఫిర్యాదు చేయవలసిన అవసరం ఏముంది? లాభం అంటే దుర్లాభం అన్న అర్థంలో నీవు వాడివుంటావు. అయితే స్త్రీ తన విశ్వాసప్రకృతిని ఒక అవగుణంగా భావించగోరుతున్నదా? పురుషునిలో విశ్వాసగుణం

తక్కువ అనుకుంటాం. అందువల్ల అతడు మోసంచేస్తున్నాడు. స్త్రీలో అది ఎక్కువ; అందుచేత మోసపోతున్నది. అందుకని, స్త్రీకూడా పురుషునివలెనే విశ్వాసహీనురాలు అయితే ఆమెదుఃఖం తగ్గుతుందంటారా ? నా ఉద్దేశంలో మాత్రం ఆపద్ధతివల్ల ఆమెదుఃఖం తగ్గదు; మరేవిధమైన ప్రయోజనమూ కలగదు. స్త్రీపురుషులమధ్య మనస్పర్ధలుమాత్రం పెంపొందుతాయి.

ప్ర : నేను స్త్రీపురుషులమధ్య పోటీని సమర్థిస్తున్నట్టు భావించకండి. స్త్రీపురుషప్రకృతులలో భేదం వున్నట్టు మీరు అంగీకరిస్తున్నారా లేదా ? అదీ నేను అడగదలచుకున్న విషయం. అంగీకరిస్తున్నట్టయితే ఆ భేదం ఎలాంటిదో బాగా విశ్లేషణచేసి చెబుతారా ?

జ : స్త్రీపురుషుల శారీరకమైన భేదాన్ని అనుసరించి తదనురూపమైన భేదం వారి స్వభావాల్లోకూడా ఉండవచ్చు. కాని వ్యక్తిత్వభేదంగా పరిగణించ దగినంత లోతైన ప్రకృతిభేదం వారిలో వున్నట్టు నేనంగీకరించలేను. ఇంకా చెపితే ఇలాకూడా చెప్పవచ్చు : పురుషుడు బుద్ధి అయితే, స్త్రీ హృదయం; అతనికి యుక్తి ప్రధానం, ఈమెకు రాగం ప్రధానం; ఒకరు వృక్షము, రెండవవారు లత; అతడు సూర్యుడు, ఈమె చంద్రుడు; అతడు గతి, ఈమె స్థితి; అతనిని ఆకాశం అను, ఈమెను ధరిత్రి అను. ఈ ఉపమానాలలో తథ్యం చాలవరకు ద్యోతకమౌతుంది. కాని సత్యమంతా వీనిలోనే బంధింప బడివున్నట్టు తలచకూడదు. స్త్రీత్వము,పుంస్త్వమూసర్వథా శుద్ధ యథార్థ భావంలో ఎక్కడా లభించవు.... అనే ప్రాణశాస్త్రం చెబుతున్నది. అంటే— అందరు వ్యక్తులూ మూలతః ఈ రెండురకాల తత్వాల న్యూనాధికమాత్రల మిశ్రణములే. లింగభేదము కనిపిస్తూనేవుంది. కాని ఈ భేదాన్ని ఇంకా లోతుకు తీసుకుపోవలసిన అవసరమేం లేదు. ఈ భేదాన్ని పురస్కరించు కుని ప్రధానమనీ, గౌణమనీ; లేదా ఉచ్చమనీ, నీచమనీ—ఇలాగ శ్రేణీ విభాగం చేసేందుకు కొంత సామగ్రి దొరుకుతుందని నే ననుకోను.

ప్ర : అయితే మరి చాలమంది పురుషుల ఆచరణ ఒకవిధంగాను, స్త్రీలప్రవర్తన పూర్తిగా అందుకు భిన్నమైనపద్ధతిలోనూ ఎందుకు ఉంటు న్నాయి ? ఉదాహరణకు—అనేక ప్రేమకథల్లో ప్రధానంగా స్త్రీ అమాంతం

పురుషుని విశ్వసించెయ్యటం, అతడు పన్నిన వలలో చిక్కుకొనటం, పురుషుడామెను మోసంచెయ్యటం, స్త్రీ యాతనలపాలుకావటం- ఈ విషయాలే కనిపిస్తున్నాయేం?

జ : అందుకు చాలవరకు కారణం ఇది కావచ్చు: పురుషుని వ్యథా కథ స్త్రీ మనస్సులోకి అంతగా చొచ్చుకుపోలేదనుకుంటాను. 'పురుషునిలో వేదన చాల తక్కువ' అనుకోటం సరికాదు. అయితే పురుషునికి ఫిర్యాదు చేసుకొనే అవకాశాలు తక్కువ. ఎందువల్లనంటే తానొక దుష్టుడనని అనుకుంటూ కాలం వెళ్ళబుచ్చవలసిన అవసరం అతనికి లేదు. అటువంటి అవసరం స్త్రీది. ఆ పద్ధతి తనదిగా స్వీకరించుకున్నదామె. ఎంతైనా పురుషుడు మాత్రం స్త్రీయొక్క గర్భధారణాదియాతనలను అర్థంచేసుకోలేడు; ఆ మాట నిజమే. కాని స్త్రీపురుషులమధ్యవున్న ఈ అంతరంలో వారి యాతనల ఎక్కువ తక్కువలు నాకేమీ కనిపించటంలేదు. వ్యవస్థఅంతా మాతృకంగానే సాగుతూవుండే జాతులు ఇప్పటికీ ఉండవచ్చు. అక్కడ పురుషుడు తన దుఃఖాలకు కుందుతూవుంటే ఆశ్చర్యపడనక్కర్లేదు. అంటే దుఃఖక్లేశములకు మానసికకారణాలతోనే ఎక్కువసంబంధం వుంటుంది. కాని, ప్రకృతిభేదంతో కాదు—అనే నా అభిప్రాయం.

ప్ర : స్త్రీ తాను యాతనలపాలవుతున్నట్టు భావించుకుంటున్నది, కాని నిజానికి ఆమెకేమీ యాతనలులేవు—అనేమాట, పురుషులు మాపట్లనిత్యం జరుపుతూవుండే అత్యాచారాలవల్ల పొందుతూవున్న అనుభవానికి వ్యతిరేకంగా ఉంది. స్త్రీ యాతనల పాలుఅవుతున్నది. ఈ మాట తథ్యం. ఇందుకు కారణం ఏమిటోచెప్పండి. యాతన ప్రసాదించటమే పురుషునిప్రకృతి. దాన్నిఅనుభవించటం స్త్రీ ప్రకృతి — అని మీరు ఒప్పుకోరా?

జ : యాతన తనవద్ద ఉన్నప్పుడే ఎవరైనా ఇంకొకరికి ప్రసాదించగలుగుతారు. అంటే—యాతనను కలుగజేసేవాడుస్వయంగా దాన్నికలిగివున్నాడన్నమాట. ఇది నిరపవాదమైన సత్యం; అంగీకరించక తప్పదు. కనుక స్త్రీలు తాము మోస్తున్న యాతనాభారం తమదే అనుకుంటే, అలాగే పురుషులుకూడా తమపైనున్న యాతనాభారం తమదే అనుకుంటే, పేచీ లేకుండా

పోతుంది. ఇటువంటి దృక్పథం తర్కవిజ్ఞానాలద్వారా లభించేదికాదు. కేవలం శ్రద్ధవల్ల', ఆస్తికతవల్ల ప్రాప్తిస్తుంది. ఈ జగమంతా జగదీశ్వరుని అభివ్యక్తమే. జగదీశ్వరుడు దయామయుడు; ప్రేమమయుడు. ఆతనిదైన ఈ ప్రపంచంలో అంతా దయ, మాయ. ఏ అంశంలోనైనా ఇందుకు వ్యతిరేకత వస్తే—అనగా ఏ కొంచెమైనా ఏతత్భిన్నమైన అనుభవానికి లోనైతే— ఆ యనుభవదోషాన్ని నాలోనుంచి బైటకి ఎట్టిపరిస్థితిలోనూ విసరివేయలేను. ఎందువల్లనంటే—అలాచేయటం బయట జగదీశ్వరునిపై దోషం వెయ్యటమే ఔతుంది! ఈవిధమైన ఆస్తికదృష్టి తర్కతంతువులలో వచ్చి చిక్కుకునేది కాదు. తర్కాతీతమైన రూపంలో వున్నాసరే, దానియందే సంపూర్ణమైన నిష్ఠకలిగి యుండవలసినదిగా నాకు నేను, (అందుచేత అందరికిన్నీ) సలహా యివ్వగోరుతున్నాను.

స్త్రీ తన దుఃఖాన్ని పురుషుని నెత్తిమీదికి త్రోసివేసి, తాను నివృత్తి పొందగలననుకోటం వట్టి భ్రమ. అలా ఎన్నడూ జరగలేదు; ఇకముందు జరగబోదు. సుఖాన్ని పొందాలనుకుంటే సుఖాన్ని ఇవ్వటంద్వారానే అందుకు ప్రయత్నం ప్రారంభించాలి; అంతకన్నా వేరే ఉపాయం ఏమీ లేదు. ఈ నియమపాలనకు స్త్రీపురుషభేదం లేదు. పురుషుడు వ్రాసిన న్యాయశాస్త్రాల్లో స్త్రీకి ద్రోహం విస్తారంగా జరిగింది. స్త్రీఅంటే అవగుణాలపుట్ట అనికూడా వర్ణింపబడ్డది. కాని అందువల్ల పురుషుడు తన మనసులోని కోపతాపాల్ని వెళ్ళగక్కుకున్నాడు; తన మనస్సును బైట పెట్టుకున్నాడు. అయితే ఇటువంటిపనివల్ల స్త్రీయొక్క అంతస్తుగాని, ప్రతిష్ఠగాని తగ్గదు. అలాగ స్త్రీజాతిపట్ల నిందావాక్యాలను పలికేవాడి కోపతాపాల్నీ, అతని మనఃప్రవృత్తినీ చూచి స్వస్థమానసురాలైన స్త్రీ తానుకూడా అటువంటిదోషమే చెయ్యదు. అదేవిధంగా పురుషునిపై దోషారోపణచేసేది ఎక్కువగా స్త్రీయొక్క కోపతాపాలే—అనిపిస్తూవుంటుంది నాకు. అలాకాకుండా ఆమె ఎక్కువ స్వస్థచిత్తయై ఉంటుందని నే నాశించకూడదంటావా?

ప్ర: నా ఉద్దేశం పురుషునిలో దోషాలున్నాయని ఆరోపించటం కాదు; పురుషులపై స్త్రీజాతికి గల కోపతాపాల్ని వెలిబుచ్చటమూకాదు. మామూలుగా కనిపిస్తూవుండే స్త్రీపురుషప్రేమసంబంధములైన సంఘటనలు

ఆధారంగా నేననుకుంటున్నాను.... స్త్రీపురుషప్రకృతులు కొంచెంవిభిన్నతత్త్వములు కలవి....అని. కాబట్టి వాటి ప్రవృత్తులను బాగా విశ్లేషించి చెబుతారని ఆశిస్తాను.

జ: ఔను; భేదమైతే వున్నది. దాన్ని సరిగా అర్థంచేసుకోవాలి. పురుషుడు స్త్రీయందు మోహితుడౌతాడు. ఆ మోహంలో అతడు తన్ను తాను నిగ్రహించుకోలేడు. పురుషుని జీవనసార్థకత స్త్రీలో కానేకాదు. పురుషుడు సహజంగా వేగోన్ముఖుడు. ఎక్కడ ఇక్కట్లు ఉంటాయో, ఎక్కడ ఏదో రహస్యం వున్నట్లు కనిపిస్తుందో అటువైపే సాగిపోవటానికి అతడు తహతహలాడుతూవుంటాడు. అతని యీ స్వభావం స్త్రీకి అగోచరం. స్త్రీమాత్రం ఈమార్గంలో మాతృత్వాన్ని పొంది సఫలమౌతుంది. అందుకోసం ఆమె పురుషునితోడి సంయోగాన్ని అపేక్షిస్తుంది. ఈవిధంగా పురుషునిలో, పురుషునిద్వారా తన జీవనసార్థకతను చూచుకొనక తప్పదామెకు. పుత్రుని పొందేందుకు ఆమెకు పతి కావాలి. పుత్రుడు లేకపోతే ఆమె గొడ్రాలు అనిపించుకుంటుంది. పురుషునికి పుత్రుడుకావలసింది తనకు కాదు; తన సంపత్తికి, తన వంశానికి కావాలి. ఆ అర్థంలో, ఆ రూపంలో అతడు పుత్రునిమీద ఆధారపడి వుండడు. స్త్రీపురుషప్రకృతులలోగల ఈ అంతరాన్ని అర్థంచేసుకుని గ్రహించటంలో పొరపాటు వున్నంతకాలమూ ఇబ్బందులు పెరుగుతూనే వుంటాయి. పురుషునివల్ల పుత్రుని పొందటం జీవనసార్థకతయని భావించక, అదొక అవమానంగా స్త్రీ భావించవచ్చు. నిజానికి పుత్రుడామెను పతినుండి దూరంచేస్తాడు. ఇద్దరిమధ్య పుత్రుడు వ్యవధానాన్ని కల్పిస్తాడు. పుత్రుని పొంది స్త్రీ కొంతవరకు భర్తను కోలుపోతున్నదన్నమాటే. తానిప్పుడు తల్లి. ఇదివరకంత ఎక్కువగా ప్రియతమురాలు కాదు. పురుషునిపై వుండే అనురక్తివల్ల ఈమార్పు తనకొక యాతనగా సంక్రమించినట్లు ఆమె వ్యథపడవచ్చు, కాని అలా వ్యథపడటం తనపట్ల తాను అన్యాయంగా ప్రవర్తించటమే ఔతుంది. యశోధర గౌతమబుద్ధునిపట్ల—అతడు తనకెంతో అన్యాయంచేశాడన్న కోపభావంతోవున్నా వుండవచ్చు; లేదా రాహులుని చంకనెత్తుకొని భర్త యెడల కృతజ్ఞురాలుగావున్నా వుండవచ్చు. ఈ క్షణంలోని ప్రేమ—మరు

క్షణంలో అతడులేడుగదాఅని—నిందనీయమైపోవలసిందేనా? ప్రేమ క్షణాన్ని కూడా శాశ్వతం చేయగలుగుతుంది. పతి—పత్నిసంబంధంలో పరస్పరాధికారాల ప్రసక్తి తీసుకువచ్చి మనమా దివ్యప్రేమను అప్రతిష్ఠపాలుచేస్తున్నాం. స్త్రీలు బహుతరచుగా ఈ పొరపాటే చేస్తుంటారు. ప్రేమ నిర్బంధాన్ని సహించలేదు. అధికారం చలాయింపకూడాలనుకునేచోట ప్రేమకు తావు లేదనే చెప్పవచ్చు. వివాహసంస్థ అధికారమూలకమని భావింపబడుతున్నది. ఆ పరిగణనతోనే సాంప్రతికవ్యవస్థ సాగుతూఉన్నది. అందువల్లనే వివాహము, ప్రేమ అనబడేద్వంద్వంలోనుంచి రకరకాలసమస్యలుఉత్పన్నమౌతున్నవి. స్వేచ్ఛగలది ప్రేమ; వివాహం ఒక సంస్కారం; ఒక మర్యాద. ఎప్పుడో ఎదో ఒక రసాయనికప్రమాట్ప వచ్చేస్తుంది, దానితో ఈ సమస్యల పుట్టుక ఆగిపోతుంది—అనుకోటం భ్రమ. విముక్తిని మర్యాదలలో నుంచే సాధించవలసివుంటుందని నా విశ్వాసం. కాని అది ఒక చాల పెద్ద కళ. మన సమస్త జీవనకళ అదే. ఈ సాధనలో చిక్కులు, ఇబ్బందులు ఎన్నెన్నో వస్తాయి. వాటివల్ల సాధనమార్గం మరింత మహత్వపూర్ణం ఔతూవుంటుంది.

ప్ర : ఇంకేం మరి! పురుషునియొక్క ఈరకమైన ప్రకృతివల్లనే స్త్రీకి యాతన సంభవిస్తున్నదన్నమాటేగా! పురుషుడొక గాలివంటివాడు; ప్రేమక్షణాల్ని అమూల్యములుగా భావించి ఏమనకుండా ఊరుకోవాలి—అని చెప్పటం తేలికే. కాని స్త్రీ తన జీవనసార్థకత ప్రేమలోనే వున్నట్టు మనఃపూర్వకంగా విశ్వసిస్తున్నది. అటువంటప్పుడు ఆ ప్రేమికుడు అకస్మాత్తుగా చేయిజారిపోయేసరికి ఆమెకు తప్పనిసరిగా దుఃఖం కలిగితీరుతుంది. ఎందువల్లనంటే—పురుషుడులాగ స్త్రీ తన మనస్సును ఒక్కసారిగా మరోవైపుకు మరలించుకోలేదు. అలా మరలించుకోవటం ఆమెకు చాల కష్టం. నేను స్త్రీ దృష్ట్యా ఆలోచించి మాటాడుతున్నాను: అటువంటి దుఃఖం పురుషునికి మాత్రం కలగటంలేదు. ఇది మీరు ఒప్పుకుంటారా, ఒప్పుకోరా?

జ : ఒప్పుకోవచ్చు. స్త్రీయొక్క సరస్వం ప్రేమే. కాని ఆ ప్రేమే పురుషునికి అంత సంగ్రహణీయం కాదు. పురుషునియెడల స్త్రీలో

విరహం నిలిచేపోవచ్చు. ఎందువల్లనంటే— స్త్రీలో వాస్తవమైన ప్రేమ ప్రాప్తితోనే ప్రారంభమౌతుంది. పురుషుని ప్రేమ ప్రాప్తితో సమాప్త మౌతుంది. పురుషుడు తనకోసమని స్త్రీని ప్రాప్తింపచేసుకోవటం జరగదు. పైగా స్త్రీపక్షంలోకి తనను తాను ప్రాప్తం కానిచ్చుకోవాలి. ఈ రూపంలో లభిస్తున్న విరహవేదన స్త్రీకి భగవత్ప్రసాదమేనని ఎందుకననకూడదు ? స్త్రీ పురుషుని తనసాన్నిధ్యంలోనే అరికట్టి వుంచుకోవాలని వాంఛిస్తుంది. ముఖ్యంగా అందువల్లనే ఆమెకు యాతన సంభవిస్తూవుంటుంది. స్త్రీ పురుషునిద్వారా సంతతిని పొందగానే ఆమె అతనిపై తన అధికారాన్ని వొదులుకోవలసిందే. ఆమె అలాచేయటం ఆమె వశంలో వున్న పనే అని నేను ఆశించవచ్చుననుకుంటాను. ఈ వశంలో వున్న పనే చెయ్యలేక ఆమె వివశురాలయ్యేట్టయితే—అది ఆమె దుఃఖానికే కారణంఔతుంది.

ప్ర : ఇదిమాత్రం స్త్రీనుంచి ఒక మహాప్రబలమైన - కఠోరమైన కోరిక ! పురుషునికోసమని తన సర్వస్వాన్నీ త్యాగంచేస్తున్న స్త్రీ పురుషుని దగ్గరనుంచి కొంత ఆశించటం స్వాభావికమే. పురుషునిచేతిలో అవజ్ఞపొందిన తరువాత ఆమె హృదయం వ్రయ్యలుకాకుండా వుంటుందా ? కాబట్టి తన ప్రకృతియందు పురుషుడు కొంచెం ఎక్కువగా సంయమాన్ని సాధించేందుకు ప్రయత్నించటం మంచిదికదా ?

జ : సంయమాన్ని సాధించేందుకు ప్రయత్నించినప్పటికీ మగవాని ముఖం సర్వదా స్త్రీ తనవైపుకే మరలించుకోగలటం అసంభవమే. ఒకవేళ ఎప్పుడైనా అది సంభవమే అయేట్టయితే అప్పుడిక ఆడుదాని నిరాశకు హద్దే వుండదు. స్త్రైణపురుషుని స్త్రీ ఇచ్ఛగించదు. స్త్రీయెడల పురుషుని హృదయంలో అవజ్ఞ వుండవలసిన అవసరంలేదు. కాని తన పురుషుని మరోవైపుకెక్కడికో లాక్కుపోతున్న ఆకర్షణ ఏదో వున్నది అనే విషయాన్ని గమనించకుండా స్త్రీ వుండజాలదు. ఆ 'ఏదో' అనబడేది ఆమె పట్టుకు చిక్కదు. ఆ దుర్జయమైన ఆకర్షణను పురుషుడైనా పూర్తిగా తెలుసుకోలేడు. అయినాకూడా దానిచేత లాగికొనిపోబడుతూవుంటాడు.

అదే తనయెడల ఒక పెద్ద నేరం అని స్త్రీ పురుషునిపై ఆరోపిస్తే ఇక తీర్పు ఏముంటుంది? ఎక్కడినుంచో వస్తూన్న ఆ యజ్ఞాతమైన పిలుపును పురుషుడు విని, అతడు అటువైపు సాగిపోయేందుకుగాను స్త్రీ అతనికి సాయపడాలి. అలా చేసినప్పుడే ఆమె తనయెడల, అతనియెడలకూడ న్యాయంగా ప్రవర్తించినట్టు ఔతుంది. అలా చేయగలిగితే ఆమె అతనికొక ప్రేరణ ఔతుంది. లేకపోతే అతని పాదాలకు సంకెలగా తయారౌతుంది. ఆమె అతని అతనివెనకాలే వుండాలి; అతన్ని మళ్ళీ వెనక్కి తిరిగి రానీ కూడదు. ఇది ఆమె నిర్వహించవలసిన బాధ్యత అని నా అభిప్రాయం. ఒకవేళ అతడు వెనక్కి తిరిగిరాదలిస్తే ఆమె అక్కడే అడ్డుగా నిల్చి, అతన్ని తనలో నిలిపివెయ్యాలి; తనను దాటి వెనక్కి వెళ్ళనీయకూడదు. ఈపని ఆమె అనుగతయై నిర్వహించగలుగుతుంది. 'అనుగత' అన్న శబ్దంలో అవమానం గర్భితమైవున్నట్టు భావించకూడదు. పురుషునిలో పౌరుషం అన బడే స్వకీయమైన ప్రేరణవుంది; ప్రమాదాలున్నా ముందుకు దూసుకు పోతాడు. ప్రమాదాల్లో జొరబడటం మూర్ఖత అనికూడా అనవచ్చు. కాని అది అతనిదే. ఏకొంచెమూ స్త్రీభాగ్యంలోకి రాకుండా వున్నదంటే— అందుకు స్త్రీ పురుషునిపట్ల కృతజ్ఞురాలై వుండవలసినదేకదా:

ప్ర: పురుషుడు ప్రమాదాల్లో జొరబడతాడనటంలో మీ ఉద్దేశం? స్త్రీ ప్రకృతి అటువంటిది కాకపోతే సరే మంచిదే— కాని అందుకని పురుషుని తలమీద కృతజ్ఞతా కిరీటాన్ని తొడిగేస్తారెందుకు?

జ: కృతజ్ఞత ఎవరిపట్ల వుంటుందో, కిరీటం కూడా వారికి చెందుతున్నట్టే భావించాలి. కృతజ్ఞతాపాత్రమౌతున్నవ్యక్తి ఉపచారరూపంలో గౌణమే. ఇకపోతే—స్త్రీ ఎందుకు కృతజ్ఞురాలై వుండాలి?—అనే ప్రశ్నఉంది. కృతజ్ఞురాలుకాకుండా వుండేందుకు ఆమెకు స్వేచ్ఛవుంది. కాని ఈస్వేచ్ఛ వల్ల (కృతజ్ఞురాలైనప్పటికంటె) ఏనాటికైనా ఒక మేలైన ప్రయోజనం పొందగలుగుతుందని నే ననుకోను.

పురుషుడు ప్రమాదాల్లో చొచ్చుకొనిపోవటమంటే యేమిటి? అని అడిగావు. ఇప్పుడు మనం కూర్చునివున్న ఈ యిల్లే చూడు. ఇక్కడిది విద్యు

దీపాలు ఉన్నాయి. పంకా ఉంది. బందోబస్తు అయిన యిల్లు. సిమెంటుచేసిన గోడలు, నేల. పుస్తకాలు, ఫర్నిచర్ ఏవేవో ఉన్నాయి. ఇవన్నీ ఎలా సమకూడినవి అనే విషయం ఆలోచించు. వీటిలో ఒక్కొక్కటి సమకూర్చుకోటానికే ఎన్నో ప్రమాదాలు ఎదుర్కొని వున్నట్టు నీకు తెలుస్తుంది. ఒకప్పు డీ ప్రదేశంలోనే ఒక నిర్మానుష్యమైన అడవి ఉండివుండవచ్చు. ఇంకా అనేకమైన సంకటాలతో నిండివుండవచ్చు. అడవిజంతువులతో పోరాడటం మొదలుకొని అనేక యిక్కట్టులు ఎదుర్కొని, చెట్టుచేమ నరికివేసి, ఎంతో శ్రమపడి గడ్డిగాదంతెచ్చి, ఒక గుడిసె నిర్మించుకుని, ఒక కాపురం ఏర్పడివుంటుంది. ఇన్ని ఇబ్బందులలో మొదటిఅడుగు పురుషునిదికాక మరింకెవరిదో అవటం అసంభవం. ఈ మొదటిఅడుగుపట్ల దాని వెనుకనేవస్తున్న రెండవఅడుగు కృతజ్ఞురాలై వుండవలసిన అవసరం లేదంటే—సరే, లేదనుకో. కాని మొదటివారు లేకపోతే రెండవవారికి గతిలేదు, స్థితిలేదు. ఇంతకూ నిజంచెప్పు: పురుషునికెదురుగా నిల్చుని అతనియెడల మీరు కృతజ్ఞులై వుండవలసిన అవసరంలేదని మీరెంతగట్టిగానైనా వాదిస్తూఉండవచ్చుగాక; కాని అతనివెనకాల ఏకాంతంలోకూడా అటువంటిభావం మీ మనస్సులోకి వస్తుందా అసలు ? ప్రకృతితీరు గమనిస్తే అది అసంభవమనే అనిపిస్తుంది నాకు.

ప్ర : పురుషుడు ఆడదాని ప్రేమను కాలదన్ని, అక్కడక్కడ అతిచరిస్తూవుంటాడు. అందువల్లనే స్త్రీకి ఏంతో దుఃఖం కలుగుతూంది. ఇలా అతిచరించేవాడిపట్ల స్త్రీ కృతజ్ఞురాలుగా ఎలా వుండగలుగుతుంది ? ఒక్కొక్కమగవాడు ఒకానొక అమాయికబాలికను ఎలాగో ఆకర్షించటం, వలలోచిక్కించుకోడం, వివాహంచేసుకోకుండానే విడిచిపెట్టేయడం చాల చోట్ల జరుగుతూవుంది. ఇలా బాధలుపెట్టేవానిపట్ల స్త్రీకి కృతజ్ఞత ఎలా వుంటుంది ?

జ : కృతజ్ఞత ఎలా వుండగలదో నేను చెప్పలేను. కాని వుంటున్నది; అలాంటి ఉదాహరణలు ఉన్నాయి. స్టీవెన్ జ్వాయిగ్ ఒక పుస్తకం వ్రాశాడు. అందులో ఒక స్త్రీ అటువంటి పురుషునికే—అతనివల్ల ఆమెకు క్షణమాత్రంగానే ప్రేమ లభించింది; ఆతరువాత జీవితాంతంవరకూ కష్టాలే—

తాను చనిపోతూ ఒక గంభీరకృతజ్ఞతాపూర్వకమైన ఉత్తరం వ్రాసి పంపిస్తుంది. అందులో బాగా విషాదమే ధ్వనిస్తుంది; కాని చివరకు అదంతా కృతజ్ఞతే. కష్టాల్ని ప్రసాదించినందుకుకూడా కృతజ్ఞత చూపవలసే వుంటుందన్న నీతివాక్యాన్ని నేను విస్మరించలేను. అన్నిదేశాల్లోనూ, అన్ని కాలాల్లోనూ సత్పురుషులపరంపర, భక్తులపరంపర అవిచ్ఛిన్నంగానే వుంటున్నది. జీవితమంతా వారికి కష్టాలే సంభవించాయి; కొత్తగా వచ్చి పడే ఒక్కొక్క కష్టాన్ని వారు భగవంతుడు ప్రసాదిస్తున్న వరదానంగా, సంతోషపూర్వకంగా, అందులోనే తమ కృతార్థత వున్నట్టు స్వీకరించారు. ఈ శక్తి పురుషునిలోనే వుంటుంది, స్త్రీలో వుండదు—అనటానికి వీల్లేదు. స్త్రీలో ఇంకొకపాలు అధికంగానే ఉన్నది. పురుషునిలో 'నేను బలవంతుడి' నన్న మదం ఉన్నది. దాన్ని పురస్కరించుకుని అతడు ఇతర్లను కష్టపెట్టి తాను సంతోషిస్తాడు. స్త్రీలో ఈ మదం చాల తక్కువ. ఇంకా స్త్రీలో త్యాగశక్తి అధికంగా వున్నట్టుకూడా ఒప్పుకోవాలి.

పురుషుడు అతిచరిస్తాడు, ఏ ఒక్కరివద్దర నిర్చివుండడు—అంతే చూడు : అతని అతృప్తి, అతని వ్యథ ఎంత తీవ్రమైనదో ; అతడు లోలో పల దహించుకుపోవటం కనిపించటం లేదా ? ఆ దహనదీప్తిలో చూచా వంటే అతని కృతఘ్నతవల్ల కోపంకన్నా జాలే ఎక్కువ కలుగవచ్చు. అందుచేతనే అనేక ఉదాహరణములలో మనకు కనిపించేదేమంటే—కేవలం సహనశీలియైన వ్యక్తి బయటినుంచి తనకోసంగాను ఏమిన్నీ కోరటం ఉండదు. అటువంటి స్త్రీ పురుషుని కామనలకు ఒక కేంద్రం బౌతుంది. పురుషుడు బైట ఎంత అతిచరిస్తున్నవాడైనాసరే, లోలోపల మాత్రం ఆ కేంద్రంనుంచి స్వల్పకాలమైనా వైదొలగగలగటమంటూ ఉండదు. మనస్తత్వాలను లోతుగా పరిశీలించినమీదట తెలిసే అంశం ఏమంటే : పైకి ఒక రకంగా కనిపిస్తున్నట్టిది లోపల నిజంగా అలాంటిలేకాకపోవచ్చుకూడా అని. అంతే ఒకరిని కష్టపెట్టటం ఎవరికీ ఇష్టం ఉండదు. ఒకవ్యక్తి మరోవ్యక్తికి కష్టం కలిగేట్టు ప్రవర్తిస్తున్నాడంటే....అది అతనిలోతుల్లోవున్న ఏదో వివశత్వంవల్లనే. అతడలా ప్రవర్తించటం ఉచితమని కాదు నేను చెప్పేది. అటువంటి ప్రవర్తనపట్లకూడా క్షమ, కరుణ చూపించగలటం అసంభవం

కాదు. అట్టి వ్యక్తిపట్ల స్నేహభావంతో వుండటం సంభవమే; అదే సమం జసంకూడాను. పాపమునుండి పాపిని విడదీసి చూడగలిగిన ఓర్పు ఉన్నప్పుడే పాపమునుండి పాపిని దూరస్థునిగా చేయగలుగుతాము. పాపము నుండి పాపిని విడిగా చూడగలిగినప్పుడు అతనిపట్ల జాలే కలుగుతుంది. అప్పుడు తెలుసుకుంటాం: పాపాన్ని—మనకు బైట వేరే ఒక పాపితో కనిపిస్తున్నట్టిదైనాసరే—మనలోనుంచి పెల్లగించి పారేయాలి అని. దుష్టులు సాధువులుగా మారిపోయిన ఉదాహరణములు లేవంటావా? వాళ్ల సాధువులుగా ఎలా అయినారు? వారిలో దౌష్ట్యాన్ని హరించి, సాధుభావాన్ని ఉత్పన్నంచేయగలిగినది ఏది? మరొకవ్యక్తి వారిపై గనబరచిన శ్రద్ధ, ఆప్యాయత, సద్భావం. ఆ వ్యక్తి వారి ప్రవర్తన సర్వంచూస్తూకూడా, వారిదోవన వారిని విడిచిపెట్టి ఊరుకోలేదు; సహానుభూతిద్వారా వారిని తన వారిగా స్వీకరించటం జరిగింది. అదిగో, అటువంటి శ్రద్ధను నేను అంగీకరిస్తాను. అంటే ఒక దుష్టుడుకూడా పతివ్రతయైన స్త్రీకి దేవునివంటివాడు కాగలడు. ఈమాట అజ్ఞానజన్యంగా కనిపించవచ్చు; కాని అంతరిక్షక్రాంతి విజ్ఞానం ఈ సత్యమునందేకాని, మరింకెక్కడా లేదు.

ప్ర: అయితే పురుషుని అంత కృతఘ్నుడినిగా ప్రవర్తింపచేస్తున్న అతనిలోని ఆ వివశత్వం ఎలాంటిదో కాస్త విడమరచి చెప్పగలరా?

జ: ఊహూం. పూర్తిగా విశ్లేషణచెయ్యలేను. కాని—ఒకవ్యక్తిని చూచినంతనే ఆ చూపు అక్కడితో సమాప్తంకాదు. అనగా భార్యకు అవతలని ఇంకా ఏదో వున్నది. ఆ యవతలనుంచి, సమస్తదిశలనుంచీ ఒక్క సవాలు అనుభవిస్తూఉంటాడు; అది అనివార్యమైన సవాలు. అజ్ఞాతంగా వున్నదాన్ని తాను తెలుసుకోవాలి; చేతికందనిదాన్ని చేజిక్కించుకోవాలి. ఇదేకారణం పురుషుని అన్ని మూర్ఖపు పనులకూ. హిమాలయశిఖరంమీద తాను పాదం పెట్టలేకపోతే తనకేం మునిగిపోయిందనీ? కాని ఊరుకోడు. హిమాలయం అతన్ని సవాలుచేస్తున్నట్టు అనుభవిస్తాడు. అందువల్ల ఎన్నిసార్లు చచ్చినాసరే, హిమాలయంపైకి ఎక్కితీరవలసిందే; దానిపైన పాదం పెట్టవలసిందే. అంతవరదాకా విడిచిపెట్టడు. కొలంబస్ ఎందుకు బయలుదేరి వెళ్లాడు? అలెక్షెంద్రుడు ఎందుకు అలా ఇల్లువిడిచి పరిభ్రమించాడు,

యౌవనం ఇంకా వికసించకుండానే కుప్పకూలి చనిపోయేట్టు? క్రీస్తు, మహమ్మదు, బుద్ధుడు ఏం వెతుక్కుందామని, ఏం మూటకట్టుకుందామని ప్రాకులాడారు? వారిదీక్ష ఎప్పుడూ ఏమాత్రమూ సడలనేలేదు; తమ కోసమై సముపార్జించుకున్నదీ లేదు. సత్యాన్వేషణ అంటే ఏమిటబ్బా అది? అందుకోసమేకదా గాంధిజీ కొల్లాయి కట్టుకుని కాలం గడిపాడు; తుపాకిదెబ్బ తిని మరణించాడు? కాని అదేమిటో నేనున్నూ స్వయంగా అవగతంచేసుకోలేకనేపోతున్నాను. కాని ఏదోవున్నది మొత్తానికి; దాని పిలుపు సూటిగా వచ్చి పురుషునికి అందుతున్నది. కాని పూర్తిగా, భాషారూపంలో అది అర్థంకావటంలేదు. దాన్ని పురస్కరించుకునే పురుషుడు పరుగులు పెడుతున్నాడు. మరణిస్తున్నాడు—అని సూచించేం దుకే కీర్తి, పరాక్రమం, రాజ్యం, సామ్రాజ్యం, సత్యం, సత్వం మొదలైన పదాలన్నీ చాలా వున్నాయి మనదగ్గర. ఈరకమైన గత్యంతరంలేని పరిస్థితి స్త్రీకి ఎక్కువగా లేదనే నా ఊహ. తనలోనుంచే పుత్రుని తాను పొందగల అవకాశం ఆమెకు ఉంది. ఆ యవకాశం పురుషునికి లేదు. అందుచేత అతడు తన శరీరంద్వారా రకరకాల అశరీరసృష్టి చేయటంలో నిమగ్ను డౌతాడు. ఎంతవిలువ చెల్లించికూడా ఈపనినుండి అతన్ని విముఖునిగా చేయటం దుస్సాధ్యం.

ప్ర: అలాగ పెద్దపెద్ద ఆశయాలు పెట్టుకుని ప్రవర్తించేవాళ్ళ విషయంకాదు నేను అడిగేది. కేవలం సుఖంకోసమే ప్రాకులాడుతూ, చేసు కున్న యిల్లాలి ప్రేమకు తిలాంజలిచ్చేసి, పరాయిఆడవాళ్ళకోసం పడి తిరుగుతూవుంటారే—అటువంటివాళ్ళ విషయలోలుపత్వాన్ని మీరు ఎలా సమర్థించగలరు?

జ: నేను సమర్థించటంలేదు. కాని దాన్ని లోలుపత్వం అనేసి, నేను తప్పించుకోలేను. భార్య రూపవతి, విద్యావతి, అన్నివిధాలా స్పృహణీయు రాలేకావచ్చు; అయినాకూడా పురుషుడు....అభ్యర్థనీయమైనదేమీలేని, సౌందర్యవతికూడాకాని మరో స్త్రీదగ్గరకు పోతాడు. పోతాడు, శృంగభంగం పొందుతాడు. అయినాసరే మళ్ళీ వెడుతూవుంటాడు. అది వట్టి భ్రమ అని అతనికీతెలుసు. అయినా ఆ భ్రమలోనేపడి కొట్టుకుంటూఉంటాడు. అదే

నేను చెప్పేది : పురుషుడైనవాడు తనమనసులోనుంచి ఏదో ఒకఆదర్శాన్ని, లేదా ఏదోఒక భ్రమనేగానీ, ఆవిష్కరించి, అభివృద్ధిపరుస్తూ, దానిపైపే ఆకర్షితుడౌతూ వుంటాడు. అలా చేయకుండా అతడు వుండనేలేడు. దాన్ని 'లోలుపత్వం' అనేసి నేను ఎలా తప్పించుకోగలను ? మానవుడు తన దేశం కోసం బలి అయిపోవటానికి సిద్ధపడతాడు. దేశరక్షణకోసం ప్రాణాలకు తెగించి యుద్ధంలో జొరబడతాడు. వంశమర్యాద కాపాడుకునేందుకు ప్రాణం తీస్తాడు, ప్రాణం ఇస్తాడు. ఇదంతా ఒకవిధమైన లోలుపత్వం కాదా ? ఒక సందర్భంలో అది మంచిదిగాను, మరోసందర్భంలో చెడ్డదిగానూ కనిపిస్తుంది. ఔను, ఆమాట నిజమే. వివేకం ఉపయోగించి ఆ సందర్భాల్ని పరిశీలించ వలసిందే. ఆమాటా ఒప్పుకుంటాను. కాని రెండుసందర్భాల్లోనూ తత్త్వం ఒకటే. అక్కడా ఇక్కడా అది సమానమే. తాను కల్పించుకున్న ఒక ఆకాంక్ష ఉన్నది. దాని బలంమీద ఆకాంక్షనీయమొకటి ఉద్భూతమౌతున్నది. దానికోసమని తాను ఆహుతిఅయిపోవటానికి ఉద్యుక్తుడౌతున్నాడు. రెండు సందర్భాల్లోనూ ఇదే సమానతత్వం. ఈ సమానతను చూస్తూ నేనెలా దాన్ని త్రోసిరాజనగలను ? ఇందులోనే కనిపిస్తుంది పురుషుని పురుషత్వం. ఈ పురుషత్వం మురికికుంటలోపడి పొర్లుతూ వుండవచ్చు; లేదా ఆదర్శమను సానపై వాడిదేలి అద్భుతమైన పరాక్రమాన్నే ప్రదర్శించవచ్చు — ఇది నిజమే. ఈ రెండుసందర్భాల్లోనూ మనం దాన్ని గుర్తించవలసిందే. గర్హ నీయంగా ఉన్నచోట గర్హనీయమేనని నిర్ణయించేందుకు నేను భయపడు తున్నట్టు భావించవద్దు. కాని పర్యాయభేదాన్నిబట్టి అసలు తత్త్వంలోనే భేదం వున్నదంటే నేను ఒప్పుకోను.

ప్ర : కారణం ఏదైనా కానీయండి, పురుషుని యీ ప్రవర్తన యావత్తూ ఆతనిలోని లోలుపత్వంగానే స్త్రీకి అర్థంఔతున్నది. ఈ లోలు పత్వానికి వెనుకవున్న వివశత్వంలో స్వసుఖాకాంక్షే ద్యోతకమౌతున్నది. ఇటువంటి వివశత్వాన్ని స్త్రీ ఎలా అర్థంచేసుకుంటుంది ? అటువంటి పురు షునియెడల సహానుభూతి ఎలా చూపిస్తుంది ? ఎలా కృతజ్ఞురాలై వుంటుంది?

జ : ఔను. అర్థంచేసుకోటం కష్టమే. ఒకవైపు పురుషుడు తన సుఖంకోసమే ప్రాకులాడుతున్నట్లు కనిపిస్తూఉండగా స్త్రీకూడా తనసుఖాన్నే

దృష్టిలోపెట్టుకుని అతన్నిగురించి ఆలోచించటం మొదలుపెడితే—అర్థం చేసుకోటం మరింతకష్టం ఔతుంది. ఇంచుమించు ఈ అవస్థనే స్త్రీ పురుషుల మధ్యగల భోగసంబంధంగా పేర్కొనవచ్చు. ఈ అవస్థలో వారిరువురు ఒకరినుంచి మరొకరు తృప్తి పొందాలనీ, లాక్కోవాలనీ, పిండుకోవాలనీ వాంఛిస్తూవుంటారు. ఈ భోగసంబంధం ఎక్కడ ఎంతఎక్కువగా వుంటుందో, అక్కడ అంతయెక్కువగా భ్రమకు అవకాశం ఉన్నదన్నమాట. ఇంద్రియాల మధ్యమం (medium) ద్వారా ఎవరికీ ఏదీ సరిగా గ్రాహ్యం అయ్యే ఆస్కారంలేదు. పరస్పరోపలబ్ధికి శరీరం, ఇంద్రియాలు ఆటంకములే. సరిగ్గా అర్థంచేసుకోవాలంటే నిస్సంగవృత్తి అవసరం. పురుషునిలో లోలుపత్వం ఉన్నప్పటికీ అతనియెడల సహానుభూతికలిగివుండవచ్చుననే నా అభిప్రాయం. 'ఆ సహానుభూతిని స్త్రీ తనలో ఎలా తెచ్చుకోగలదు? ఎలా పోషించుకోగలదు?'—అనే ప్రశ్నలకు జవాబు ఏమిటంటే—ఆ పురుషునియెడల తనకుగల సంబంధంలో స్త్రీ ఏ విధమైన అపేక్ష వుంచుకోకూడదు; నిస్సంగవృత్తిని అలవరచుకోవాలి. అప్పుడా సంబంధం ఇంద్రియాతీతము, ఆత్మికము ఔతుంది. అదే దుష్టునిమీదనుంచి దుష్టత అనే ఆవరణాన్ని తొలగించివేస్తుంది, ప్రకృతమానవరూపంలో అతన్ని మేల్కొలిపేందుకు సమర్థమౌతుంది.

ప్ర : చెప్పటానికి ఇటువంటి సుద్దులు చాలానే చెప్పవచ్చునండీ. కాని అవన్నీ దుస్సాధ్యాలక్రిందికే వస్తాయి. పురుషుడొక కన్యను చూచి మోహిస్తాడు—ఏవేవో పెద్దపెద్ద కబుర్లు చెబుతాడు; ఆమెలో ఆకాంక్షలు రేకెత్తిస్తాడు. విశ్వాసంకలిగిస్తాడు. తీరా అతనిని విశ్వసించి తనను అతనికి ఒప్పజెప్పుకునేసరికి అతడామెను గ్రహించడు; విడిచిపెట్టేసి వెళ్ళిపోతాడు. ఆ కన్య అతనిలో తన సర్వస్వాన్ని చూచుకున్నది. కాని చివరకిలా వచ్చిపడిన గొడ్డలిపెట్టును ఎలా సహిస్తుందంటారు?

జ : ఆమె సహించలేదు; మనంకూడా సహించమని సలహా చెప్పవద్దు; ఇక ఆమెకు గత్యంతరం ఏమిటో నీవే చెప్పు? ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య ఒకసారి శరీరసంపర్కం ఏర్పడినట్టు రుజువైతే వాళ్ళిద్దరికీ బలవంతానఅయినాసరే వివాహం చేసితీరవలసిందేనని మనం ఒక చట్టం ఏర్పాటుచేయ

గలమనే భావిద్దాం. అసలు మొట్టమొదట అటువంటి చట్టాన్ని ఏర్పరచా లంటేనే అటంకాలు చాల ఉన్నాయి. ఇద్దరువ్యక్తులు పరస్పరం ప్రేమ సంబంధాన్ని వాంఛిస్తూనే ఉంటారు. కాని వివాహసంబంధంద్వారా ఒంటొ రులు కలిసిపోయేందుకు ఇష్టపడరు. ఇటువంటి ఉదాహరణలు చాలానే ఉన్నాయి. స్త్రీజాతి హృదయవాంఛలలోనూ బుద్ధినిశ్చయాలలోనూ భేదం వుండదని స్త్రీజాతితరపున నీవుగాని, మరింకెవరుగాని చెప్పలేరు. బౌద్ధికమైన మర్యాదలనుబట్టి వారు ఒకచోట వివాహంచేసుకోటానికి అంగీకరించవచ్చు: కాని వారి హృదయాకర్షణ ఇంకొకదిక్కున ఉండవచ్చు. కాని పెళ్ళిఅయాక భార్యాభర్తలు ఒకరిపట్ల ఒకరు కృతఘ్నులు కారాదని సామాజికనిబంధన వుంది, సర్కారువారిచట్టమూ వుండనుకుందాం. కాని ఆ నియమంవల్ల, చట్టంవల్ల ప్రీతి, ప్రామాణికత మొలకెత్తుతాయుంటావా ? నియమంవల్ల, చట్టంవల్ల అవి ఉద్బుద్ధంకానప్పుడిక ప్రేమహీనమైన ఆ సంసారంలో ప్రతి రోజూ, ప్రతిగడియా సహనం కావలసినదేకదా ! బలవంతాన ఇద్దరిని జంటగలిపి వుంచటం సాధ్యంకాదు. ఒకవేళ ఉంచగలమనే అనుకుందాం; కాని ఏ ఒక్కరి సహిష్ణుతాగుణంమీదా నిర్బంధాన్ని విధించకూడదన్న షర తును పూర్తిగా పాటించలేము. అర్థాత్తూ సహనం అనేది ఒకానొక ధర్మం; దానినుండి మనిషికి ఏ పరిస్థితిలోనూ విడుదలలేదు. కాని ఈ సహనం అనేది కేవలం స్త్రీపాలిటనే వచ్చిపడుతున్నట్టు భావించటం పొరపాటు. కాని నిజానికి స్త్రీ ఒకవిధంగా సహనం చూపవలిసేవస్తున్నది; తప్పటం లేదు. నేటి మన ఆర్థికవ్యవస్థలో అది ఇంకా దుర్భరంఅయింది. పురుషుడు దాత, కర్త ఔతున్నాడు; అతనియెదుట స్త్రీ అసహాయురాలుగా కనిపిస్తు న్నది. ఈ దృష్ట్యా స్త్రీకి మరికొన్ని అధికారాలు కావాలంటే నా కభ్యంతరం లేదు. కాని సామాజికమైన అధికారాలు ఎన్నివున్నా, 'సహనం' అనే ధర్మంనుండి అవి ఎవరికీ విడుదలను ప్రసాదించజాలవు. అధికారాలు పైవి; సుఖదుఃఖాలు లోపలివి. వాటికీ వీటికీ సంబంధం లేదు. దుఃఖకర మైన పరిస్థితిలోకూడా ఇచ్ఛాపూర్వకంగా 'సహన' ధర్మాన్ని పాటిస్తే సుఖానుభవం పొందవచ్చు. నీవు చెప్పిన ఉదాహరణలో, పురుషునిచేత మోసగింపబడిన ఆ కన్య, ఆ పురుషునిపై తన . కొక హక్కు వున్నట్టు భావిస్తూ, అసహనంతో జీవితంలో సుఖంగాని, శాంతిగాని పొందగలుగు

తుందని నేననుకోను—ఆ యసహనం చాలదూరం పెరిగి చివరకు ఆ పురుషునిద్వారానే తన హక్కు సాధించుకోగలిగినాసరే. అడుదాని మనసులోని గాయం దానంతట అదే మనసులోనే మానిపోవాలి, అంతే ఉపాయం; ఇంకో ఉపాయం లేదు.

ఇక పురుషుని పక్షంనుంచి విచారిద్దాం. అతడా కన్యను కష్టాల్లో కూలద్రోసి తాను సుఖంగా, హాయిగా వుంటున్నాడనికదూ నీవనేది? నేను మాత్రం అలా అనుకోటంలేదు. పైపై దృష్టి మనల్ని మోసగించవచ్చు. ఉన్నదంతా సమాజమే, మరేమీలేదని అనుకోరాదు. ఆత్మను అది అణచి వుంచలేదు. వంచనచేసిన ఆ పురుషుడు సమాజంలో మాన్యుడుగానే చలామణీ ఔతూవుండవచ్చు, అర్థకామములను సార్థకంచేసుకున్నట్టు కనిపించవచ్చు. అదంతా చూచి మనం మోసపోవలసిన అవసరంలేదు. సమాజంలో పొందుతూన్న గౌరవం, ధనసంపత్తి అతనికి సుఖాన్ని చేకూరుస్తున్నట్టు నేను అంగీకరించలేను. మనం దండిస్తేనే అపరాధివాడికి దండన లభిస్తుందనీ, లేకపోతే దండన ఉండదనీ అనుకోరాదు. కర్మఫలితమునుండి తప్పించుకొనటం ఎవరివల్ల కాదు. ఎందువల్లనంటే ఫలితము కర్మనుండి వేరుకాదు; అది క్రియతోపాటు ఉండేదే. కనుక ఫలము అమోఘము, అనివార్యము. ఈసంగతి గనక గుర్తిస్తే....పురుషుడు ఈ అకార్యం చేశాడు, అందుకు ఫలితంగా అతనికి ఈ దండన ఇవ్వాలిసిందే అని పట్టుపట్టవలసిన అవసరం అంతగా కనిపించదు. ఈవిధంగా క్షమించి ఊరుకోండని ఉపదేశిస్తూ సామాజికబాధ్యతలను అవహేళన చేస్తున్నానని అనుకోవద్దు. పురుషుడు అలా చేశాడు, ఇలాచేశాడని ఎల్లప్పుడు దోషారోపణచేసే స్థానంలో స్త్రీని చూడటం నాకు సంతోషదాయకం కాదు, అందువల్ల నాకు దుఃఖమే కలుగుతున్నది. తన పరిస్థితిని బాగుచేసుకున్నా పాడుచేసుకున్నా బాధ్యురాలు తానే అయి వుండాలి స్త్రీ. ఎవడో పురుషుడు పాడుచేశాడని ఎందుకనాలి? అలా చెప్పుకోటం స్త్రీకి శోభాజనకంకాదు; అవమానకరంగానే కనిపిస్తున్నది నాకు.

ప్ర : స్త్రీలకు ఎక్కువ అధికారాలు అడుగుదామనిగాని, పురుషులకు దండనవిధానం నిర్ణయిద్దామనిగాని నా ఉద్దేశం కాదు. స్త్రీకి సంభవిస్తున్న కష్టపరిస్థితిని మీకు చెప్పాను: ఒక భయంకరమైన గాయం మిగిల్చిపోయిన

పురుషునిపట్ల స్త్రీకి సహజంగా రోషమే రగులుకుంటుందిగాని, సహానుభూతి కుదురుకోటం అసంభవం'— అని. అదిగాక— స్త్రీ ప్రేమను సంపాదించు కునేంతవరకే పురుషుని ప్రయోజనం; సంపాదించుకోగానే ఆమెను విడిచి పెట్టేసి మరొక ఆకర్షణలో వెళ్ళి పడిపోతాడు. మరొకచోట సుఖప్రాప్తి కోరుకుని, స్వార్థపరుడై వెళ్ళిపోయాడని స్త్రీ అనుకుంటుంది. అటువంటి పురుషునిపట్ల ఆమెకు శ్రద్ధ ఎలా నిలుస్తుంది? ఆమె ఇలా ఒక పురుషునిచేత మోసగింపబడికూడా, ఏదో వివశత్వం కారణంగా, మరొకచోట సుఖం వెతుక్కోటానికి అసమర్థురాలుగా పడివుంటున్నది. ఆమెలోని ఈ వివశ త్వాన్నికూడా మీరు విశ్లేషణచేసి చెప్పగలందులకు కోరుతున్నాను. చాల చోట్ల స్త్రీజీవితం ఒక్క పురుషుని ప్రేమతోనే సమాప్తమౌతున్నది.

జ : ఔను. ఈవిషయంలో స్త్రీకి, పురుషునికి కొంత భేదం ఉండి తీరింది. స్త్రీప్రేమ ప్రాప్తితో ఆరంభమౌతుంది; పురుషునిప్రేమ అక్కడితో సమాప్తమౌతుంది. ఈసంగతి బహుశా ఇదివరకే చెప్పివున్నాను. ఇంకా.... స్త్రీపురుషులు వ్యక్తిత్వదృష్ట్యా సర్వథా భిన్నమైనవారు కారనీ; శుద్ధపురుషుడని గాని,శుద్ధస్త్రీయనిగానిఉండరనికూడాచెప్పాను. అనగాకొందరుస్త్రీలుఉంటారు- స్థిరత్వం లేకపోవటంలో పురుషుల్ని మించినవారై ముందుకు సాగివచ్చే వాళ్లు. ఇకపోతే కొందరు పురుషులుకూడా వుంటారు— ఒకస్త్రీకి అంకితులై, ఆమెను కోల్పోతే, ఆమెపేరు తలుచుకుంటూ జీవితాంతంవరకూ రోదిస్తూ ఉండేవాళ్లు. ఇటువంటి తరహాలవారు ఉన్నప్పటికీ— స్త్రీకి ప్రేమసఫలతలో నుంచి కర్తృత్వం లభిస్తుందనీ, పురుషునికి ఆసఫలతతో కర్తృత్వం సమాప్తమైపోతుందనీ గుర్తుంచుకోవాలి. ఈ విభేదాన్ని ఏవగించుకుంటే ప్రయోజనం లేదు; స్వీకరించవలసిందేనని నా ఉద్దేశం. స్త్రీయే గర్భం ధరించాలి. ఆ జంజాటమంతా పురుషునికి లేదు. స్త్రీయొక్క సంపూర్ణ భావము, రసము ఏకీకృతము కాగల ఒక కేంద్రాన్ని తనలో పొందటమే—గర్భాన్ని ధరించటం అంటే. గర్భిణీఅవస్థలో ఇంద్రి యాల చంచలత హఠాత్తుగా స్త్రీలో తగ్గిపోతుంది. నెమలిపింఛంలాంటి అంగవిస్ఫూర్తి తగ్గుతుంది. అటువంటి గర్భిణినుండి సామాన్యంగా పురు షుడు విముఖుడే ఔతాడు; ఆమెపైపు తిరిగినా బుద్ధి, వివేకముల ఒత్తిడి వల్లనే. గర్భిణీయైన భార్యపట్ల భర్త యిష్టం కలిగివున్నాడంటే—సహాను

భూతివల్ల మాత్రమే. అతన్ని ఆమెనుంచి వేరేవైపు లాక్కుపోదామనే ఇంద్రియాల కోరిక. స్త్రీపురుషులలోగల ఈ విభేదం ఏ విధానాన్ని అనుసరించి వున్నదో—దాన్ని మన్నించకతప్పదు. ఇంతకన్నా ఎక్కువగా విశ్లేషణ బహుశా కూడదనుకుంటాను.

ప్ర : సరిగా స్త్రీకి పురుషుని ప్రేమలో రమించవలెనన్న కోరిక ఆరంభమౌతున్న తరుణంలోనే తటాలున పురుషుని ప్రేమ సమాప్తమైపోతున్నదంటే.... ఇది స్త్రీకి చాల యాతనాహేతువే. ఆ సంగతి మీరు గుర్తించగలరని ఆశిస్తున్నాను. మీరేమో ఎంతసేపూ పురుషునివట్ల సహానుభూతి ఉండాలని గట్టిగా చెబుతున్నారు. కాని లోతుగా ఆలోచించిచూచినకొద్దీ, నిజానికి సహానుభూతి పొందవలసిన అర్హత అధికారం స్త్రీలోనే అధికంగా కనిపిస్తున్నది. నే నీమాట ఇంత పట్టుదలగా చెబుతున్నందుకు, స్త్రీజాతిపట్ల వున్న అభిమానంతో వారిని సమర్థిస్తున్నానని అనుకోవద్దు. స్త్రీలో కనిపిస్తున్న ఈ సహజవివశతను పురస్కరించుకుని ఆమె మూలప్రకృతిని విశ్లేషించవలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాను.

జ : సహానుభూతి అనేది ఒక ప్రకృతి తత్త్వం; ఆవిధంగా అది అనివార్యమైనది. కాని వ్యక్తి తన మూలతత్త్వంతోనే సంయుక్తుడు కాలేడు; వియుక్తుడై వుంటాడు. వియుక్తుడుగా వుంటున్నాడంటే—సంయుక్తుడయే ప్రయత్నంలోకూడా వున్నాడన్నమాటే. ఈవిధంగా భోగయోగాల మధ్య, స్వార్థసహానుభూతులమధ్య ఊగిసలాడుతూఉంటాడు. స్వార్థమే ఉత్కటంగా వున్నదంటే సహానుభూతి క్షీణించిపోతున్నదన్నమాట. ఒరులకు సహానుభూతి ఎల్లప్పుడూ ఇవ్వదగినదే. అది అడిగి తీసుకోవలసినది కాదు. అడిగితీసుకోవాలని పట్టుదల పడితే ఇచ్చే వారిలో అది అణిగిపోతుందేగాని పొర్లిరాదు. అసలు స్త్రీపట్ల సహానుభూతిశూన్యుడు కావటం పురుషునికి సాధ్యంకాదు. స్త్రీలోని అబలత్వం (అంటే కోమలత) పురుషుని మనస్సుకు ఒక పెద్ద ఆకర్షణ. అయినప్పటికీ ఒకవేళ పురుషుడు స్త్రీపట్ల సహానుభూతిలేకుండా వున్నాడనుకుందాం. అటువంటప్పుడు—పురుషుడావిధంగా తనకు తానే అవజ్ఞ చూపుకుంటున్నాడని భావించి, స్త్రీమాత్రం తన సహానుభూతివెల్లువను అడ్డగించుకోకుండా ఉంటే—అది ఆ పురుషు

నికీ, ఆ స్త్రీకీకూడా మేలే ఔతుంది; అందులో సందేహం ఏమీలేదు. ఎప్పుడూకూడా ముందడుగు వేసి ఇబ్బందులను ఎదుర్కోవలసింది పురుషుడే; ఈసంగతి ఇదివరకే చెప్పాను. ఈ తన అధికారాన్ని అతడు వదలుకోడు. ఇందులోనే గర్భితమైవుంది అతనికి స్త్రీపట్ల గల సహానుభూతి. అసలు సహానుభూతికి ప్రథమాధికారిణి స్త్రీయే అన్న విషయం పురుషుడు అనాయాసంగా గుర్తిస్తాడు. నన్నడిగితే ఈవిషయం నేను సంతోషంగా అంగీకరిస్తాను. కాని స్త్రీమాత్రం—పురుషునికి తనపట్ల సహానుభూతి ఎట్టి పరిస్థితిలోనూ ఉండకుండా పోదులే.... అనే ధీమాకలిగివుండటం పొరపాటు. ఎప్పుడైనా సహానుభూతి చూపిస్తేనే తనకు మళ్ళీ అది నిశ్చయంగా దొరుకుతుంది. పురుషునికైనా, స్త్రీకైనా అదే నియమం. సహానుభూతిని ఒక హక్కుగా పొందగోరటంవల్ల, అది ఇచ్చేవారికి ఇవ్వటం అసంభవమౌతుంది. ఆశిస్తే (డిమాండుచేస్తే) వచ్చేది కాదది. ఇక్కడ బదులుకు బదులు (Exchange) పుచ్చుకోవలసిందే అన్న నియమంవల్ల వ్యతిరేక ఫలితమే కలుగుతుంది. ఏవిధమైన లెక్కలు, తూకాలు, కొలతలుకూడా ఈ క్షేత్రాన పనిచేయవు. సర్వం ఇచ్చివేసేవాడికే సర్వం లభిస్తుంది. తిరిగి పొందవలెనన్న ఆలోచనతో ఇవ్వటం—ఈక్షేత్రంలో—ఇవ్వటం కానే కాదు. బేషరతుగా ఇచ్చివేసి, అదే కృతార్థత అనుకుంటేనే సర్వం దానంతట అదే లభిస్తుంది. ఎందువల్ల, ఏనియమాన్ని అనుసరించి—అలా లభిస్తుందో మానవబుద్ధికి పూర్తిగా అవగతమయ్యే విషయంకాదు. అది మానవ నియమం కాదు; ఈశ్వరనియమం. కనుక అది దుర్నివార్యము, నిరపవాదము. ఈవిషయాన్ని సంపూర్ణంగా విశ్వసించిన స్త్రీకి ఇక సంశయ వ్యాకులత ఉండదు; ఆపదరాదు. అప్పుడామెకు పురుషునిద్వారా పొందవలసినదంటూ ఏమీ వుండదు; సర్వాంతర్యామియైన భగవంతునిద్వారా సర్వం పొందగలమార్గం ఆమెకు దొరికిపోతుంది.

# ప్రేమస్వాతంత్ర్యము, సమాజస్థిరత్వము

ప్ర : శరచ్చంద్రుని పాత్రలు తమ ప్రేమవ్యాపారంలో సామాజిక మర్యాదలను అతిక్రమించి స్వేచ్ఛను గైకొంటున్నట్టు కనిపిస్తాయి. అది ఎంతవరకు ఉచితమని మీ అభిప్రాయం?

జ : సామాజికమర్యాదలు మన సత్యసాధనమార్గంలో వాటంతట అవి ఏర్పడతాయి. అంటే అవి సుస్థిరములుకావు, వికాసశీలములు. సదాచారం అంటే సత్తు పూర్వంగా గల ఆచారం. సత్తు మొదట; ఆతరువాత ఆచారం. సత్తును అనుసంధించుకుని ఆచారం ముందుకు సాగిపోతూ ఉంటుంది. ఈవిధంగా రూఢమైయున్న సదాచారానికీ, సజీవమైన సదాచారానికీ ఏ కాలంలోనైనా కొంత అంతరం కనిపిస్తూనే వుంటుంది. సత్పురుషులందరూ ప్రారంభంలో సంఘవిద్రోహులుగా పరిగణింపబడినవారే. ధార్మికునికి ధర్మజ్ఞునితోటి విరోధం సహించవలసేవుంటుంది. శరచ్చంద్రుని పాత్రలలో సమాజమర్యాదలను అతిక్రమించే స్వేచ్ఛ కనిపిస్తున్నదంటే—దానికి ఉచ్ఛృంఖలత కాదు కారణం; అవిరతమైన సహానుభూతే అందుకు కారణం. కాబట్టి అక్కడ సదాచారానికి క్షతి ఏర్పడలేదు; పైగా అది సమృద్ధమే అయింది.

ప్ర : 'చరిత్రహీనులు' అన్న నవలలో కిరణ్మయి ప్రవర్తన ఉచ్ఛృంఖలంగానే కనిపిస్తుంది. ఉచ్ఛృంఖలతకూ, సహానుభూతిజన్యమయిన స్వతంత్రతకూ మీరుచెప్పే తేడా యేమిటి?

జ : కిరణ్మయిప్రవర్తనను లేఖకుడు స్వయంగా సమర్థించలేదు. ఆ సంగతి పుస్తకంలోనే ప్రకటం ఔతున్నదికదా! కిరణ్మయిలోని తీక్షణత లేఖకునకు స్పృహణీయమైనట్టిదిగా ఎక్కడా కనిపించదు. ఆమెది చివరివరకు వ్యాకులచిత్తమే; శాంతి ఆమెకు లభించనేలేదు. పుస్తకంచివర మనకు తేటతెల్లమైపోతుంది: ఆమెస్పర్థ యావత్తూ పరాజితము కుంఠితము అయిపోయిందని. కిరణ్మయిపాత్రయెడల పాఠకుని హృదయంలో జాలి కలుగు

తుంది; ప్రశంసాభావం కలగదు. కనుక కిరణ్మయిప్రసక్తివల్ల నీ ప్రశ్న సుస్పష్టంకాదు. ఏదైనా ఒక పాత్ర పాఠకునికి ప్రశంసనీయం కాకపోవచ్చు; అందువల్ల ఆ పాత్ర ఉచ్ఛృంఖలంగా అనిష్టకరంగా ఎందుకు వ్యవహరించింది?—అని అడగటంలో అర్థం ఏముంది? కాని శరచ్చంద్రుని రచనలలోనుంచి....సామాజికమర్యాదలను పాటించకపోయినా శ్లాఘనీయంగానే కనిపించే పాత్రలను వెదికి పట్టుకోవచ్చు. అటువంటిపాత్రలప్రసక్తితో నీ ప్రశ్నకు ఒకరూపం వస్తుంది.

ప్ర: సామాజికమర్యాదలనుంచి స్వాతంత్ర్యాన్ని కోరే ప్రేమ శ్లాఘనీయమని మీరెలా అంగీకరించగలరు?

జ: అటువంటి స్వతంత్రాన్ని ఏమాత్రం తీసుకోకుండానే శ్లాఘనీయమైన ప్రేమ ఎక్కడైనావుంటే దాన్నిగురించి నీవే చెప్పు.

ప్ర: ఆc! ఇక్కడ నేను సీతను పేర్కొనగలను. ఆమెకు రాముని యెడల అపారమైన ప్రేమ. సామాజికమర్యాదలను అతిక్రమించిన స్వేచ్ఛ ఎక్కడాలేదు ఆమెలో.

జ: ఈకాలపు దృష్టితో సీతను చూడు: ఆమె ప్రాణాలతోనే లంకకెందుకు చేరుకోవాలి? దారిలోనే ఏ ఉపద్రవమో కల్పించుకుని చచ్చిపోక పోయిందీ? అనే ఇటువంటి ప్రశ్నలు ఉత్పన్నం కాకపోవు. అదీగాక లంకలో ఆమె చాలరోజులపాటు ఉన్నది. అలా ఒక పాపాత్మునిదగ్గర బ్రతికివుండేకంటే భర్తపేరు తలచుకుని ఆత్మహత్య చేసుకోటమే మంచిదని సూచించే ప్రేమకూడా వుంటుంది! ఇటువంటి ప్రేమ పాతివ్రత్యదృష్ట్యా ఎంతో ఉత్కృష్టమైనదికాదా! నీవే చెప్పు? ఇటువంటి అభిప్రాయాలేగల వ్యక్తులు ఆరోజుల్లోనూ ఉండివుంటారు. అందువల్లనే సీతకు అగ్నిపరీక్ష, ఆతరువాత తిరిగి వనవాసం అనుభవించవలసివచ్చింది. ఇకపోతే సీతాదేవి మర్యాదస్తుడు, పురుషోత్తముడు అయిన శ్రీరాముని భార్య. మర్యాదను పాలించటంలో ఉండే శ్రేష్ఠతను ఉగ్గడించే కథ అది. అయినా....అన్నివిధాలా మర్యాద పాటించబడుతున్నప్పటికీ....సీతహృదయంలో రావణుని పట్ల జాలి, విచారం ఉన్నంతగా ద్వేషం లేదు—అని నాకు నిశ్చితంగా కని

పిస్తున్నది. [అశోకవనానికి రావణుడు రాకుండా ఉండలేదు; అయినా రావణునిద్వారా ఆమె సంకటావస్థను అనుభవించవలసిన అవసరం పడలేదు. అంటే ఆమె సౌశీల్యంలో అటువంటి గాంభీర్యం ఒకటి ఉన్నదన్నమాట. ఈ శ్లాఘనీయమైన అర్హత ఏదో ఒక సమాజమర్యాదను మననంచేసుకుంటూ ఉన్నందువల్ల ఆమెకు సంక్రమించినట్టిదికాదు. అవిరతమైన విశుద్ధప్రేమలో నుంచి ఆమెకది సిద్ధించింది. మహోత్కృష్టమైన ప్రేమ తన మర్యాదను తానే సృష్టించుకుంటుంది. ఒక అనుశ్రుతమైన మర్యాదలోనే అల్లిబిల్లి తిరుగుతూ ఉండవలసిన అవసరం దానికి లేదు. సీతాదేవి ఉదాహరణవల్ల విషయం ఇంకా సుస్పష్టం కాలేదనుకుంటే రాధ ఉదాహరణ ఉంది. రాధ ప్రేమ ఎటువంటిదంటావు? అది అశరీరము, అపార్థివము అంటావా?.... అలాగే అనేట్టయితే అసలు విషయమే ఎగిరిపోతుంది. అప్పుడు రాధ వృత్తాంతమంతా నీకు ఒక అలౌకికావతరణరూపకంవలె గోచరిస్తుంది. అప్పుడు అందులో నీకు ఒక ప్రేరణ అనేది ఏమాత్రమూ ఉండదు. కాని, యుగయుగాలుగా రాధపేరులోగాని, ప్రేమలోగాని ప్రేరణ అజస్రమై సాగివస్తున్నదంటే ఆప్రేమ అపార్థివం కానేరదు; పూర్తిగా ప్రాణవంతమే అయివుంటుంది. నీవే చెప్పు: అందులో సామాజికమర్యాద గురిగింజంత—కాదు, ఆవగింజంతైనా ఉన్నదా? ప్రేమలోనుంచి ఏకాంచెమూ స్పర్థాపూర్వకంగా త్రుంచివేయకూడదు; అప్పుడు ప్రేమమార్గంలోగల ఎటువంటి అడ్డంకులైనా కరిగిపోయి దానంతటదే దారి ఏర్పడుతుంది.]

ప్ర: రాధ భర్తను విడిచిపెట్టేసి పరపురుషుడైన కృష్ణునిలో లీనమైంది. ఈవృత్తాంతాన్నే మీరు ప్రశంసిస్తున్నారా?

జ: మీరు ప్రశంసించరాయేమిటి? లేక ఇంకెవరైనా ఉన్నారా ప్రశంసించనివాళ్లు? భారతదేశంలో అటువంటివాళ్లు ఉంటారని నేననుకోను.

ప్ర: సామాజికదృష్ట్యా అది అపహేళనీయమే! రాధ ఉదాహరణ పురస్కరించుకుని స్త్రీలంతరూ చేసుకున్నభర్తమ వొదిలేసి పరాయిపురుషుని యందు అనురక్తలైతూవుంటే—?

జ: అందరూ రాధలైపోతారు!....అంతేగా? రాధలు కానంత

వరకు వాళ్ళను ప్రశంసించటం కష్టమే. అయినా రాధకాదలచుకున్నవారు— తమ ప్రియునిమీదిప్రేమకు, పతిప్రేమకు ఏమాత్రమైనా తేడావుంటుంది.... అనే ఊహ తమకు లీలగానైనా స్ఫురించేఅవకాశం లేనంతగా—అంత పరిపూర్ణంగా తమను తాము ప్రేమలో కోల్పోవాలి. అందువల్లనే రాధ ప్రేమను ఒక మహోత్కృష్టమైన ప్రేమగా పరిగణిస్తూన్నప్పటికీ, భారతీయసంస్కృతి భర్తృద్రోహాన్ని ఉపదేశించేదనిగాని, ప్రేరేపించేదనిగాని చెప్పటానికి వీల్లేదు. ప్రేమకు ఒక స్వతంత్రప్రతిష్ఠను ఇవ్వవచ్చు. అది సమాజమర్యాదలకు అతీతమైనదిగాకూడ పరిగణించవచ్చు. కాని అందువల్ల సమాజమర్యాదకువుండేస్థానం స్థిరపడుతుందికాని సమాప్తంకాదు.

ప్ర : రాధకు కృష్ణునితో భోగసంబంధంకూడావుంది. అందులో ఆకాంక్ష, అభిలాష, ప్రాప్తి—సమస్తం ఉంటాయికదా! అయినాకూడా; భర్తృప్రేమ, కృష్ణప్రేమ ఆమెకు ఒకటే అయిపోయిందని ఎలా చెప్పగలం?

జ : ఆసంబంధం అలాంటిదీ మరి! అందులో అన్ని విశేషణాలూ మునిగిపోతాయి. ఏవిశేషణమూ దాన్ని ఆవరింపజాలదు. అటువంటి సమగ్రమైన, సంపూర్ణమైన సంబంధం అది. కనుక అది నిశ్చయంగా ఆత్మికసంబంధమే. కృష్ణుడు రాధదృష్టిలో ఆమెభర్తకు ఏవిధంగానూ విరోధికాలేదు; ప్రతిస్పర్ధి కాలేదు. కనుక రాధ కృష్ణప్రేమ...అన్ని విధాలా పూరకము, సంగ్రాహకము అని విశ్వసిస్తున్నాను. ఏ విధంగానూ విగ్రాహకము కానేకాదు.

ప్ర : రాధభర్తకు శ్రీకృష్ణుడు ప్రతిస్పర్ధి ఎందుకుకాడు? స్వభావతః అటువంటిస్థితిలో అయితీరవలసిందే.

జ : సామాన్యతః అవవచ్చు; స్వభావతః కాదు. రాధాకృష్ణుల సంబంధంలో అలాజరిగింది అనిచెప్పటం న్యాయోచితంకాదు. రాధాకృష్ణులసంబంధం అసామాన్యమైనదని చెప్పవచ్చు; అస్వాభావికమైనదని చెప్పటం సరికాదు. అటువంటిసంబంధం ఇప్పటికీ బీజరూపంలో మానవజగత్తునందు దుష్ప్రాప్యం కాదనే నా ఉద్దేశం. అంతేకాదు, మనం పరిశీలించినట్లయితే, అంత అరుదైనది కాదనికూడా మనం తెలుసుకొనగలమనే నాలోవి శ్రద్ధ ఉద్భాస్తు

న్నది. ఈర్ష్యగాని, స్పర్థగాని ఏమీలేని అటువంటి భవ్యప్రేమ ఏప్రకారంగా వుందేదీ నేను ఎక్కువగా ఏమీచెప్పలేను. ప్రేమ సమగ్రమైనప్పుడు 'ఇంద్రియాలనుంచి స్వతంత్రం'... లేక...'ఇంద్రియాతీతం' ఔతుందని నేను నమ్ముతున్నాను. ఇక అప్పుడు ప్రతిస్పర్థ అనే ప్రశ్న ఎక్కడవుంటుంది? పతి-పత్ని సంబంధం సామాజికం; ఇంద్రియావలంబి. ప్రేమ పరిపూర్ణమై, ఆత్మికమైపోయినప్పుడు ఇకదానికి అవలంబనం ఎందుకు? అవసరంలేదు.

ప్ర : ఇంద్రియాతీతమైనప్పుడే ప్రేమ ఘనిష్ఠమనిపించుకుంటుందని మీరెలా చెప్పగలరు? పాశ్చాత్యవైజ్ఞానికులు చాలామంది...ఇంద్రియ సంబంధంద్వారానే ప్రేమకు ఘనిష్ఠత చేకూరుతుందని అంటారు. రాధకు కృష్ణుని యందుగల ప్రేమ ఇంద్రియాతీతమని...ఇది మీ స్వంతవ్యాఖ్యానమేకదూ?

జ : ఇంద్రియాలు వర్జితములై, వంచితములై వుండగా ఆ యవస్థను నేను 'ఇంద్రియాతీత' మనలేను. అక్కడ సమగ్రత లేదు; అది అపూర్ణమే, ఏకాంగీణమే. ఇంద్రియాలను వెనక్కునెట్టివేసి ముందుకు సాగే చోట....ఇంద్రియాలు బాధాకరములన్నభావన గలచోట....అతీంద్రియత్వం ప్రాప్తించిందనిగాని, ప్రాప్తించగలదనిగాని నేను అంగీకరించను. ఇంద్రియాలుకూడా కలసివచ్చినప్పుడే, అవికూడా ఆత్మతోసమ్మేళనంపొందినప్పుడే యోగం అవుతుంది. అర్థాత్తు—శరీరం ఆత్మతో సంయోగం పొందకుండా, దాని ఆకలి అలాగేవుంటూంటే అది సత్యమైన సంపూర్ణమైన యోగం అనిపించుకోదు. సంపూర్ణం కానప్పుడు అది ఆత్మికమూకాదు. ఎందువల్లనంటే—ఆత్మ సర్వవ్యాప్తం. అటువంటి సంపూర్ణయోగస్థితికి తప్పనిసరిగా అవకాశం ఉన్నది. ఆత్మకూ, శరీరానికీ మధ్యగల అంతరం పూడిపోయి, శరీరంయొక్క భిన్నమైన ఉనికి బాధకముగాక, సాధకము అయినప్పుడే అది ఆత్మికం. ఆ యవస్థలో వ్యక్తుల శరీరాలు తమ భిన్నమైన ఉనికిని వినష్టం చేసుకునేందుకు ఆతురపడవలసిన ఆవశ్యకతలో పడవు. ఈ స్థితి అకల్పనీయం ఏమీకాదు. పైనచెప్పినదాన్నిబట్టి—ప్రేమ తీక్షణం అయితే అనాయాసంగా అతీంద్రియం ఔతుందనికాదు అర్థం. తీక్షణం అయేందుకు ఆ తర్వాత అతీంద్రియంకూడా కావాలన్న షరతులేదు. శరీరాల విభిన్నతను హఠాత్తుగా ఒకదానిలో మరొకటి విలీనం చేసివేసుకోవాలన్న కోరిక

ఉన్నన్నినాళ్ళూ అది కామమే. మిథునంనుండి మైథునం పుడుతుంది. అది లేనప్పుడు కృతకామత వచ్చేసిందన్నమాటే. అతీంద్రియప్రేమలో శరీరమూ ఇంద్రియాలూ ఈ కృతకామతను అనుభవించాలి. అప్పుడిక వాటికి ప్రత్యేకమైన ఆకలి వేరే ఏమీ ఉండదు.

ఔను; ఈ వ్యాఖ్యానం నాదే; బహుశా చాలవరకు నాదే. రాధాకృష్ణుల ప్రేమనుగురించి ఎవరికివారు ఒక అభిప్రాయం ఏర్పరచుకోటం కంటె మరి గత్యంతరం ఏముంది? ఆ విషయమై ఎవరి అభిప్రాయం వారు ఉంచుకోటం తప్పుకాదు. కాని అది ఎంతవరకు సత్యానికి దగ్గరగావున్నదీ, ఎంతవరకు సత్యాన్ని వ్యక్తీకరిస్తున్నదీమాత్రం చెప్పలేము. నా అభిప్రాయాన్నికూడా నీవు ఆ దృష్టితోనే స్వీకరింపదలచుకుంటే—సరే, నీ యిష్టం. కాని 'రాధాకృష్ణ' అనే సంయుక్తనామంలో ఎంతో మహిమ, గరిమ ఉంది—అవి భారతీయసంస్కృతీపరంపరకు శిరోధార్యములై—వేలాది సంవత్సరాలుగా, అవిచ్ఛిన్నంగా, ప్రాణవంతములుగా మనకుఅందింపబడుతున్నవంటే—ఆ రాధాకృష్ణుల ప్రేమ ఎంతో సమగ్రమైనదై ఉండాలి. దాన్ని ఉపాసించుట చేతనే భారతదేశానికి అమరత్వం వచ్చింది. నేను ఆ రూపంలోనే ఆ ప్రేమను గ్రహించేందుకు ప్రయాసపడ్డాను.

ప్ర : 'సమగ్రప్రేమ' అనే పదం మీ రే అర్థంలో ఉపయోగిస్తున్నారు?

జ : ఎందులోనైతే సంపూర్ణప్రాణచైతన్యం పాలుఇచ్చి పాలుపుచ్చుకుంటుందో అదే సమగ్రప్రేమ.

ప్ర : ఆ లెక్కలో శరీరంతోపాటు శరీరభోగంకూడా వచ్చేసింది. ప్రేమసమగ్రతకు అదికూడా అవసరమేనంటారా?

జ : భోగం శరీరంవరకే వుంటుంది. ఇక ఎందులోనైతే మిగిలినవన్నీకూడా వుంటాయో దాన్ని యోగం అనవచ్చు. భోగం అగ్రాహ్యం అని చెప్పేట్టయితే అది ఒక చాల చిన్న ఆంశికం (fraction) కాబట్టి—అని నా ఉద్దేశం. ఇంకా దాన్ని ఋణాత్మకం (negative) అని చెప్పినా

సత్యదూరంకాదు. యోగంలో శరీరం కలిసిరాదు అని అనుకోటం పొరపాటు. అది కలిసిరాకపోతే యోగమేలేదు; కాయికదమనం, అహంకృతక్లేశం అనిపించుకుంటుంది.

ప్ర : భోగము అగ్రాహ్యం అని ఎందుకు అనుకోవాలి? ప్రేమ సమగ్రతను సాధించటంలో అది ఆటంకప్రాయమౌతుందనా?

జ : భోగావస్థయందు వ్యక్తిలో ఒకరకమైన పట్టుదల విద్యమానమౌతూ వుంటుంది. పట్టుదల ఏకాంగితా (one sidedness) లక్షణం. భోగంలో తనపైన చాల భాగాన్ని వెనుకనే అట్టిపెట్టుకుని, ఏకాంశం మాత్రమో హోమంచేయటం జరుగుతుందనిపిస్తుంది. భోగమునందు సంపూర్ణసమర్పణ జరగటంలేదు, కనుక తప్పనిసరిగా అది ఆంశికమే ఔతున్నది. కాగా దానికి ఎక్కువమహత్వాన్ని ఇవ్వటం నాకు ఇష్టంలేదు.

ప్ర : ప్రేమయందు శరీరయోగం అవసరమని మీరంటున్నారు; కాని భోగాన్ని వ్యతిరేకిస్తున్నారు. ప్రేమయందు శరీరయోగం అంటే మీ తాత్పర్యం ఏమిటి? ఆయోగం ఎలా సాధ్యం ఔతుందంటారు?

జ : శరీరం మనస్సుతోనూ, మనస్సు ఆత్మతోనూ సహయోగం గలిగి సాగిపోతూవుంటే—శరీరం తనకుతాను ఏకాంతభోగం అనుభవించాలన్న పట్టుదల కలిగివుండదు. అప్పుడు శరీరం తనలో కోరికల తహతహను కలిగివుండదు. ఈ స్థితి వాస్తవికంగా మన అనుభవంలోకి వచ్చేటువంటిది కాదనీ, అకల్పనీయమనీ భావించనవసరంలేదు. స్థూలజగత్తులో ప్రేమీప్రేమికులు పరస్పరం విగళితులై, సహానుభూతిపూర్ణులై, అశ్రుధారలువిడుస్తారు. అటువంటప్పుడు ఆ యిద్దరి శరీరాలుకూడా పరమకృతార్థతను అనుభవిస్తున్నట్టే నేను భావిస్తున్నాను. భోగంద్వారానే తృప్తి లభించదు; పైగా దానివల్ల అతృప్తే పెరుగుతుంది. పైన పేర్కొన్నమాదిరి ఆర్ద్రసమ్మేళనం సంభవించినప్పుడు ఒక గంభీరమైన ఉపలబ్ధి శరీరంలోని సమస్త సిరలలోనూ, స్నాయువులలోనూ అనుభూతమౌతుంది. అర్థాత్తూ—మనస్సుతోటి సహయోగంపొందిన శరీరానికి లభించే కృతార్థత అభిప్రేష

మేమీ కాదు. కాబట్టి యోగంలో భోగాన్ని ఆశించవలసిన అవసరంలేదు. యోగమే స్వయంగా ఒక సంపూర్ణభోగం.

ప్ర : ప్రేమానుభూతితోపాటు మనస్సు, శరీరంకూడా ప్రేమప్రాప్తిని సామాన్యంగా కోరుకుంటాయి. మళ్ళీ మనస్సు ఆత్మతో సహయోగం కలిగి వుండటమంటే మీ ఉద్దేశం ?

జ : సర్వసాధారణంగా మనస్సులో ఒక చిన్నభాగంమాత్రమే మనకు తెలుస్తూన్న కోరికలతోనూ, వాసనలతోనూ సంబద్ధమైవుంటుంది. ఇక మిగిలిన పెద్దభాగం దానివెనుక ఆత్మతో సంబద్ధమైవుంటుందని చెప్పవచ్చు. ఆత్మశబ్దం విజ్ఞానసమ్మతం కాదు; కాబట్టి దాన్నిగురించిన చర్చ వద్దు. ఈనాడు ఉపచేతనము, అవచేతనము అను పదాలు ప్రచలితమౌతున్నాయి. దైపీమనస్సు అంటూ ఏదో వున్నట్టు కొందరు ఊహిస్తున్నారు. ఏమైనాగానీ....ఈ పదాలన్నీ....మనసుకంటేచాలగొప్పదీ, మనస్సుయొక్క వశంలో లేనిదీ....ఏదోఒకటి ఉన్నట్టే సూచిస్తున్నవి. ఇంతకూ ఆ మనశ్శాస్త్రానికి సంబంధించిన గొడవల్లో జొరబడినందువల్ల మనకేమీ ప్రయోజనం లేదు. అందుచేత, ఇక్కడ మనం శ్రద్ధాపూర్వకంగా—మనకోరికలతో సంబద్ధమైయున్న మనస్సు, మనవ్యక్తిత్వంలోని చాలస్వల్పభాగంమాత్రమే—అని అంగీకరించుదాం. మనవ్యక్తిత్వంలో చాలభాగమూ— సారభాగమూ సహానుభూతి శీలమే; అంటే కోరికలకు, వాసనలకు వ్యతిరేకమైనది. సహానుభూతి ఆధారంగానే వాసన ప్రాణంపోసుకుంటుంది. మనం మనస్సును సహానుభూతియందు పరినిష్ఠితం చేసుకుంటే—మనస్సు ఆత్మతో సంయోగం పొందినదనే చెప్పవచ్చు. మామూలుగా మనస్సులోని చాలభాగం వెనుకవైపుకే ఆకర్షితమౌతూఉంటుంది; అందువల్ల మనం చెప్పుకొనే భోగంలో శరీరంతోపాటు మనస్సుయొక్క అతిస్వల్పభాగంమాత్రమే కలిసివస్తుంది. అందుచేత భోగంతో ప్రక్కనే ఒక ప్రతిక్రియకూడా వస్తూనేవుంటుంది. పైకి తెలిసో, తెలియకో ఒక అపరాధభావంకూడా ప్రక్కనే వస్తూవుండటం కద్దు. ఎందువల్లనంటే—లోలోపల దానికి సంపూర్ణమైన ఆత్మసమర్థన ఉండదు.

ప్ర : మనస్సు ఆత్మతో కలిసి చరిస్తూ, శరీరంలో ఏవిధమైన కోరికా ఉత్పన్నంకాకుండాఉండే స్థితి వ్యక్తికి ఎలా ప్రాప్తిస్తుంది ?

జ : ప్రేమ ఘనిష్ఠమౌతున్నకొద్దీ ఈ స్థితి సహజంగానే వచ్చేస్తుంది. ప్రేమలో బాధాకరమైనది అహంకారం. కాబట్టి అహంకారాన్ని జయించేందుకు మనం చేసే ప్రయత్నం—ఆస్థితికి చేరుకోటానికి సహాయకారి కాగలదని చెప్పవచ్చు. అహంకారాన్ని ఎలా జయించాలి ? అందుకు సాధనోపాయం ఏమిటి ? వీటికి సమాధానాలు....అనేకమంది పురుషుల అనుభవాల్ని వివరిస్తున్న శాస్త్రాలే చెబుతాయి. నామటుకునాకు ఆవిషయంలో అ ఆ లు కూడా తెలియవు. స్వయంగా ప్రేమే మన కన్నిసంగతులూ ప్రబోధిస్తుందని నా విశ్వాసం. పరిపూర్ణమైన శ్రద్ధతో మానవుడు ఆత్మార్పణంచేసుకుంటే భగవంతుని శరణు పొందగలడని నేననుకుంటున్నాను. అప్పుడతనికి అహంకారంనుంచి సునాయాసంగా విడుదల లభిస్తుంది. శిశువు ఏవిధంగా మాతృవాత్సల్యాన్ని పొందగలుగుతున్నదో, అలాగే మనంకూడా నితాంత శరణాగతులమై భగవంతుడిని పొందాలి. కాని ఆవిషయాల్లో నాకు ప్రవేశంలేదు: ఎందువల్లనంటే అందుకు తగినంతఅధికమైన అనుభూతి లేదనుకుంటాను. నా అనుభవంనుంచి నేను చెప్పగలిగిందేమంటే — వాంఛ అనేది లోపల సందడిచేస్తూ, నేను దేన్ని అయినా పొందాలి—అనుకున్నప్పుడు పొందనేలేకపోయాను. వాంఛ ఆగిపోయి, సహానుభూతిమాత్రమే మిగిలివున్నప్పుడు అనాయాసంగా సాన్నిధ్యాన్నీ, ఉపలబ్ధినీ అనుభవించాను. అందువల్ల నేనుతెలుసుకున్నాను : 'అసలైనప్రాప్తి శరీరంద్వారానూకాదు, శరీరప్రాప్తికాదు' అని అంతస్థమైన వ్యథలోనే వ్యక్తియొక్క అసలైన ఆత్మ ఉన్నది; దాన్నే వెతుక్కుంటుంది సహానుభూతి. కోరిక పైపైనే సందడిస్తూఉంటుంది. ఏకోరికలోనైతే మన కర్తృత్వం ఉండదో అది సమగ్రంగా రూపొందుతుంది. అది విషాదంతో సమ్మిళితమై ఒకరకంగా సహానుభూతిగానే మారుతుంది—అని నాకు తోస్తున్నది. ఇందులో శరీరం వ్యగ్రం కావలసిన అవసరం ఉండదు.

ప్ర : సంపూర్ణమైన భక్తితో ఆత్మార్పణంచేసుకోటమంటే మీ

ఉద్దేశం? మన జీవనప్రవాహం ఎలా వెళుతూంటే అలాగే దానితోపాటు సాగిపోతూవుండటమేనా?....మానసికంగా, శారీరకంగా కూడా?

జ: ఔను. కాలగతితోపాటు మానవుడు తత్సముడై సాగిపోవటం కంటే మించిన గొప్పసంగతి మరేముంది? ఈ యవస్థ....ఇంగ్లీషులో Drift ....(కొట్టుకుపోవటం) అంటారే, దానికి పూర్తిగా భిన్నమైన అవస్థ ఇది. క్షణంతో (కాలంతో)పాటు తద్గతమైనదే శాశ్వతం. ఈ స్థితిని ఎకా యెకి ప్రవాహంతోపాటు కొట్టుకుపోవటంలాంటిదిగా అభివర్ణించేందుకు వీల్లేదు. ఎందువల్లనంటే — మనస్సునుంచి, దాని సూక్ష్మవ్యాపారంనుండి మనిషికి విముక్తిలేదు. వ్యక్తి ఒక ప్రవాహంలో కలసి పోతూంటే అతని స్వప్నాలు అందుకు పూర్తిగా వ్యతిరేకమైనదిశలోవెడుతూఉంటాయి. కోరిక అనేది ఎప్పుడూ అప్రాప్తిలోనే ఉంటుంది. ప్రాప్తితో సాగేది వ్యవహారమే. కోరిక అటువైపు వెళ్ళదు. కాబట్టి శ్రద్ధాన్విత జీవనస్థితి—మామూలుభాషలో మనం చెప్పుకునే 'ప్రవాహంలో కొట్టుకుపోవటం' వంటిది ఒక్కనాటికీ కానే కాదు. అక్కడ ఏమీ సడలిపోయివుండదు. అక్కడ వ్యక్తిత్వం స్ఖలితం కాదు; బాగా సంచితమై, సంఘటితమై వుంటుంది, జీవనప్రవాహంలో మనిషి చిందరవందరగా కొట్టుకుపోవటం స్వార్థంలోనే. నిస్వార్థుడైనప్పుడు నిశ్చలంగా సాగిపోతాడు. ప్రవాహంలో కలిసిపోతూనేవుంటాడు; కాని స్థితప్రజ్ఞుడులా కనిపిస్తాడు. శ్రద్ధ అనే లంగరు బిగించినతరువాత ఇక నతడు విచలితుడు కావలసిన అవసరంలేదు. సామాన్యంగా మనకు సంభ వించే ప్రేమావస్థనే చూడరాదూ! కంటికి నచ్చిన ఒక సౌందర్యం దర్శిస్తాం. ఆ సౌందర్యం కండ్లలో నిండా ఇమిడిపోతుంది. ఎక్కడచూచినా ఆ కన్ను లకు ఆ సౌందర్యమే గోచరిస్తుంది. ఇక ఆ కన్నులకు అక్కడా ఇక్కడా తిరుగాడవలసిన అవసరం ఉండదు; మరోచోట మోహపడవలసిన అవసరం ఉండదు. ఒక్కొక్కకన్ను పలుచోట్ల తచ్చాడుతూవుంటుంది. అంటే— ఆ కంటికి ఇంకా దర్శనం కాలేదన్నమాట; ఎవరూ వచ్చి అక్కడ స్థిరపడ లేదన్నమాట. ఎవరో ఒకరు వచ్చి స్థిరపడిపోయినతరువాత నిరాశ్రయంగా, దీనంగా,చంచలంగా తిరుగాడవలసిన అవసరమేముంటుంది? ప్రేమపొందటం అంటే సర్వంపొందటం అన్నమాటే. అర్థాత్తూ, ఆత్మార్పణ చేసుకోటం—

అంటే మళ్ళీ ఆత్మ. నెక్కడ కోల్పోతామోనన్నభయం లేకుండా నిర్భయులం కావటమన్నమాట.

ప్ర : ఆత్మార్పణచేసుకున్నాకూడా మనిషికి పూర్తిపరితృప్తి చేకూరక పోవచ్చు. ఒక స్త్రీ పెండ్లి లో తన్ను తాను పూర్తిగా భర్తకు సమర్పించుకో వచ్చు. కాని తరువాత మరోపురుషునిపై మనసు పోవచ్చు. ఇలాగ అవసర మనితోచినప్పుడెల్లా తన్ను తాను సమర్పించుకుంటూ వెడుతూండవలసిన దేనా ? అదేనా పరిపూర్ణప్రేమోపలబ్ధికి మార్గం ?

జ : విసర్జన సంపూర్ణం అయితే, ఒక వ్యక్తి (ఉపలక్ష్యం) ద్వారానే జరిగినప్పటికీ, అది నిల్చివుండదు. భగవంతునిదగ్గరకే వెళ్ళి చేరుకుంటుంది. అందుచేతనే భర్తకు ఇచ్చుకున్నతర్వాతకూడా ఇంకా భార్యదగ్గర అర్ఘ్యం మిగిలేవుంటున్నది. భర్తద్వారానే భార్య తన సంపూర్ణతను పొందజాలదు. స్త్రీకి భర్త ఒక ద్వారంలాంటివాడని చెప్పాలి, ఆ ద్వారంగుండా ఆమెకు మిగతాప్రపంచంతో, విశ్వంతో సంబంధం వృద్ధిచెందుతుంది, వ్యాప్త మౌతుంది. పతియందే ఆమె బద్ధురాలైవుంటే వివాహం ఆమెకొక కారా గారతుల్యమే ఔతుంది. గృహస్థాశ్రమం ఒక కారాగారం కాదు; అది ఒక ముక్తిద్వారం. కుమారి తన కౌమార్యమును సమర్పించుకుని పత్ని ఔతు న్నది. అనగా తన్ను తాను భర్తకు అప్పజెప్పుకుని పత్నీత్వమును ధరిం చింది. ఆ విధంగా తన కౌమార్యశీలమును మరింకెవరికీ ఇచ్చుకునే స్వాతం త్ర్యమును ఆమె కోల్పోయిందనే అర్థం. తన్ను తాను అప్పగించేసుకున్న తర్వాత ఇంకా ఆమెకు కష్టమేమీఉండనక్కర్లేదు. అలా అప్పగించేసుకొన టంలోనుంచి వ్యభిచారమని వచింపబడేటువంటి ఆచారం రానేరదు. కాని స్త్రీ కేవలం స్త్రీయేకాదు. తానుకూడా ఒక వ్యక్తి; ఆత్మవంతురాలు. భార్య భర్తకు చెందిన వస్తువే. కాని ఆమెలోని ఆత్మ పరమాత్మసొత్తు. ఈ అర్థంలో భగ వంతుని శరణ్యంలోనే ఆత్మార్పణ సంపూర్ణమౌతుంది. 'ఇక్కడ భగ వంతుని ప్రసక్తి ఎందుకు ?' అనే ప్రశ్న అడగబోకు. మన సర్వస్వమూ హోమంచేసుకోవలసింది ఆ భగవంతునికే. ఆ భగవంతుడే ఆ హోమ్యా నికి ఆత్మసాయుజ్యం ఇస్తాడు. మన హోమాన్ని మనం సరిగా అర్థంచేసుకుంటే—ఆ యాహూతి ఎవరికి భోగం ఔతున్నదో అతడు భగ

వంతుడు కాదని భావించేందుకు అవకాశం ఉండదు. ఎవరైతే తమ్ము తాము సమర్పించేసుకున్నారో వారికి అన్నికష్టాల్నీ దాటిపోగలమార్గం లభిస్తుం దనే నా నమ్మకం.

ప్ర : ఆత్మార్పణతోపాటు ఆకాంక్షకూడా వుంటుంది. ఈ ఆకాంక్ష పూర్తికి ఒక గృహిణి పరపురుషునితో కలిసి ఎంతవరకు స్వతంత్రించవచ్చు?

జ : ఆకాంక్ష అంటే భోగాకాంక్షేనా ? భోగాకాంక్షకోసం పరిగ్రహించే స్వాతంత్ర్యం బంధనాన్నే కల్పిస్తుంది. అటువంటి స్వేచ్ఛను సమర్థించే ప్రశ్నే లేదు. భోగతృప్తికి అవకాశంకల్పించేదే వివాహం అని చెప్పేట్టయితే ఆ సంస్కారం నిరర్థకం.వివాహసంస్థ సమాజానికి ఒకభూమి కను,వ్యవస్థను ప్రసాదిస్తుంది.భోగస్వాతంత్ర్యం అవ్యవస్థనే తెచ్చిపెడుతుంది. అందుచేత భోగస్వాతంత్రాన్ని సమర్థించేందుకు వీల్లేదు. కనుక....ఒకరి పొరపాట్లపట్ల మరొకరు సహానుభూతికలిగి వుంటూ, అట్టిపొరపాట్లకు అవకాశం ఇస్తూ సాగిపోవటమే....భార్యాభర్తల పరస్పరధర్మం. స్వభావం ఒక్కసారిగా బాగుపడదు. ఎవరి అడుగైనా కాస్త పైకి క్రిందికి పడితే అంతమాత్రాన మనం అధీరులం కావలసిన అవసరంలేదు. వైవాహిక జీవితం కారాగారనివాసంగా తయారుకాకూడదు. మనిషికి స్వతంత్రం ఇవ్వజాలని పరిస్థితి బంధనతుల్యమే ఔతుంది. భోగంలో మనిషి వికసించడు— అనే నా అభిప్రాయం. కనుకనే వివాహం భోగానికి ఒకహద్దును ఏర్పాటు చేస్తుంది. ఆ భోగాన్ని మినహాయిస్తే ఇక వైవాహికజీవితంలో మిగిలిన దంతా వ్యక్తి ఆత్మవికాసానికే దోహదకారి ఔతుంది.

ప్ర : వ్యక్తి తన్ను తాను వదలివేసుకుంటూ వెళ్ళవలసిందేనంటున్నారు మీరు. అందులో భోగస్వాతంత్ర్యంకూడా కలిసిలేదా ?

జ : నాఉద్దేశం ప్రకారం లేదు.

ప్ర : తన్ను తాను వదలివేసుకుంటూ వెళ్ళటమంటే మరి మీ అభిప్రాయం ఏమిటి ?

జ : భోగాకాంక్షలో మూలతః 'అహం' ఉన్నదని నాకు తోస్తున్నది.

తన్నుతాను వదలివేసుకొనటం అంటే ఈ అహాన్ని తొలగించుకోటమన్న మాట. ఆహాన్ని వదలుకోటం సామాన్యవిషయం కాదు; అంత తేలిగ్గా సాధ్యమయేదికాదు. కాబట్టి సర్వథా భోగమునుండి నివృత్తిపొందటం అన్న ప్రశ్నకూడా లేదిక్కడ. దాన్ని ఒక హద్దులో వుంచుకోనటమే చేయవలసిన పని. అటువంటి హద్దు మర్యాద. అది అసలైన స్వతంత్రానికి అవరోధం కాజాలదు; పైగా వికాసశీలమైన స్వాతంత్ర్యం ఆ మర్యాదను ఇచ్ఛాపూర్వకంగా స్వీకరిస్తూ ముందుకు సాగుతుంది.

ప్ర : అంటే—మీ ఉద్దేశం : వివాహం జరిగినప్పటికిన్నీ అహాన్ని త్యజించే సాధనలో అప్పుడప్పుడు భోగంకూడా అవసరంకావచ్చు....శరచ్చంద్రుని పాత్రలలో కనిపిస్తున్నట్టుగా.... అంతేనా?

జ : నీ ప్రశ్నను ఉదాహరణపూర్వకంగా కొంచెం విస్పష్టంచేయాలి. శరచ్చంద్రుని ఏ పాత్రనుగురించి....నీవనేది?

ప్ర : మీ 'త్యాగపత్ర'లో మృణాళి, 'శేషప్రశ్న'లోని కమల....నే నివ్వదలచుకున్న ఉదాహరణలు.

జ : 'త్యాగపత్ర'లోని మృణాళిగాని, 'శేషప్రశ్న'లోని కమలగాని స్పష్టమైన ఉదాహరణలు కావని నా ఉద్దేశం. ఎందువల్లనంటే—అక్కడ సమస్య భర్తద్వారా ఏర్పడినటువంటిది. వైవాహికమర్యాదను ఆయిద్దరిలో ఎవరున్నూ విడిచిపెట్టలేదు; అదే స్వయంగా వారిని విడిచిపెట్టేసింది. కాబట్టి ఆతరువాత వారు ప్రదర్శించిన ఆచరణను....వైవాహికమర్యాదను ప్రమాణంగాపెట్టుకుని వెలకట్టేందుకు ప్రయత్నించలేము. మృణాళిని భర్త ఇంట్లో నుంచి వెళ్ళగొడతాడు. ఆమె ఇక చచ్చిపోయినాసరే అతనికి చీకు చింత వుండదు. గృహస్థమర్యాద అనేది అన్నివిధాలా ఆమెమీదనుంచి తొలగింపబడింది. ఇక ఆమె పత్నికాదు; కేవలం ఒక వ్యక్తి, ఒక స్త్రీ; అంతే. శరత్‌బాబు కమలపాత్ర కూడా ఇంచుమించు ఇలాంటి అవస్థలోనే పడింది. భర్త ఆమెను వంచించుతాడు. అది సహిస్తూకూడా ఆమె అతనిసేవయందే నిమగ్నురాలై కాలంగడుపుతూఉంటుంది. చివరకొకనాడు స్పష్టంగా తెలిసిపోతుందామెకు : తానొక పరిత్యక్తనని. పరిత్యక్తయైన స్త్రీకి కేవలం చచ్చి

పోయేందుకుమాత్రమే అధికారం వున్నది అని నేనంగీకరించను. ఆమె తన భరణపోషణలకు భర్తపై దావావెయ్యటంకూడా ఒక గొప్పసంగతిగా నేను భావించను. ఒక స్త్రీని భర్త తనంతతానుగా స్వీకరించేందుకు ఇచ్ఛగించనప్పుడు ఆమె అతనిపై దావా వెయ్యటం ఆమెకేవిధంగాను శోభస్కరమని నేను భావించలేను. అటువంటి యవస్థలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని ఆధారంగా చేసుకుని, జీవితం కొంతవరకు ఉపయుక్తంకావించుకునేందుకు ఉద్యుక్తురాలైతే—అదొక పెద్ద దోషంగా మనం పరిగణించేందుకు వీల్లేదు. బహుశా మృణాళిని మీరు క్షమించలేరేమో. కాని కమలపైమాత్రం ఎట్టి దోషారోపణచేసేందుకూ అవకాశంలేదు. వైవాహికమర్యాదకు వివాహమే పరిధి; దాన్ని దాటి అది అవతల ఉండదు. అంటే—గృహిణులకు, సభర్తృకలకు ఉండే నియమమే పరిత్యక్తలవిషయంలోనూ, వితంతువుల విషయంలోనూకూడా అన్వయించదు.

ప్ర : మృణాళి, కమల చరిత్రలలోవలె....జీవితం ఉపయుక్తం కావించుకునేందుకుగాను భోగం అవసరమంటారా ? అది సమాజమర్యాదను ఉల్లంఘించినట్టుకాదా ?

జ : వివాహాన్నిమించిన సమాజమర్యాద ఇంకొకటి ఏమున్నది ? మృణాళి, కమల విషయంలో సమాజమర్యాదను తీసుకురావటం సంగతం కాదు. పోనీ వాళ్ళకుబదులు (కల్పనాగతమైన) ఒక ఆదర్శస్త్రీని ఉదాహరణంగా తీసుకున్నట్టయితే అక్కడ ఏ స్పష్టమైన మర్యాదరేఖా ఆధారంగా ఉండదు; అంటే వ్యక్తి తన పరిస్థితికి అనుగుణంగా తానే స్వయంగా సామంజస్యాన్ని సాధించుకోవాలి. మృణాళిగాని, కమలగాని నిర్బాధాకరమైన భోగాసక్తితోనే సాగిపోయినట్టు ఎక్కడా కనిపించదు. వైవాహిక నియమాలనుంచి వాళ్ళు బయటికి తొలగింపబడినారు. ఇక ఆ తరువాత వారు తమ సహానుభూతిని ఇవ్వకుండాగాని అథవా ప్రేమకు ప్రతిదానం యివ్వకుండాగాని, తమను తాము నిలువరించుకోలేకపోయారు. ఈ వ్యవహారాన్ని ఉద్దండమనీ, ఉచ్ఛృంఖలమనీ నేనుమాత్రం అనలేను. అందులో ఒక వినమ్రత ఉంది; ఒక దృఢత్వంకూడా ఉంటేఉండవచ్చు. పుస్తకం చదువుకుపోతూవుంటే మనకు 'అయ్యో' అనిపిస్తుంది; వాళ్ళవ్యవహారంపట్ల

మనకు సానుభూతే ఉత్పన్నమౌతుంది; మనలోని కాఠిన్యత తొలగి పోక తప్పనిసరి అవుతుంది. మనం సమున్నతభావసంపదలోనికి వెళ్ళిపోతాం. ఇలాజరిగితే లేఖకుడు సఫలతగాంచినట్టే.

ప్ర : సునీత గృహలక్ష్మి అయినాకూడా ఆమె హరిప్రసన్నునికి ఆత్మార్పణచేసుకునేందుకు ఉద్యుక్త అయింది. ఈ ఆచరణలో ఔచిత్య భంగం కాలేదని మీ రెలా సమర్థించగలరు ?

జ : సునీత ఆత్మసమర్పణచేసుకున్నదంటే – అది సూటిగా హరి ప్రసన్నునికా ? బహుశా కాదు. ఆమె కావించిన ఆ సమర్పణ ఎక్కువగా భర్తగారి ఆజ్ఞవల్లనే, ఆదేశంవల్లనే. భర్తయొక్క ఆజ్ఞవున్నామాత్రం స్త్రీ అంతవరకు వెళ్ళవచ్చునా ? అది సబబా ? అని ప్రశ్నించవచ్చు. కాని ప్రశ్నకు ఈ రూపం ఇచ్చేసరికి అసలు ప్రశ్నే మారిపోతుంది; అప్పుడు పాతివ్రత్యప్రసక్తి వస్తుంది; మర్యాదను ఉల్లంఘించటమన్న సంగతి పోతుంది.

ప్ర : మృణాళివలె ఇతర్ల ఆకాంక్షలను సిద్ధింపజేయటంకూడా సహానుభూతికిందికే వస్తుందా ? అటువంటి సహానుభూతి వైవాహికజీవితం అనుభవిస్తూన్న స్త్రీకి ఉండవచ్చునా ? —హరిప్రసన్నునియెడల సునీతకు ఉన్నట్టు ?

జ : ఆ విషయంలో ఇదమిద్ధమని ఒక నియమాన్ని ఎలా అవిష్కరించగలమో నాకు బోధపడటంలేదు. బహుశా ఇటువంటి సందర్భానికి అన్వయించే నియమం ఏదైనా ఏర్పరచటంకూడా సాధ్యంకాదనే అనుకుంటాను. ఇది సామాజికదృష్ట్యా నిర్ణీతం కావలసిన సమస్యకాదు. ఈ సమస్య ఆత్మికం; సామాజికంకాదు. దీన్ని పరిష్కరించుకోవలసింది స్వయంగా వ్యక్తే. మీరాబాయి తన భర్తయైన రాణాప్రేమను తాను పత్నీరూపంలో ఏ విధంగానూ స్వీకరించనేలేకపోయింది. అలాగని ఆమెకు భర్తయెడల సహానుభూతిలేదు—అనిచెప్పటం, ఆమెను సరిగా అర్థంచేసుకోలేకపోవటమే. ఆ విషయంలో ఆమెను అలాగ దృఢంగా అవిచలితనుగా ఉంచింది,

ఒక లోతైన ప్రేమబాధే. ఆ వ్యవహారం ,ఒక్క మీరాబాయికేతప్ప ఇంకెవరికీకూడా సమర్థనీయం కాకపోవచ్చు. ఈ నాటి మాత ఆనందమయిని గురించికూడా అలాగే చెపుతున్నారు. ఆమె తన్ను తాను భర్తకు సమర్పించుకోలేకపోయింది. కాని అందుకు కారణం ఆమెలోని స్వాభిమానం అని తోచదు; ఒకానొక వివశత అనే స్ఫురిస్తుంది. ఆ ఘోరవివశతయొక్క ప్రకాశంలో ఎటువంటి నియమనిర్ణయాలుగాని నిలువలేవు; మరలిపోవలసిందే. మృణాళీ సునీతల విషయమై రెండువిధాలుగా చెప్పవచ్చు. కాని.... తనను తాను సమర్పించుకొనలేకపోవటంగాని, తనను తప్పించుకొనే అభిప్రాయంగాని లేకపోతే ఆ వ్యవహారాన్ని అంతగా వ్యతిరేకించవలసిన అవసరం మరొకరికి ఉండనక్కర్లేదనే అనిపిస్తుంది నాకు. అటువంటి సంఘటన ప్రతివారిజీవితంలోనూ వివాహోత్పరమో, వివాహోత్పూర్వమో ఉద్భవించవచ్చుననే నా నమ్మిక. అటువంటప్పుడు తమ గుణాన్నీ, స్వభావాన్నీబట్టి ఆ యా వ్యక్తులనిర్ణయం ఉంటుంది. వ్యక్తిగతమైన అభిరుచుల్నిబట్టి నిర్ణయించే అధికారాన్నికూడా నిషేధించే శబ్దాలు కొన్ని మన శాస్త్రాల్లో ఉన్నవి. అందొక్కటి 'పితౄణం' అనేది. అంటే— భోగంయెడల అభిరుచి ఏమాత్రమూ లేకనేపోవచ్చు. కాని కర్తవ్యదృష్ట్యా సంతానసృష్టి అవశ్యకం; అది సామాజికఋణం. ఇంతకూ గ్రహించదగిన అంశం ఏమంటే— తన ఇంద్రియవాసన గర్హనీయమని భావించి ఒకవ్యక్తి తన్ను తాను నిగ్రహించుకుని వుండవచ్చు; కాని మరొకరి ఇంద్రియవాసనపట్ల అదేవిధంగా అవజ్ఞాశీలుడై ప్రవర్తించటం సముచితంకాదు. ఇట్టి పరిస్థితులలో ప్రతివ్యక్తి విభిన్నతలను సమన్వయపరచుకుంటూ వెళ్ళాలి. ప్రతిసంఘటనలోనూ ఈ సమన్వయరేఖ ఎక్కడ ఉండాలో ముందే నిర్ణయించటం కష్టం.

ప్ర : ఇతరుల ఇంద్రియవాసనపట్ల అవజ్ఞాశీలురై ప్రవర్తించరాదని మీరే చెబుతున్నారు. ఆమాట అంగీకరిస్తే—మీరాబాయి భర్తయెడల చూపిన ప్రవర్తనను మీ రెలా సమర్థించగలరు ? ఆమెప్రేమ చాల ఘనిష్ఠమైనదని—బహుశా మీరు చెప్పవచ్చు. పోనీ, అలా అనుకున్నా ఆమె తన్ను తాను భర్తకు ఇంకా ఎక్కువగా సమర్పణచేసుకోవలిసేవుంటుందే !

జ : మీరాబాయి రాణా ప్రేమను అవజ్ఞచేసినట్టుగానే అంగీకరించేట్టయితే....ఆమెయెడల మనకు శ్రద్ధాభావం ఉండటం కష్టమే. నేనలా అంగీకరించలేను. పైగా ఆమెకు రాణాపట్ల మిక్కిలి ఆర్ద్రమైన సంవేదన ఉన్నదనే నేను నమ్ముతున్నాను. 'ఆయన నాకు భర్తయై నా బాహ్యరూపాన్నే వాంఛిస్తారేం ? నా అంతరంగాన్ని స్వీకరించరేం ?'— అని భర్తనుండి ఆశించే అధికారం తనకు కలదనే ఆమె అనుకున్నది. ఆమెకు శ్రీకృష్ణునిపై అనన్యసాధారణమైన భక్తి కుదురుకుంది. ఆ భక్తితోపాటు ఆమె మనసులో ఏవిధమైన కాఠిన్యమూ నాకు కనిపించదు. ఆమెలో....తన్ను తాను (రాణాకు) సమర్పించుకోకూడదన్నభావంకన్నా తన్ను తాను సంపూర్తిగా ఇచ్చివేసుకోవాలన్న భావమే అధికం. ఆ సమర్పణవాంఛ....సర్వాంశతః సమర్పించివేసుకోవాలనే; కాబట్టి ఆమె శ్రీకృష్ణునికే—అంటే భగవంతునికే—చెందిపోయింది. ఇటువంటి భక్తివివశత ఆమెకు ...భర్తృవియోగినియై యుండగలశక్తిని ఎలా ప్రసాదించిందో అర్థంచేసుకోటం కష్టం కానక్కర్లేదు. ఇటువంటిసంఘటనల్లు అసంభవంకాదు, విరళమూకాదు.

ప్ర : తన అంతరంగాన్ని రాణాచేత స్వీకరింపజేసేందుకు....తాను రాణాకుచెందకుండా శ్రీకృష్ణునికే చెందిపోవాలన్నభావం మీరాబాయికి ఎందుకు కలుగవలసివచ్చింది ?

జ : అమె కృష్ణునికేచెందిపోవటంతో చివరకు నిజంగా రాణాకు అనుభవంకాలేదా : 'ఆమె తనకొాక గంభీరతరరూపంలో సంప్రాప్తమైనదని, ఇక తమమధ్య ఏవిధమైన వియోగమూ ఉండబో'దని ? చివరకు అంతా అయాక ఆ భార్యాభర్తలిరువురూ ఎంతోఘనిష్ఠమైన ఆత్మీయభావంతో ఒకరికొకరు దొరికేపోయారని నా విశ్వాసం. అటువంటి సంపూర్ణమైన ఉపలబ్ధి మరేయితరదంపతులకూ సంభవింపజాలదు. ప్రతికూలరూపంలో కృష్ణభక్తి మధ్యలో రావటం ఎలా సమర్థనీయమో ఇక్కడ స్పష్టపడుతున్నది.

ప్ర : అంటే మీ భావం— ఇతర్ల ఇంద్రియవాసనలను నిషేధిస్తూనే వారితో ఆత్మీయసంబంధాన్ని స్థాపించుకోవచ్చుననా ?

జ : ఔను. నిజమైన ఆత్మికసంబంధంకోసం పరస్పరమైన ఇంద్రియవాసలను నిషేధించుకోటం చాలవరకు అవసరమే. భార్యాభర్త లిరువురూ బ్రహ్మచర్యవ్రతం స్వీకరించటంవల్ల ...ఇంద్రియవాసనలను నిషేధించుకొనటంలో ఒకరొకరికి సాయపడుతూవుంటారు. ఈవిధంగా వారి మధ్య అధిన్నత, ఆత్మీయత క్రమేణా పెంపొందుతుంది. ఇటువంటి అభ్యాసము తనజీవితంలో అన్నింటినీ మించిన ఒక మధురానుభవం అని గాంధిజీ అనటంలో అదే ఉద్దేశం.

ప్ర : అయితే మరి జీవనవికాసానికి భోగం అవసరమని మీరే చెబుతున్నారుగా ! ఇతరుల ఇంద్రియవాసనలను పరితృప్తిపరిచేందుకు మనల్ని మనం సమర్పించుకోటాన్నికూడా సమర్థిస్తున్నారుగా !

జ : భోగం యోగానికి శత్రుస్థానంలోనిదిగా నేను పరిగణించలేను. యువావస్థకు బాల్యం శత్రువు కాదు. భోగాన్ని వొదులుకుని యోగాన్నిసాధిస్తా ననుకోటం వట్టి భ్రమ. అందుచేత భోగాన్ని నిరసించే, దూషించే ఎట్టి యోగసాధననూ నేను సమర్థించలేను. మీరాబాయి కృష్ణుని చేపట్టింది. అందులో స్వీకారమే ప్రధానం. ఇక ఆమె రాజాను నిరాకరించటమనేది పైపైన ప్రతీతమౌతున్నసంగతి. అసలు అటువంటి నిరాకరణవృత్తి మీరా బాయిలో లేనేలేదు. శ్రీకృష్ణునిపొందిన మీరాబాయిలో కొంచెం ఎక్కువ పరిమాణంలో ఆనందమే కనిపిస్తుంది; న్యూనత కనిపించదు. ఎక్కువను పొంది తక్కువను పోగొట్టుకుంటున్నామని భావించటం పొరపాటు. రేపు ఒక వెయ్యి పొందేందుకు ఇవాళ ఒక వంద ఖర్చుపెడతాం; దీన్ని ఒక వంద రూపాయల త్యాగం అనకూడదు; అధికంగా తొమ్మిదివందలరూపాయల ప్రాప్తి అనాలి. భోగయోగాలను నేను ఈదృష్టిలోనే పరిగణిస్తాను. భోగము నందు ఎల్లప్పుడూ అభావమే ఉంటుంది. యోగమునందు ఈ అభావం తొలగి పరిపూర్ణత వస్తుంది. ఈసామర్థ్యమంతా ఆత్మార్పణలో ఉంది. ఆత్మార్పణచేసుకోవలసింది ఆత్మకే. అక్కడ ఇంద్రియవాసనలను స్వీకరించవలసిన అవశ్యకత లేదు. మహోత్కృష్టమైన ప్రేమ తనలోనుంచే సంయోగాన్ని సృష్టించుకుంటుంది; అందువల్ల స్థూలవియోగం దానికి సహజంగా సహ్యమే ఔతుంది. వాసన వ్యక్తికి స్వకీయం కాదు, ఈవిషయాన్ని గుర్తెరుగగల

అంతర్దృష్టి స్వస్థప్రేమకు ఉంటుంది. ఇంద్రియవాసనలను అవజ్ఞాదృష్టితో చూడకూడదనటంలో—'అహంకారంతో కావింపబడిన అటువంటి అవజ్ఞ ఏవిధంగానూ గొప్పవస్తువేమీకాదు' అన్నభావాన్నే గ్రహించాలి. అది బ్రహ్మచర్యం—బ్రహ్మరూపమైనచర్య—కానేకాదు.

ప్ర : అవజ్ఞాపూర్వకంగా కాకుండా ఈ వాసనల చిక్కు వొదిలించుకోవలసిన అవసరం ఏర్పడినప్పుడు ఏమిచెయ్యాలి? అవజ్ఞచూపకూడదన్న ప్రయత్నంలో ఇతర్ల వాసనాపూర్తికోసమని మనల్ని మనం సమర్పించుకోటం సముచితమేనంటారా?

జ : వాసనకు చికిత్స అవతలవారి హఠంగాని, అభిమానంగాని కాజాలదు. అందుమూలాన వాసన దెబ్బతిని ఇంకా అధికమే ఔతుంది; ఆ విధంగా ఇంకా అది లోలోపల దాగా రాజుకుంటుంది. కనుక ఆఘాతంవల్ల అది సమసిపోగలదన్న నమ్మకం లేదు. అంటే....దానిముందు మనం తల వంచవలసిందేనని కాదు. అటువంటిసమయంలో సహానుభూతిని ఎక్కువగా దగ్గరవుంచుకోటం అవసరం. వాసనను వశంలోకి తెచ్చుకోగల మంత్రం సహానుభూతే.

ప్ర : సహానుభూతి అంటే—అవతలవారి కోరికను మన కోరికే అని మన్నించటం కాదా?

జ : కాదు. అలాగే మన్నించితీరవలసిన అవసరంలేదు. చాలవరకు మన కోరికలన్నీ పైపైవే; మన లోతైన అసలుతత్త్వంతో వాటికి సంబంధం ఉండదు. సహానుభూతి ఉత్తరోత్తరా అంతర్మనస్సువైపునకు వెడుతుంది. అది చాల శక్తివంతమైనది. అది వ్యక్తిలోని వ్యక్తిత్వాన్ని దుర్వాసనలతో కలిపిచూడదు. తత్ఫలితంగా దుర్జనునిలోకూడా అంతస్థుడైవుండే సజ్జనుని యెడలనే ప్రీతిగలిగి వుంటుంది; అతనిలో అంతస్థమైన సజ్జనత్వమే దానికి ప్రతీతమౌతూ వుంటుంది. అలాగే చూడగల సామర్థ్యం సహానుభూతికి వున్నది. పైకి కనిపిస్తూవుండే కోరికలూ, వాసనలే తద్గతవ్యక్తికాదు....ఈ

విషయాన్ని సహానుభూతి సహజంగా గుర్తించగలదు. కనుక ఇతర్ల దుర్వా సనలకు అవసరాన్నీ, అవకాశాన్నీ కల్పించవలసిన ఆవశ్యకత సహాను భూతికి ఉండనక్కర్లేదు. పైగా నిజమైన సహానుభూతి అటువంటి విషయ లాలసకు అవరోధాన్నే కల్పిస్తుంది.

ప్ర : ఇతర్ల దుర్వాసనలకు ప్రతిరోధప్రాయంగా ఉండదగిన సహానుభూతియొక్క రూపం ఎలావుంటుంది ?

జ : రోజూ మన జీవితంలో చూస్తూనేఉన్నాం కదా : బైట మరీ తుందురుకుగా, కజ్జాలకు తయారౌతూవుండేకుర్రవాడు....తనను ఎక్కువగా ప్రేమించే తల్లియెదుట మేకపిల్లలా అయిపోతాడు. విద్రోహి, ఉపద్రవ కరుడు అయిన పురుషుడు ఒక్కొక్కచోట కాతరుడు, వినమ్రుడుగానే వుంటాడు. ఎందువల్ల ? సహానుభూతి వికారాన్ని ఉపశమింపజేసి, వ్యక్తి లోని ప్రకృతభావాన్ని స్ఫూర్తివంతంచేస్తుంది. అహంకారం ఎదుటివాని వికారానికి ఒక సవాలుగానై దానికి అవాంఛనీయమైన ఉత్తేజనమునే కలి గిస్తుంది. సహానుభూతి అనేది ఎటువంటి పరిస్థితిలో ఎలా ప్రకటమౌతూ వుంటుందీ అనే విషయాన్ని నిర్ణయించటం కష్టం. దానిరూపం ఆర్ద్రిత కావచ్చు, నిర్మమతకూడా కావచ్చు.

ప్ర : ఆర్ద్రిత, నిర్మమత—ఈ రెంటిలోనూ ఎక్కువ ప్రభావశీల మైనది ఏది ? ఈ రెండురూపాల ప్రకటీకరణము స్త్రీ పురుషసంబంధాలలో ఏ విధంగా వుంటుంది ?

జ : చెప్పానుకదూ : ఒక నియమాన్ని నిర్ణయించి చెప్పటం కష్టం అని. ఆర్ద్రిత అతిశయించి, మించినప్పుడు నిర్మమతా రూపొందుతుంది. అలాంటిసందర్భంలో నిర్మమతవల్ల కలిగే ఆఘాతం అవతలివారిమీద చాల స్వల్పం; తనమీదే ఎక్కువ. రూపభేదాల్నిబట్టి సహానుభూతివల్లకలిగే ప్రభా వంలో తేడా ఏమీ వుండదు. ఈసందర్భంలో స్త్రీపురుషులిరువురూ ఒకటే. ఎందువల్లనంటే స్త్రీలనీ పురుషులనీ రూపాలు భిన్నం అయినా ఇరువురూ మానవవ్యక్తులేకదా ? ఈవిషయంలో వారిలో అంతరం లెక్కించవలసిన అవసరంలేదు.

ప్ర : స్త్రీపురుషుల సంబంధమునందు ఈ ఆర్ద్రత, నిర్మమత ఏ విధంగా ప్రకటమౌతాయి అని అడిగాను. అంటే—పురుషుని వాసనపట్ల స్త్రీయొక్క—స్త్రీవాసనపట్ల పురుషునియొక్క—సహానుభూతి, ఆర్ద్రరూపంలో గాని నిర్మమరూపంలోగాని విడివిడిగా ఏవిధంగా వ్యవరిస్తుంది ?—అని.

జ : నాకొక పరిచయస్తుడున్నాడు. అతనికొక మిత్రురాలు ఉండేది. ఆమెకోరికను అతడు మన్నించలేకపోయాడు. మరొకతెనెవతెనో వివాహం చేసుకున్నాడు. కాని అందువల్ల వారిద్దరి పరిచయమూ విచ్ఛిన్నం కాలేదు. ఇప్పటికీ పరిచయము సాగుతునేఉంది. కాని వారి పరిచయసంబంధంలో ఎక్కువ మిట్టపల్లాలు ఏర్పడవలసిన ఆవశ్యకత ఎక్కడా పొడసూపటం లేదు. ఆ మిత్రురాలుకూడా వివాహంచేసుకుంది. ఇటువంటిపరిస్థితిలో వారి సహానుభూతిభావము, తమ సంబంధమునకు ఉచితమైన సభ్యతామర్యాదలు పాటించవలెనన్న శ్రద్ధ—ఈరెండూ బాగా సమ్మిశ్రితములై, వారు ఒకరిపట్ల ఒకరు మెలగవలసిన విధానమొకటి నిర్ణయించుకుని వుండవచ్చు. ఆయిద్దరి మధ్య అసలు సమస్యే ఉత్పన్నం కాలేదనికాదు; అది అంత ఉత్కటంగా మాత్రం తయారుకాలేదు. కాని వారిలో ఏఒక్కరుగాని కాపట్యాన్ని, పట్టుదలను ఆశ్రయించినట్టయితే చిక్కే వచ్చేది; ఎవరో ఒకరు క్రూరంగా వ్యవహరించి పనిగడుపుకోటం జరగవచ్చు. కాని అలాగ ముందే ఒక నిర్ణయాన్ని నిర్ధారించకూడదు. తాత్కాలికభావమువనుసరించే వ్యక్తివ్యవహారం ఉంటుంది. వ్యవహారంలో కనిపించే మర్యాదకూ, హృదయంలోని సహానుభూతికీ మధ్యఏకాంచెమో గుంజాలాట తప్పదన్నట్టుగానే తోస్తుంది. మర్యాదను దృష్టిలోఉంచుకుని చూస్తే భావాలవ్యక్తీకరణరూపం కఠోరంగా వుంటుందనీ—సానుభూతిదృష్ట్యా చూస్తే ఆ రూపం ఆర్ద్రంగా వుంటుందనీ తోస్తుంది. మర్యాదాప్రసక్తివచ్చినప్పుడల్లా భారం ఎక్కువగా స్త్రీమీదనే. స్త్రీనుండే మర్యాద. కాబట్టి ఆమె నిర్మమురాలుగా ఉండే అవకాశం ఎక్కువ. స్త్రీయొక్క కామనపట్ల పురుషునికి కాఠిన్యం చాల తక్కువగానే వుంటుంది. పురుషుడు కాఠిన్యంవహించలేడుకూడాను. కాని ఈవిషయంలో ఏమాటా ఇదమిద్ధమని చెప్పేందుకు వీల్లేదని ఇదివరకే అన్నాను.

ప్ర : ఇతర్ల వాసనపట్ల మనం సహానుభూతిపూర్ణులమైవున్నాకూడా వారి మనస్సుకు దెబ్బ తగులుతున్నట్టే కనిపిస్తుంది. మరి దానికేమన్నా చికిత్స ఉన్నదంటారా ?

జ : వాసనకు ఏమాత్రమున్నూ దెబ్బతగలకుండా పూర్తిగా కాపాడటం బహుశా అసంభవం.

ప్ర : అవతలవారి మేలుకోసం తన్ను తాను పూర్తిగా విసర్జించుకుంటూ పోవటమే పూర్ణసహానుభూతి. అటువంటి అతిశయించిన సహానుభూతికి లోనై, ఇతర్ల భోగవాంఛను తృప్తిపరచబూనటంకూడా సంభవమేనా ? ఇందువల్ల వారి వాసన ఉపశమించటానికి ఎక్కువ దోహదం లభించగలదని మీరు అంగీకరించరా ? మీరు వ్రాసిన 'బీట్రిస్' అనే కథలో కొంతవరకు ఇదే తథ్యం ద్యోతకమవుతున్నదే ।

జ : అది చాల సున్నితమైన ప్రశ్న. నా 'బీట్రిస్' కథను వ్రాయబూనినప్పుడు చేతులు వొణుకుతూనే వ్రాశాను. ఇప్పటికీ నేను దానివిషయమై శంకిస్తూనేవున్నాను. అది ప్రమాదకరమైన క్షేత్రమే. మొత్తంమీద నేను చెప్పదలచింది ఏమంటే—సహానుభూతి చివరకు వ్యక్తిని పూర్తిగా ఖాళీచేసే విడిచిపెడుతుంది. అనగా సహానుభూతిప్రేరితమైన ఆచరణ ఎన్ని రకాలుగానైనా వుండవచ్చు. మహర్షియైన వ్యాసుడు శుక్రదానము చేయవలసి వచ్చింది; అది ధర్మయుక్తమే. శాస్త్రాలలో కానవచ్చే * 'నియోగము' ఈ విషయమునే దర్శింపజేస్తుంది. శివుడు పార్వతిని స్వీకరించాడంటే—తన అవసరంకోసంకాదు; ఆమె ఘోరతపస్సును చూచి ద్రవీభూతుడైనందువల్లనే. ఇటువంటి ఉదాహరణలు కనిపిస్తూ ఉండగా సహానుభూతిమీద మరో ధర్మాన్ని అంకుశంగా తీసుకువచ్చి పడవేయవలసిన అవసరంలేదు. సహానుభూతి స్వతస్సిద్ధమైన ఆత్మధర్మం.

---

* భర్త రోగిష్టి, నపుంసకుడు లేక మృతుడు అయిన స్థితిలో స్త్రీ మరదివల్ల లేక మరెవరైనా అన్యగోత్రజునిద్వారా సంతానముపొందే ప్రాచీనపద్ధతి—(మనుస్మృతి)

ప్ర : మీరిదివరకు—సహానుభూతిపూర్వకంగా ఇతర్లలోని వాసనలు తొలగిపోయేలాగు చెయ్యాలి అన్న పద్ధతిలో మాట్లాడేరు. ఈ ఆదేశం.... ఇప్పుడు మీరు చెప్పినమాటవల్ల ఖండితమౌతున్నది? దీనిని మీరు ఎలా సమన్వయం చేస్తారు?

జ : సహానుభూతి పరమధర్మం. దానికి ఆదేశనిర్దేశాలు మరింకెక్కడి నుంచి రావాలి? కాబట్టి 'ఎదురుగా కనిపిస్తున్న వాసనలవిషయమై ఏం చెయ్యాలి?'....అనే ప్రశ్నకు బైటనుంచి ఎవరు చెప్పాలి జవాబు? చివరకు నిర్ణయం చేయగల సత్తా ఆ సహానుభూతిచేతుల్లోనే వుంది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని గీతావాక్యం. ఇందులో అన్ని ధర్మాల్నీ విడిచిపెట్టడానికి సంసిద్ధం కమ్మనే ప్రబోధం ఉంది. ఇక్కడ 'ధర్మాలు' అంటే అంగీకృతములైన ఆదర్శాలు, సిద్ధాంతాలు అని అర్థం. ఇవన్నీకూడా వొదిలేసి శరణుపొందవలసింది శ్రీకృష్ణుడిని. కృష్ణుడు అనగా పరమచైతన్యం అన్నమాట. అంటే శుద్ధజీవనానుభూతిని, సర్వము వెరలు సహానుభూతిని కలిగివుండాలని ఆశయం. కనుక నేను చెప్పదలచు కున్నదేమంటే—పరమయోగీశ్వరుడైన కృష్ణుని లీలలకు ఎటువంటి హద్దులూకూడా ఉండజాలవు.

ప్ర : కాని ఇలా సహానుభూతిచూపేయత్నంలో ఆ మనిషే స్వయంగా వాసనాగ్రస్తుడుకాగలడనీ, ఇతర్లదుర్వాసనలకుకూడ ప్రోత్సాహమే కలిగిస్తాడనీ భయపడటానికి తావుంది ఒకవంక భోగం, మరోవంక అనాసక్తి—ఈరెంటికీ సామంజస్యం ఎలా కుదురుతుందీ?

జ : ఔను. అటువంటి భయానికి తావుఉంది. కాని ఏ మహనీయత నిర్భయాత్మకమని చెప్పగలం? అనాసక్తి నకారాత్మకమైన (negative) అవస్థ కాదు. ఖండరాయికి ఎవరిమీద ఆసక్తివుంటుంది? కాని అనాసక్తి యోగాన్ని నేర్చుకునేందుకెవరూ దానివద్దకుపోరు. అనాసక్తి ఒక ఆనంద హీనమైన అవస్థకాదు; బహుశా అది చరమానందపూర్ణమైన అవస్థే. భోగం తృప్తికోసమే కదూ! కాని తృప్తితరువాత తిరిగి తృష్ణ ఉంటున్నది. ఆ తృష్ణతరువాత ఘోరమైన వితృష్ణే.భోగసంబంధియైన ఆసక్తిలో ఆనందం

ఉన్నదనీ, యోగసంబంధియైన అనాసక్తిలో అదిలేదనీ—అదికాదు ఆ రెంటికీ గల అంతరం. భోగములోని ఆనందం ఛలము; యోగములోని ఆనందం సహజము. అదీ ఆరెంటికీగల అసలైన తేడా. కాబట్టి భోగంలోని మిథ్యాంశతప్ప మిగిలిన సత్యాంశ యావత్తూ యోగంలో సమాయత్తమై వుంటుందనికూడా చెప్పవచ్చు.

ప్ర: కాబట్టి—వ్యక్తిగనక అనాసక్తభావంకలవాడైతే అతని వాసనాప్రవృత్తులకు అవకాశం ఇచ్చినా ఇబ్బందివుండదనేగా మీ ఉద్దేశం?

జ: అసలు సమస్తవాసనల పూర్వరూపం భావన. భావన స్వస్థ వస్తువే. కాని అందులో వికారం వచ్చిపడేసరికి అది వాసనగా రూపాంతరం పొందుతుంది. భావనకు ధారాళంగా దారి దొరకక, అది అణగిమణగి యిరుకునపడినప్పుడు వికారం ఉత్పన్నమౌతుంది. అది అప్పుడు ఆత్మరక్షణ యందు ఉద్ధతమౌతుంది నిరాసక్తుడని చెప్పదగిన వ్యక్తి సమక్షంలో వాసన విముక్తమై స్వాస్థ్యాన్ని పొందగల అవకాశాన్ని కలిగివుంటుంది—ఏ అడ్డమూలేక సూర్యునికెదురుగా పడివున్న....నెమ్ము, దుర్వాసనాగల....ప్రదేశంవలె. ఎండ నెమ్మును పీల్చివేస్తుంది; దుర్గంధాన్ని మాయంచేస్తుంది; చీకటి నక్కడనుంచి వెళ్ళగొట్టేస్తుంది; ఇంకా నిరాసక్తపురుషుని సమక్షంలో కూడా వ్యక్తి వాసనావికారంఇరుకున పడకుండా, తిరిగి స్వాస్థ్యాన్ని పొందగలమార్గంవైపు మరలి, స్వేచ్ఛగా స్వస్థభావనారూపమును పొందగల అవకాశంఉంది. భావన వాసనగా రూపాంతరం పొందుతున్నదీఅంటే—అందుకు కారణం దమనం, అవమానం, లేక అందుకుసంబంధించిన భయంవల్ల— అనే .గుర్తుంచుకోవాలి. అనాసక్తుడైన వ్యక్తి ఇటువంటి అవమానం ఎన్నడూ కలిగించడు. అందుచేత అతనివల్ల వాసన అతృప్తమై ఉండవలసిన స్థితి ఎక్కువగా ఏర్పడదు.

# కామము - దాని సామాజికపరిణతి

ప్ర : భార్యాభర్తలసంబంధంలో వ్యక్తిగతమైనఅంశం మాత్రమే వారి వరకు పరిమితమైవుంటుందనీ, ఇక మిగిలినభాగం సమాజానికీ, ప్రపంచానికీ లభిస్తుందనీ మీ రన్నారు. ఇప్పుడు నాకొక ప్రశ్న అడగవలెననిపిస్తున్నది. ఆ వ్యక్తిగతమైన అంశం మాత్రం ఎందుకు మిగిలిపోవాలి ? వ్యక్తి తనవద్ద ఆ కొంచెంకూడా మిగుల్చుకోకుండానే సర్వాన్నీ ప్రపంచానికేచెందేలాగు ఎందుకు విసర్జించకూడదు ?

జ : సెక్స్ (Sex) అనబడేది—అంటే మైధునంఅన్నమాట—నిర్వైయక్తికభూమికపై సాధారణంగా సంభవమైఉండకూడదు. వైయక్తిక భూమికనుండి ఉత్తీర్ణమైన ప్రేమనే బ్రహ్మచర్యం అంటాం. వైయక్తిక మైన భూమిక ఉన్నంతవరకూ అది మైధునమే. సర్వంకూడా నిఖిల ప్రపంచానికే చెందిపోతూవున్నప్పుడు 'అహం-చర్య' సమాప్తమైపోయింది; ఇక మిగిలింది బ్రహ్మచర్యమే. ఈ యవస్థలో 'వివాహం' అను శబ్దం అసిద్ధమే. కనుకనే వ్యక్తిలో ఏదో వుంటుంది; అది ఇంచుమించు చివర వరకు ఉండేదే. అది నిర్వ్యాజమైన ప్రసన్నతతో ఒకరికి ఇచ్చేదికాదు. సంకోచంగా, వివశతాపూర్వకంగా ఇవ్వబడేదే. లోకవ్యవహారంలో అది ఒక్కచోటనే సీమితమై ఉండటం మంచిది. ఒక్కరిదగ్గరే నిల్చిపోవాలి. అయితే, నిజంగా భగవంతునికి ఆత్మార్పణచేసుకున్న వ్యక్తి తనలో ఏ కొంచెమునూ నిల్పియుంచుకోవలసిన అవసరమేలేదు. మీరాబాయి శ్రీ కృష్ణునికి ఆత్మార్పణం చేసుకుంది; అందులో ఎవరికిగాని, మాంసలత (శారీరికత) ఏమైనా తక్కువగా కనిపిస్తుందా ? ఈ యవస్థలో కామశక్తి (sex energy) రూపాంతరం (sublimation ) పొంది అతీంద్రియం ఔతుంది. ఈ రూపాంతరమునందు ఏదిన్నీ హ్రస్వంకాదు; పై పెచ్చు అన్నీ పరిపూర్ణములౌతాయి. వీలైనంతవరకు అహంకారాన్ని తొలగించుకోవలెననే చెప్పాలి. మైధునాచారమువట్ల మానవులమనస్సులో తప్పనిసరిగా నెలకొంటున్న సిగ్గు, జుగుప్స అనేవి ఆ విషయాన్నే నిర్దేశిస్తున్నవి.

ప్ర : మీరాబాయి ప్రేమసంబంధము అవ్యక్తముపట్ల అందుచేత అతీంద్రియత్వంసాధింపబడింది. కాని వ్యక్తముతో అతీంద్రియసంబంధం ఉండగలదా ? అటువంటి ఉదాహరణ మీరేదైనా ఇవ్వగలరా ?

జ : ఇంచుమించు అన్ని ఉదాహరణలూ దానికి సంబంధించినవే కాదా ? భార్య అంటే ఒక భర్తకు చెందినది. అట్లే భర్తకూడా ఒకభార్యకు చెందినవాడు. వారిద్దరికీ ఇక తతిమ్మా అందరిమీదా వుండే స్నేహం కొంచెం హెచ్చుతగ్గుగా అతీంద్రియమేకాదా ? వ్యక్తముతో ఇంద్రియ సంబంధం అంటే — అది తనలోనే మడిచి దాచియుంచుకోవలసినట్టిదే. 'వ్యక్తము' అంటే ఒక వస్తువుగాని, వ్యక్తిగాని; ఒక అంశము లేదా ఒక ఖండము అన్నమాట. అంశమునందు — అనగా వ్యక్తియందు — సంపూర్ణమునెడల ఒక వివశాత్మక సమగ్రసమర్పణభావసంయుతమైన కామన ఉన్నదీ అంటే — అది మరొక ఖండాన్ని (లేదా అంశమును) గ్రహించి తృప్తిపడజాలదు. కాబట్టి మీరాబాయిప్రేమించిన శ్రీకృష్ణుడు 'అవ్యక్తం' అయితే — వ్యక్తుడు శరీరధారి అయిన శ్రీకృష్ణునికి ఆత్మార్పణగావించుకుని, ఆ బలంతోనే రాధ అవ్యక్తపరమాత్మతో తత్సమావస్థను సాధించింది. ఆ ప్రేమలో శారీరకత స్వల్పంగా వుండవలసిన ఆవశ్యకతే మనకు గోచరించదు. కాని అందులో అతీంద్రియత్వం ఆధ్యాత్మికత్వంకూడా తక్కువగా యేమీ ఉండవు అని నా గట్టినమ్మకం.

ప్ర : ఇంద్రియదానం పరిమితంచేసుకోవలెనని మీరు చెబుతున్న దానినిబట్టి అసలు దానంచెయ్యకుండా ఉండటం ఇంకా మంచిదన్నభావాన్ని సమర్థిస్తున్నట్టేకదా ! మరి అటువంటప్పుడు దాన్ని ఖండఖండములు చేయకుండానే సూటిగా 'సంపూర్ణం'తోనే సంబంధం ఎందుకు స్థాపించుకోకూడదు ?

జ : ఔను, మంచిదే. కాని అటువంటిసందర్భాలు చాల అరుదు; ఇంచుమించు ఎక్కడా కనిపించేవి కావు; అందువల్ల అసంభవం అని చెప్పినా తప్పేమీలేదు. ప్రకృతిపట్ల, ప్రాణులపట్ల విముగ్ధులై, పరవశులై

తమ ఉనికినే మరచిపోయిన పురుషులు కొందరు మానవేతిహాసంలో మనకు కనిపించవచ్చు. కాని అటువంటి ఉదాహరణలు చెప్పుకుని ప్రయోజనం ఏమిటి ?

ప్ర : అది అసంభవం అని మీరెందుకు భావిస్తారు ?

జ : మనిషి పశువునుంచి వేర్పడుతూవున్న సమయాన బుద్ధిఅనేతత్త్వ మొకటిఅతనిలో మొలకెత్తింది. ఆ బుద్ధి సర్వథా ఆత్మయందే సమాహితమై వుండనంతవరకూ అహమూ, ఐంద్రియకత్వమూ ఉంటూనేఉంటాయి. కనుకనే మరొకఖండమునెడల తీవ్రమైన వాంఛ, లాలస ఉంటుంది. దాన్ని అతిక్రమించి సంపూర్ణమునందు సమర్పణగావించుకోటం సహజసాధ్యంకాదు: దుస్సాధ్యమే. కనుకనే మిధునసంబంధంనుండి చప్పున ఉత్తీర్ణులం కాలేక పోతున్నాం. నిరంతరసాధనద్వారా దాన్ని క్రమశః ఊర్జస్వం(sublimate) చేయగలుగుతాము.

ప్ర : దీనినిబట్టి సృష్టిరచనకు ఆధారభూతమైన స్త్రీపురుషసంబంధాన్ని మీరు హేయమైనదిగా భావిస్తున్నట్టే నేను అనుకోవచ్చునా ?

జ : కాదు. హేయమైనదిగా భావించవలసిన అవసరం లేదు. ఉన్న దాన్ని హేయమనే విశేషణం తగిలించకుండా అంగీకరించటమే చాలు. స్వకీయమైన ఉపయోగాన్ని పురస్కరించుకుని మనమే దానికి హేయత్వాన్ని ఆపాదిస్తున్నాం. కనుకనే వివాహమనేది ఒక ధార్మికసంస్కారం అయింది. అందులో మైథునవ్యాపారాన్ని స్వీకరిస్తున్నామన్నమాటే. ఈ స్వీకారమే మనలోని పాపభావాన్ని వినష్టంచేసివేస్తుంది. ఈ విధంగా శరీర సంబంధంకూడా ఉత్తరోత్తరా ఆత్మచైతన్యాన్ని శరీరస్థాయినుంచి పైకి తీసుకుపోవటంలో సహాయకారి ఔతుంది.

ఇంకా లోతుకు వెడితే మరొకవిషయంకూడా బైటపడుతుంది. సంభోగమునందు వ్యక్తియొక్క అహంకారానికి ఓటమిఉంది. ఆ సమయంలో అతనికేమీ తెలియదు. తన్ను తానే మరచిపోతాడు. ఒకరకంగా అతడా సమయాన స్వత్వహీనుడవుతున్నాడని చెప్పవచ్చు. అంటే తాను

అంటూ లేదు; ప్రకృతిచేతిలోని .ఒక ఉపకరణంగా మాత్రమే ఉన్నాడు. ఇలా ఆలోచించేట్లయితే శిశుసృష్టి మనిషిద్వారా జరగటంలేదు అని తేలుతుంది. తనకర్తృత్వం ఏదో అక్కడ వున్నట్లు మానవుడు భావించుకోవలసిన అవసరం ఏమీలేదు. పరమేశ్వరుని లీలకే సృష్టి అని పేరు. మనుష్యుని అహంలో సృజనశక్తి లేదు. కాబట్టి చైతన్యసృష్టిగనక కావలసివస్తే బుద్ధిగతమైన అహం పశువులలోవలె నిద్రాముద్రితమైవుంటుంది; లేదా మనిషిలోవలె తాత్కాలికంగా ఎక్కడో మునిగిపోయి విస్మృతిలో పడిపోతుంది; లేదా పరమయోగిపుంగవునిలోవలె సర్వథా విడివడి సమార్ద్రమై ప్రవహిస్తుంది. భోగానందంలోని పరాకాష్ఠవంటిదే బ్రహ్మానందం అని ఇదివరకు నేను చెప్పింది ఈదృష్టితోనే.

ప్ర : ప్రతిరకమైన కామనలోనూ వ్యక్తికి ఇంచుమించు ఈస్థితే—ఏమీ తెలియకపోవటం—కలుగుతుంది. మరి కేవలం కామప్రేరణలోనే పరమేశ్వరునియొక్క ఈవిధమైన లీలాచమత్కృతి గోచరించటానికి కారణం?

జ : కామం (సెక్స్) అంటే కామనకు భిన్నమైనవస్తువా అయితే? కామనయొక్క మూలరూపం కామమే, కాబట్టి వివిధకామనల అడుగున ఉండే ముఖ్యతత్త్వం కామప్రేరణే అని చెప్పవచ్చు.

ప్రతికామనలోనూ వ్యక్తి ఇలాగే తనను తాను మరచిపోయేట్లయితే ఇందులోవచ్చిన వైపరీత్యమేమున్నది? ఇంతకూ సారాంశం ఏమిటంటే— 'గుణాః గుణేషు వర్తంతే' గుణాలు గుణాలయందు ప్రవర్తమానములౌతుంటాయి; మనిషి తన అహమును పురస్కరించుకుని మధ్యలో రాగద్వేషాలను లేవదీస్తాడు; బంధనాన్ని, క్లేశాన్ని పుట్టించి, వ్యాపింపజేస్తాడు. చిట్టచివరకుమాత్రం కర్త తాను కాదనీ, భవితవ్యమునందు తాను కేవలం ఉపకరణప్రాయుడనుమాత్రమేననీ గుర్తించితీరుతాడు. అది గుర్తించిన తర్వాత చిక్కులనుండి బయటపడతాడు; కాని కర్మలనుంచి తప్పించుకునే అవకాశంమాత్రం లభించదు.

ప్ర : ఇదివరకొకసారి మిమ్మల్ని అడిగాను : 'మీరుకూడా ఫ్రాయిడ్ లాగే అన్ని కర్తవ్యాలకూ మూలం 'సెక్స్'నని అభిప్రాయపడుతున్నారా ?' అని. 'ఎట్టే, లేదు' అని జవాబు చెప్పారు మీరు. కాని మళ్ళీ ఇప్పుడు— వివిధకామనలకు అడుగున మూలతత్త్వం కామప్రేరణే అని చెబుతున్నారు. ఇది ఎలా పొసగుతుందీ ?

జ : మాటల్లో పైకి కనిపిస్తున్న వైరుధ్యానికి నీవు ఆందోళనపడకు. అసలు నీవనుకున్న వైరుధ్యం లేనేలేదు. అన్నింటికీ మూలం ఫ్రాయిడ్ కామమేనని ఆస్తికుడినైన నేనుకూడా ఎలా అంగీకరిస్తాను ? అన్నితత్వాలకూ మూలమై, ఈశ్వరుడన్న పేరుతో నిర్వచింపదగిన ఒక పరమతత్త్వాన్ని నేను అంగీకరిస్తాను. కామనకు మూలం కామమే. కాని ప్రాణిలోని కామనతోపాటు... అంత ప్రబలమైన, అంతకంటే ఎక్కువ ప్రబలమైన ఒక చేష్ట, ఒక వివశతకూడా ఉంటుంది. కామానికి ప్రతిస్పర్థియైన యజ్ఞం అంటాను నేను దాన్ని. కామంలో వ్యక్తి అమాంతం భోగాసక్తుడౌతాడు; యజ్ఞంలో తన్ను తాను విసర్జించుకుని విలుప్తుడై పోవాలని కోరుతాడు. జగద్వ్యాపారం ఈ రెండుచేష్టల ఘాత సంఘాతాలవల్ల సాగుతూంది. స్వార్థం, స్వాభిమానం, స్వీయాభివృద్ధికాంక్ష తోపాటు....మనలో ఎక్కడో ఉంటూన్న ఆ మూలపురుషునిలో....తన్ను తాను పూర్తిగా మాపుచేసుకుని, ఏమీమిగిల్చుకోకూడదన్న ఒక తీవ్ర వివశత ఉంటుంది. స్పర్థాపూర్వకమైన అహంకారాన్ని వెన్నంటే వస్తూంటుంది : అంతకంటె ఎంతో మౌలికమైన ప్రబలనిరహంకారం ఒకటి. అందుకోసమే మానవుడు....ధర్మంకోసం ప్రాణాలర్పించిన వీరుల్ని గౌరవించాలనీ, పూజించాలనీ తహతహపడుతూ వుంటాడు. మానవుడు అవతారపురుషులలో తన సంపూర్ణ సార్థకప్రతిబింబాన్ని చూచుకుంటున్నాడు. అందుచేతనే వారిని భక్తిశ్రద్ధలతో అర్చించే తన హక్కును ఏ విలువకూ వదలుకో జాలడు. అటువంటి ఆ యవతారపురుషులే ఆ యజ్ఞతత్వానికి చిహ్నాలు. అదే అంతిమతత్త్వం; అదే శాశ్వతతత్త్వం. కామము, కామనలు—అన్నీ అందులోనే సమాధిపొంది, తమ కృతార్థతను పొందవలె. ఇప్పుడు నా అభిప్రాయం నీకు బోధపడిందనుకుంటాను. కామమే అన్నింటికీ మూలమని

నేను ఒప్పుకుంటాను: కాని అన్నిటికన్నా ఆదితత్త్వం యజ్ఞం అని నా విశ్వాసం. యజ్ఞగుండంలో అగ్నిజ్వాల వుంటుంది; అలాగే పరమేశ్వరుని సృష్టియందు ప్రాణదాహినియైన కామజ్వాలఉంది. యజ్ఞగుండంలోని అగ్ని జ్వాలల దర్శనమాత్రాన్నే యజ్ఞశాంతి లభించదు. అలాగే కామాగ్నిజ్వాలల గుండా పరమాత్మతత్త్వము అసలు గోచరంకాదు, బుద్ధికి ఆ రహస్యం ఎంతకూ అందేదికాదు. నిష్కామత కామాన్ని ఎందుకు సృష్టించిందో; అద్వైతంలోనించి ద్వైతం ఎలా వచ్చిందో; నిర్గుణ, నిరాకార, నిష్కళంక తత్త్వంనుండి ఈ నానావిధాల కళంకం, కల్మషం, గుణాలు, అవగుణాలు, వర్ణ వివర్ణసమృద్ధి ఎందుకు పుట్టుకొచ్చాయో—ఇందుకు సమాధానం బహుశా బుద్ధికి ఏ నాటికీ దొరకదు. బుద్ధిద్వారా మనకు లభ్యమౌతున్నదీ—లభ్యమయేదీ నానాత్వమే. అందుచేతనే మూలతత్త్వమైన ఏకత్వమునందు శ్రద్ధకలిగియుండటం మనకు అనివార్యమైన అవసరం. కనుక ఆ ఏకత్వమునందే దృష్టిపెట్టుకుని వుండాలి; వినమ్రులమై; బుద్ధిని అక్కడే లగ్నంచేసుకోటానికి యత్నించాలి; తద్వారా అన్ని బంధనలనూ త్రెంచుకొనుటకు సమర్థులమైవుండాలి; అదే ఆస్తికత అంటేను.

ప్ర : ఆ తత్త్వంతో సంయోగంపొందుప్రయత్నంలో మార్గం వ్యక్తులకు ప్రకృత్యనుసారంగా కొందరికి సుగమంగానూ, కొందరికి దుర్గమంగానూ ఒకరికి దగ్గరత్రోవ, ఒకరికి దూరంత్రోవ ఏర్పాటైవుంటాయా ?

జ : మానవుల గుణగణాల్లోనూ, స్వభావంలోనూ అటువంటి తారతమ్యత స్పష్టంగా కనిపిస్తూనేవుంది. బుద్ధి ప్రమత్తమైవున్నప్పుడు కష్టం విపరీతంగానే ఉంటుంది. శ్రద్ధలేనిబుద్ధి స్వైరిణి ఔతుంది. అప్పుడది మిథ్యాచారమందు—అనగా భోగాచారమునందు—ప్రవృత్తమౌతుంది. మానవుడు శిశుతుల్యుడై ఆ యనలుతత్త్వాన్ని పొందవలసియుండగా—కావలసినంతకంటె అతడెక్కువ లౌకికపరుడుగా పెద్ద పెరిగితే అది చేతికి అందకూడా జారిపోతుంది. జీవితమంతాకూడా శిశువులాగే తటస్థుడుగా బ్రతుకగలిగితే అతడు తప్పకుండా భగవంతునిఒడిలో. చేరగలుగుతాడు. అటువంటివ్యక్తిలో కామం అనేది బహుశా జాగృతమేకాదు. అందుచేత

ఉపశమనంగురించిన ప్రశ్నేలేదు. ఉన్నంతవరకూమాత్రం దాన్ని అభిలాష లోనికి పరిణతిపొందించవలసిన ఆవశ్యకతవుంటుంది. కాబట్టి చాలవరకు సూటిగా గాక, సాధనద్వారానే ఆ పరమతత్వంతో సంబంధాన్ని పొంద వలసివుంటుంది.

ప్ర : కామనను అభిలాషలోనికి పరిణతి చెందించటం అంటే మీ ఉద్దేశం ?

జ : కామన అనగా ఒకవిధమైన లాగుడు; దాన్ని అవతలనుంచి ఏదో ఒక ఊరింపు పట్టేస్తుంది. అంటే_ఒకవైపు ఆకర్షణ, మరోవైపు అపకర్షణ. ఇదొకవిధమైనరాగం; దీన్ని పూరించేందుకు ద్వేషం రావలసే వుంటుంది. ఈవిధంగా రాగద్వేషాలనేవి, తృష్ణావితృష్ణలనేవి జోడుజోడు గానే సాగుతూవుంటాయి. ఇక అభిలాష అంటే నా ఉద్దేశం : భావము ఆదిలో స్వస్థవస్తువు. అందులోనికి చంచలత్వం వచ్చేసరికి అది తనకు విరుద్ధమైన భావంలోకి క్షణక్షణమూ పరిణతమౌతూ ఉంటుంది; అది తప్పదు. భావానికి ఇంకా అటువంటి చాంచల్యం ఏర్పడకుండావుండే స్థితికి సంబంధించినది అభిలాష అంటేను. కామనకు పొంగు, క్రుంగు ఉంటూం టాయి. పొంగుక్రుంగులరూపమే దానిది. ఇందుకుభిన్నంగా అభిలాషలో స్థైర్యం వుంటుంది. అభిలాష ఒక స్వస్థమైన భావం; అది ప్రతిక్రియాత్మకం కాదు. అందుచేతనే అభిలాషలో— ఒకటి పొందవలెననీ, చిక్కించుకోవలె ననీ—వ్యగ్రత వుండదు. ఆ పట్టుదల, అందుకోసమైన తాపం కామనలో తప్పకుండా ఉన్నాయి. కామన బంధము; అభిలాష ముక్తము. కామన యొక్క లక్ష్యము వ్యష్టి; అభిలాష ఉత్తరోత్తరా సమష్టివైపు ఉన్ముఖ మౌతుంది.

ప్ర : అభిలాష అంటే ఈవిధమైన అర్థం చెబుతున్నారు. కాబట్టి ఆ యభిలాషావస్థకు చేరుకోటమే చరమసిద్ధియని మీ యభిప్రాయమా ? లేక పోతే ఈ అభిలాషావస్థకు, అసలైన సిద్ధావస్థకూ భేదం ఏమైనా ఉన్నదా ?

జ : చరమసిద్ధి అనబోకు; చరమసాధన అను. చరమసిద్ధినిగురించి మనం ఏమీ నిర్వచించేందుకు వీల్లేదు. ఎందువల్లనంటే—అక్కడ సాధ

కుని స్థితి అభావం అయిపోతుంది. సాధకుడు, సాధ్యమూ — రెండూ ఒకటే అయిపోతారక్కడ. అందుచేత మన చర్చ వెళ్ళగలిగేది సిద్ధికి వేరైన స్థితి సాధకునికి ఉన్నంతవరకే. అట్టిస్థితిలో మాత్రమే సిద్ధికీ, సాధకునికి మధ్య ఒక స్వత్వం, మమత్వం, భక్తిభావం ఉండే అవకాశం ఉన్నది. అటు వంటి స్థితినే అభిలాషావస్థ అంటాం. అభిలాషశబ్దం నీకు స్థూలంగా తోచి నట్లయితే....పోనీ అభీప్స అను, భక్తి అను; లేదా శరణాగతభావం అను. శబ్దాన్ని పట్టుకుని మనం ప్రేలాడనక్కర్లేదు; భావాన్ని గుర్తించటం అవసరం.

ప్ర : అయితే కేవలం అభీప్సయే సాధనయందు సహాయకారి ఔతుం దనీ—సాధనయందు బుద్ధి ఆటంకప్రాయమేననీ—కాబట్టి నిర్బుద్ధునికే సాధన అధికంగా సులభసాధ్యం ఔతుందనీ—అంటారా ?

జ : బుద్ధి అంటూ మనలో వచ్చి కుదురుకున్నతర్వాత నిర్బుద్ధులం కావటమనేది అసంభవమే. కాబట్టి నిర్బుద్ధుడు అంటే జడబుద్ధిగలవాడనే అర్థం వస్తున్నది. చైతన్యాన్ని సాధించటంలో జడత్వం ఎలా సహాయకారి కాగలదు ? కాబట్టి నిర్బుద్ధుడు కావాలన్న ఆలోచనగాని, ఆ ప్రయత్నంగాని వ్యర్థం. బుద్ధిని సద్బుద్ధిగా, సంయతబుద్ధిగా చేసుకొనటమే కర్తవ్యం.

ప్ర : ఆ సత్తు, సంయమం ఎలా సాధ్యం ఔతాయి ?

జ : సత్తు, సంయమం అను శబ్దాల్లోనే స్ఫురిస్తున్నదికదా—అసత్తు వైపు, అసంయమనంవైపు ప్రవృత్తమయ్యే అవకాశం బుద్ధికి వున్నదని ? అసత్తును స్వీకరించకుండా బుద్ధిని కట్టుబాటుచెయ్యాలి; అసంయమనంవైపు ప్రవృత్తము కానీయరాదు. ఈవిధంగా సత్తు, సయమం సాధ్యం ఔతాయి.

ప్ర : అయితేమరి ఇది సత్తు అనీ,ఇది అసత్తు అనీ మనం గుర్తించ గలగటం బుద్ధిద్వారానేకదా ?

జ : కాదు. బుద్ధిద్వారా ఆ పని జరుగదు - జరుగనేరదు. అట్టి పరి జ్ఞానానికి ఆధారం ఇంకాలోతున ఉంది. అది ఆత్మగతమైనది; అందరికీ

అది సహజప్రాప్యం. దాన్నే అంతర్నాదము, అంతర్ధ్వని అంటాం. శ్రద్ధయొక్క నివాసస్థానం అక్కడే.

ప్ర : సత్తును శోధించుప్రయత్నంలోనైనా బుద్ధిసహాయకారి కాజాలదా? అయితే ఇంతకూ అది కేవలం ఒక నిరర్థకమైన వస్తువేనా? దాని వల్ల అన్నీ ప్రమాదాలేనా మనకు కలిగేది?

జ: ఉన్నవన్నీకూడా సాధనలో సాయపడేవే. అవి యిచ్చే సాయం ఏ రూపంలో—ఎంత ప్రమాణంలో వుంటున్నది అనేవిషయంలోనే ఇబ్బంది. కష్టం వున్నది; అందువల్లనే ఓర్పుకూడా వున్నది. శ్రద్ధఅనేది వివేకం ద్వారా తనకు తాను ప్రకటంకావలసివుంది. బుద్ధిలేకుండా వివేకం ఎలా సాధ్యం ఔతుంది? కాబట్టి దానితో మనకు ఎల్లప్పుడూ, అడుగడుగునా, తప్పనిసరిగా అవసరంవుంది. కాబట్టి ప్రమాదంకూడా ఎల్లప్పుడూ అడుగడుగునా ఉండేదే. అహంకృతమైనబుద్ధి అభిశాపమువంటిది. శ్రద్ధార్పితమైనబుద్ధి ఒక వరదానమువంటిది.

ప్ర : బుద్ధిని అణచియుంచుకోటంద్వారా భావన అవరుద్ధమౌతుందనీ, భావనాశీలత బుద్ధిని సంయతంగా ఉంచజాలదనీ, కాబట్టి అత్యంతమైన భావన, అత్యంతమైన బుద్ధి, ఈ రెండూకూడా కష్టదాయకములేననీ— అంతేనా మీ అభిప్రాయం?

జ : ఆ రెండూ కొంచెం అసమమైన తూకంలో ఉంచేనే వ్యక్తి రూపమైన ఈ జీవితమూ, ప్రపంచమున్నూ సంభవమౌతున్నాయి. ఈ రెండూ సమానతను, సర్వథా సమీకరణమును పొందినయవస్థనే ముక్తి అంటాం. అనగా, మనలోని ఆ రెంటికీ తరతమభేదం ఉండితీరుతుందన్నమాటే. బహుశా ఇదివరకే నేను చెప్పియున్నాను: అర్ధనారీశ్వరత్వము ఒక ఆదర్శము అని. అనగా అక్కడ స్త్రీపురుషులు భిన్నులు కారు; ఒకటిగా సమాహితమైనారు. కాబట్టి పురుషోచితములైన గుణములతోపాటు, స్త్రీయోచితములైన గుణములుకూడా ఎవరిలో పూర్ణత్వముపొందినవో వారే మానవ జాతియందు చిరకాలంగా ఆరాధ్యపురుషులు ఔతున్నారు. వారు వజ్రంవలె

మిక్కిలి కఠినులే; అయినా పువ్వువలె సుకుమారులుకూడాను. వారిలో దృప్త తేజము ఉంది; స్నిగ్ధమైన ఆర్ద్రితకూడా ఉంది. ఇలాకాకుండా మరోరక మయిన పరాక్రమవంతులు చరిత్రలో ఉన్నారు; విక్రమంతో, సాహసంతో, ధైర్యంతో కూడిన వారి కథలు వింటూంటే ఆశ్చర్యపోతాం; ముగ్ధులమై పోతాం. కాని వారిలో పౌరుషం చాలానేవున్నా స్త్రీత్వం అసలేలేదు. తత్ఫలి తంగా వారికి స్త్రీ ఒక సవాలుగా కనిపిస్తుంది; ఆమెసమక్షంలో వారు వివ శులైపోతారు; పరాజితులౌతారు. స్త్రీలవిషయంలోకూడా ఇదే సూత్రాన్ని అన్వయించి చూచుకోవచ్చు. కొందరుస్త్రీలలో సిగ్గు, సహాయాపేక్ష మోతాదు మించి వుంటుంది. సాధారణంగా ఇటువంటివాళ్లు—సంస్కారపూర్వకమైన ఉన్నతి ఏమీలేక, కేవలం శారీరకతమాత్రమే ప్రబలంగావుండే పురుషుల చేతుల్లోనే వెళ్ళి పడతారు. స్త్రీపురుషతత్త్వాలమధ్య ఒక అమోఘమైన ఆక ర్షణ వుంది; దాన్ని మనం సంఘర్షణ అన్నా అర్థం అదే. కాని ఎక్కడా శుద్ధస్త్రీతత్త్వం అనిగాని శుద్ధపురుషతత్వమనిగాని ఉండదు. కొంచెం హెచ్చుతగ్గుల్లో ఈ రెండుతత్వాలమిశ్రణమే కనిపిస్తూవుంటుంది. అందు వల్లనే ప్రపంచం సాగుతూంది, చిత్రవిచిత్రాలతో ఈ లీల శోభావంతంగా దృశ్యమానమౌతున్నది. భావన, బుద్ధి—ఈ రెండు మూలతః విరోధము కలవి కావు. ఆ రెండింటి ఉత్పత్తి ఒకచోటునుంచే. కాని వాటిలో ఒకరకమైన పోటీ, న్యూనాధికతారతమ్యము తయారౌతాయి. అవే మనజీవనానుభూతికి ప్రాతిపదిక. అలాకాకపోతే సచ్చిదానందస్వరూపమైన శుద్ధజీవనము మనకు అగోచరము, అతీతముగానే వుండిపోతుంది.

# సంయమఃము - సంతతి

ప్ర : భావనకు, బుద్ధికి గల ఈ తారతమ్యము కారణంగానే మాన వుడు అమర్యాదకరములైన ప్రేమసంబంధాల్ని ఏర్పరచుకుంటూ, వాటిని వొదిలేసుకుంటూ వివశాత్ముడవుతున్నాడా ?

జ : సమాజంలో మనకువుండే కర్తవ్యాల్ని పురస్కరించుకుని మర్యాద నిర్ణీతమైవుంది. కాని వ్యక్తి సామాజికుడు అయినంతమాత్రాన్నే తీరిపోదు. అతడు ఆత్మికుడుకూడాను. అంటే సమాజంతోవుండే సంబంధమే గాక, ఆత్మతోనూ అతనికి సంబంధంవుంది. అందుచేత ప్రేమకు, మర్యాదకు కొంచెం సంఘర్షణ తప్పనిసరిగా కలుగుతూనేవుంటుంది. భావమునకూ బుద్ధికీ సమీకరణము నూటికి నూరుపాళ్ళు సాధింపగలిగితే ఈ భవబాధ అంతరించినట్టే. అర్థాత్తూ ఈసాధన చిరంతనమైనది. సిద్ధి ప్రేమపరిపూర్ణత యందే. అక్కడ ద్వైతంలేదు. అనగా భావము బుద్ధినుండి వేరైనదిగా ఉండదు; ఆనందమునుండి మర్యాద దూరస్థముకాదు. కాని అటువంటి స్థితిని మనం ఎలా మాటల్లో చర్చించగలం ? కల్పనాపరిధిలో దాన్ని బంధించటం చాలకష్టమే. చర్చలో ద్వైతావస్థ తప్పదు; అక్కడ ద్వంద్వము, సంఘర్షణ ఉంటాయి, ఉండితీరాలి; దాని పద్ధతే అంత.

ప్ర : ప్రేమవిషయికంగా వ్యక్తిలో స్వేచ్ఛాప్రవృత్తి ఎంతగా కని పిస్తూవుంటుందో, ప్రేమపరిపూర్ణతాదారిద్ర్యమూ అంతఎక్కువగా ఉన్నట్టే-అనా మీ అభిప్రాయం ?

జ : ఔను. కుండ నిండలేదనటానికి తొణుకుదేష్టే నిదర్శనం. పైకి కనిపిస్తూవుండే స్వేచ్ఛాప్రవృత్తి....తప్పకుండా. ప్రేమపరిపూర్ణతయొక్క అభావాన్ని చూపుతున్నదనే చెప్పవచ్చు. ప్రేమపరిపూర్ణత రూఢములైవున్న విధివిధానాలనే ముసుగు కప్పుకుని క్రియావిహీనంగా కూర్చుండిపోతుందనీ చెప్పలేము. అది తీక్షణముగా, ఒకరకమైన క్రాంతికారకముగా ఉండవచ్చు;

కాని మామూలుగా ప్రచలితమైవున్న అర్థంలో 'స్వచ్ఛందమైనది' అని చెప్ప టానికి వీల్లేదు. అటువంటి ప్రేమోదాహరణ ఒకటి పాతమర్యాదలను అతి క్రమించటమే జరిగితే, క్రొత్తమర్యాదలను సృష్టిస్తుంది.

ప్ర : అటువంటి ప్రేమవృత్తిని సాధించుకోవలెనంటే—ఎవరి మీదికో ఒకరిమీదికి ప్రసృతమౌతూవుండే భావనలను తొణకనీయకుండా నిరోధించుకుంటూ ఉండవలెనా ?

జ : ఔను. మామూలుభాషలో చెప్పవలసివస్తే అదేమాట. అలాగే చెయ్యాలి. కాని 'నిరోధించటం' అన్నపదం నకారాత్మకమైనది(negative) ప్రేమలోతైనదే అయినట్టయితే — ఈ నిరోధించటం పైనుంచి అంకుశం పెట్టి పొడవటంలాగ కాకుండా, లోలోపల దానంతట అదే తన నియమాను సారం సాధింపబడినది ఔతుంది. ఘనిష్ఠమైన ప్రేమయందు పారుష్యం ఉండదు; బలాత్కృతి ఉండదు. పారుష్యం, బలాత్కృతి కూడదుసుమా అని బైటినుంచి జ్ఞాపకంచేస్తూ హెచ్చరికచెప్పవలసిన అవసరంలేదు. ప్రేమయొక్క ఘనిష్ఠతలోనే ఆ ఫలితం దానంతట అదే సంప్రాప్తం ఔతుంది. సంయమం అనేది ప్రేమలోనుంచే ఉపలబ్ధమౌతుంది; అది బైటినుంచి ఆరోపితం కానక్కర్లేదు. బైటినుంచి ఆరోపితమైన సంయమం ఉపయోగకారి ఔతుందా ? ఏమో, నాకుమాత్రం సంశయమే. అది నిరుప యోగిగా పరిణమించేట్టయితే నాకాశ్చర్యం కలుగదు.

ప్ర : ఏసంబంధంలోనూ ప్రేమ ప్రారంభంనుంచే ఘనిష్ఠంగా ఉండదు. కాగా సంయమం దానంతట అదే ఎలా సాధ్యం ఔతుంది ? కాబట్టి సిద్ధాంతరూపంలో వ్యక్తి ప్రేమఘనిష్ఠతను ఆదర్శంగా అంగీకరించి తన్ను తాను నిగ్రహించుకునేందుకు ప్రయత్నంచెయ్యగలడనుకుంటాను. అలా ప్రయత్నించటాన్ని మీరు ఒప్పుకుంటారా ?

జ : ఆc. అటువంటిప్రయత్నం తప్పకుండా చెయ్యవలసిందే. వివే కమునకు ఆధారం ఏమిటి మరి ? స్వయంవ్యాపకమైన ప్రేమే. బుద్ధిపూర్వ

కంగా, కర్తవ్యదృష్టితో, వివేకం అనే అంకుశం పుచ్చుకుని, సంయమాన్ని సాధించేందుకు ప్రయత్నించటం అనిష్టం అని . చెప్పజాలము. అటువంటి ప్రయత్నాన్ని నేను .వ్యతిరేకించను. కాని ఒక్కసంగతి జ్ఞాపకంపెట్టు కోవాలి : ఈ అన్నిప్రయత్నాలకూ ఆధారం ప్రేమే. అందుచేత ఆత్మసమర్ప ణం సంయమాన్నిమించిన ధర్మం. భక్తియందు నిమగ్నుడైనవానికి సంయ మం దానంతట అదే సహజంగా సుసాధ్యంఔతుంది; ఇక 'నేను సంయ మాన్ని సాధిస్తున్నాను' అనే స్వాభిమానం అతనిదగ్గర ఉండదు. ఈ వద్ధతే ఎక్కువ సంపూర్ణమైనది, ఫలకారి అని నా ఉద్దేశం.

ప్ర : ప్రేమద్వారా సమర్పణభావం ఉద్భవించవలెననీ, సమర్పణ ద్వారా సంయమం స్వయంగానే సిద్ధించుతుందనీ మీ రంటున్నారు. అటు వంటిప్రేమకు మీరు ఇచ్చే పరిభాష ఎట్టిది ? ప్రేమపరిణామాన్నిగురించి మనకొరకై భయపడటం స్వార్థప్రేమకు, ఇతర్లకొరకై భయపడటం ఆదర్శ ప్రేమకు ఉదాహరణగా చెప్పవచ్చునా ?

జ : ప్రేమలో భయానికి స్థానంలేదు.

ప్ర : అయితేమరి సంయమం దానంతట అదే సాధ్యం అయేటు వంటి ప్రేమ ఇతర్లవట్ల ఎలా వుంటుంది ? దానిరూవం ఎలాంటిదిగా వారికి అనుభూతమౌతుంది ?

జ : చెప్పానుకదా : అది భోగాన్ని ఆకాంక్షించేదికాదు. అందులో బలాత్కృతి ఉండదు. కాని అది ప్రేమయొక్క చరమావస్థ; ఆదర్శస్థితి. బ్రహ్మచర్యమే దాని రూవం. అది వ్యక్తిసంబంధికాదు; కాముకస్థితిలోకి మారే అవకాశం దానికిఉండదు. అది అతిసులభంగా మర్యాదాశీలమౌతుంది. అక్కడ భయానికి తావు లేనేలేదు. బహుశా ఇటువంటి ప్రేమ మానవోత్తర మైనదిగా నీవు భావిస్తున్నావేమో ! నేనుమాత్రం అలా అనుకోను. కాని, నిజమే; మానవునిలో కామంకూడా ఉన్నది ; కామనలూ ఉన్నాయి. అందు వల్లనే చిక్కులు వస్తున్నాయి. అతనిలో ఒక వట్టుదల, స్వత్వాధికారవాంఛ ఉంటాయి; అందువల్ల పెనుగులాట తప్పదు. దానిమూలాన వర్తనము,

నిషేధము అవసరములౌతున్నాయి. వాటివల్ల భయం ఉత్పన్నమౌతున్నది. ఇంతకూ ఈ విషయమై నీవు చెప్పదలుచుకున్నదేమిటి?

ప్ర : ఇప్పుడు మీరు చెప్పినదే నిజంగా సాధారణమానవుల సమస్య. ఈ పెనుగులాటలోనుంచి సార్థకతను ఆవిష్కరించేందుకు మార్గం ఏమిటి? ప్రేమికుడుగాని, ప్రేమికగాని సర్వథా ఆత్మసమర్పణ చేసుకోవలెనా లేక సంయమాన్ని అలవరచుకోవలెనా? అదీ నేను అడిగేది.

జ : తారకమార్గం భగవత్ప్రేమే. కామంవల్ల సంభవించే ఇతర కష్టాలనుంచికూడా కాపాడజాలినది ఆ భగవత్ప్రేమే. ఇద్దరువ్యక్తులమధ్య మైథునాత్మకమైన ప్రేమ ఆ యిద్దరిమధ్య సరైన సమాధానమును ఏర్పరించుటకు ఎప్పుడూ శక్తిమంతము కాజాలదు. అట్టిచోట ప్రణయం, కలహం తోడుగా సాగుతూనే ఉంటాయి. ప్రణయం కలహాన్నిగాని, కలహం ప్రణయాన్నిగాని అంతమొందించలేవు. తాత్కాలికంగామాత్రం ఒకదానికొకటి చోటిస్తూవుంటాయి. ఇద్దరి భోగసంబంధంలోనుంచి కలహం ఉపజాతం ఔతుంది. ఆ సమయంలో ద్వేషం, అసహ్యం తీవ్రమై ఉత్కటం అవుతాయి; ఇక వారిద్దరిమధ్య ప్రణయం అంతమొందినట్టే పైకి కనిపిస్తుంది. కాని ఆ మరుక్షణమందే పరస్పర గాఢాలింగనతత్పరులౌతారు. ఈ విధంగా 'సంపూర్ణము'ను త్రోసిరాజని, అంశము తన కెదురయ్యే చిక్కుల్ని పూర్తిగా పరిష్కరించుకోగలుగుతుందని నేను విశ్వసించలేను. అర్థాత్తూ ఇటువంటి చిక్కుల్లో మానవుడు అవతలివారిపట్ల తప్పులు ఆరోపించటం మానివేసి, తాను స్వయంగా తన కర్తవ్యాన్ని నిర్ణయించుకుని తత్పరినిష్ఠుడుకావాలి. అప్పుడే ఒక సవ్యమైన సమాధానం కుదురుతుంటుంది; అట్లు కుదిరిన సమాధానమే చిరస్థాయి.

ప్ర : ఆనందం, భోగం కావాలన్న ఆకాంక్ష మరీ ప్రబలంగా వున్నదనుకుందాం. ప్రతిక్షణమూ ఆ లోభుకుడు కనిపిస్తూనే ఉన్నదనుకుందాం. అటువంటప్పుడు మరి ప్రేమపాత్రమును దూరంచెయ్యటం ఆవశ్యకమేనంటారా?

జ : తప్పనిసరిమాత్రంకాదు. మనమెప్పుడూ అసత్యాన్ని ఆశ్రయించరాదు. మన ఆచరణలో అసత్యానికి తావేపుట్టనివిధంగా ప్రవర్తించాలి మనం. నీవు సూచించినస్థితిలో ప్రేమపాత్రను మరీ సమీపంగాతెచ్చుకోటము, లేదా దూరంగా త్యజించివెయ్యటము—ఈ రెండూ ఒప్పే కావచ్చు; లేదా రెండూ తప్పే కావచ్చు. ఈ ప్రశ్న ఎవరికివారు నిర్ణయించుకోవలసిందే. కాని ఎవరైనాసరే అసత్యానికిమాత్రం ఆశ్రయం ఇవ్వకూడదు. ఈ సందర్భంలో నేను ఈయగలిగిన స్పష్టనియమం అదీ.

ప్ర : అసత్యానికి ఆశ్రయంఇవ్వవలసిన అవశ్యకత లేకుండానే భార్యాభర్తలిరువురూ కలిసి కాపురంచేస్తూ, పరస్పరంకూడబలుక్కుని ఒక నిర్ణయానికి వచ్చినమీదటే ఎడమెడంగావుంటారు. అలా చెయ్యటం వుచితమేనంటారా ?

జ : ఉచితంకావచ్చుకూడా.

ప్ర : ఒకరికొకరు దూరమయేంతవరకే వారి మనసు వారి వశంలో ఉంటుంది. ఆతరువాత వాళ్ళమనస్సు వశం తప్పిపోవచ్చు. మళ్ళీ అటుపైపుకే లాగుతూ చంచలత్వాన్ని ప్రకటిస్తుంది. అటువంటప్పుడు దమనం అస్వాస్థ్యకరం కాదా ?

జ : అందుకనే 'కావచ్చుకూడా' అన్నాను. అసత్యం వచ్చి చొరబడినప్పుడే దమనం అస్వాస్థ్యకరం ఔతుంది. లేకపోతే అది తపస్సు అనిపించుకుంటుంది. తపస్సులోనుంచి తేజస్సు సంప్రాప్తిస్తుంది. దమనంలో అసత్యం చొరబడటం అంటే ఆనందంపాలు తక్కువై, నిషేధం అధికం కావటమన్నమాట. అట్టిస్థితిలో విశ్వాసపాత్రులమై మనం నిక్కచ్చిగా ఓటమిని అంగీకరించితీరవలసిందే. ఇంకా హఠపూర్వకంగా కాయికదమననమునే అంటిపెట్టుకుని వుండటంవల్ల లాభంకన్న హానియే ఎక్కువ. ఈనిర్ణయమెవరోచేసి మనకు చెప్పనక్కర్లేదు. భయమనేది ఏకాన్త అయినా తోచిందీ అంటే—ఆ సంయమంలో ఏదో అసత్యం వచ్చి సమ్మిళితం అయినట్లుగానే ఎంచవచ్చు. సంయమంలో నిర్భీకత వున్నంతవరకు—అది

స్వాశ్రితమైవున్నంతవరకు—అందులోఆంతరికఆనందభావంతొణుకుతూన్నంత వరకు అది మనకు బలమునే ప్రసాదిస్తుంది. ఇటువంటి సంయమంతో సరసనే వినమ్రతకూడా వుంటుంది. ఇలాకాని మరోవిధమైన పద్ధతిలో అహంకారం, ఆడంబరం ఉంటాయి; అందులో ఆత్మవంచన, పరవంచన రెండూ ఉంటాయి. కాబట్టి ఆపద్ధతి అనిష్టహేతువు; తద్వారా సాధింపబడిన కాయికపవిత్రత స్పృహణీయవస్తువేమీకాదు.

ప్ర : హఠపూర్వకమైన కాయికదమనాన్ని మీరింతగా వ్యతిరేకిస్తున్నారు. ఇటువంటి చిక్కు ఏర్పడినప్పుడు శరీరాన్ని పవిత్రంగా అట్టిపెట్టుకోటం ఉచితం కాదంటున్నారు. ఒక అవివాహితవ్యక్తికి, తల్లిదండ్రులు చేరదీసి ఆదరిస్తారన్న ఆశ లేదనుకుందాం; లేదా ఒక వివాహితవ్యక్తికి తన భార్యపట్ల లేదా తన భర్తపట్ల విశ్వాసఘాతం జరుగవచ్చునన్న భయం బాగా వుంటుంది; అప్పుడు వారేంచేయాలి? సమాజంలో వాళ్ళకు చిక్కులేర్పడకుండావుండేందుకు నిరోధసాధనను అలవరచుకోమని సలహాఇస్తారా?

జ : అంటే—భోగసంబంధం ఉండాలి; కాని అది పైకి పొక్కకుండా ఉండాలి అనా? అటువంటి సావకాశంపొందే విషయమై నా సలహా ఏమిటి?—అనా నీ ప్రశ్న?

ప్ర : ఔను. ఇంచుమించు అదే.

జ : అయితే నేనటువంటి అంశాన్ని ఎంతమాత్రమూ సమర్థించలేను. అది కపటాన్ని సమర్థించినట్టే ఔతుంది.

ప్ర : మరి అటువంటిపరిస్థితినుండి బైటపడేమార్గం మీరేంచెబుతారు? వ్యక్తి తన తల్లిదండ్రులను విరోధించి, భార్యను విరోధించి, తన ప్రేమపాత్రమును వివాహంద్వారా స్వీకరించి జీవితం కొనసాగించుకోవాలా? వైవాహికజీవితంల్లో నిరోధసాధనను అలవరచుకోటాన్నికూడా మీరు కపటప్రవర్తనే అంటారా?

జ : విరోధం పెట్టుకోవచ్చు: సంబంధాన్ని విచ్ఛేదంచేసుకోవచ్చు. కాని కపటప్రవర్తనమాత్రం వృద్ధిచెందించుకోరాదు. వైవాహికజీవితంలో

సంతాననియమనం లేక నిరోధం ప్రశ్న వేరు. నీవు చెప్పేది కృత్రిమ సాధనాలనుగురించి. స్వచ్ఛందమైన సంయమంద్వారా సాధింపబడిన సంతాన నిరోధంకూడా అనిష్టమేనని ఎలా చెప్పగలం? కాని కృత్రిమనియమాల్నీ వాటి ప్రచారాన్నీ నేను సమర్థించలేను. అటువంటి కృత్రిమనియమాలద్వారా ప్రయోజనం పొందిన వ్యక్తులు కొందరు ఉంచేఉండవచ్చు. కాని వాటిని విస్తారంగా ప్రచారంచేయటంవల్ల, అవలంబించటంవల్ల మంచి జరుగు తుందన్న ఆశ నాకేంలేదు; పైగా ఎక్కువ చెరుపే కలుగవచ్చునని భయ పడుతున్నాను.

ప్ర: వాటిప్రచారంవల్ల మంచికన్నా చెడే ఎక్కువ జరుగుతుం దంటారా?

జ: రోగానికి ఉపచారం చెయ్యాలి; ప్రచారం కాదు. ఉపచార రూపంలో అది ప్రయోజనకారి కావచ్చు; కాని ప్రచారఫలితం భోగాచార ప్రచారమే జరుగుతున్నది. అందువల్ల చాల హాని ఉంది. నిజంగా అంతా హానియే; లాభం నాకసలు కనిపించటంలేదు. సంతానం కావలసినంతగా లేక, తక్కువగా ఉన్న సంపన్నవర్గంలోనే ఆ సాధనలు ప్రచలితములై వున్నాయి. ఈవర్గీయులకు అన్నివిధాలా సాధనసంపత్తులున్నాయి; స్వాస్థ్యం ఉంది; రూపం ఉంది; నైపుణ్యంఉంది. వీరినుండి సమాజం చక్కని ఆరోగ్యవంతమైన సంతతిని ఆశించవచ్చు. కాని అటువంటివారే ఆ కృత్రిమసాధనలు అవలంబించి, తమ బాధ్యతనుండి విముఖులై, నిష్ఫల మైన ఉపభోగములందు ప్రవృత్తులౌతున్నారు. ఇందువల్ల జననాలసంఖ్యలో వస్తున్న పెద్ద మార్పేమీలేదు. కేవలం నైతికస్థాయిమాత్రం క్రిందికి దిగి పోతున్నది. ఈ పరిణామం కళ్ళయెదుట చూస్తూనేఉన్నాం. కాగా అటువంటి విస్తారప్రచారాన్ని నే నెలా సమర్థించగలను?

ప్ర: విస్తారంగా సంతానం పెరిగిపోతూ, ఆ బరువు మోయలేకుండా వున్న అసమర్థుల మంచికోసమే ఆ ప్రచారం సాగింపబడుతున్నది. వాళ్ళు అటువంటి కృత్రిమసాధనలను ఉపయోగించటం మీరు అంగీకరించరా?

జ : అటువంటి సలహా ఎవరోకొద్దిమందికిమాత్రం రోగోపచార ప్రాయంగా ఇవ్వవచ్చు. కాని లోకనాయకులే అటువంటి విధానాలు ప్రచారంచెయ్యటంగాని — ప్రభుత్వమే అందుకు పూనుకుని పనిచెయ్యటం గాని — సబబని నేననుకోను. సంతానబాహుళ్యము బీదవాళ్ళలోనే ఎక్కువ; అందుకు కారణం వారి దారిద్ర్యమేకదా ? ఈ దారిద్ర్యంమూలాన వారిజీవితం క్రుంగిపోతున్నది; బంధనతుల్యమౌతున్నది; రకరకాల లేమిడులవల్ల నీర సించిపోతున్నది. ఒక్క సంభోగమేతప్ప వాళ్ళకు ఇతరవిధములైన మనో వినోదమునకు అవకాశాలు లేనేలేవు. వాళ్ళ దారిద్ర్యాన్ని ఎలా పోగొడదామా అన్న ప్రశ్నను పట్టించుకోకుండా, పెచ్చుపెరుగుతూన్న ఈ జనసంఖ్య సమస్య పరిష్కారమౌతుందికదా అని కృత్రిమసాధనలను అమలువరచాలని ఆలోచించటం నిజంగా ఆత్మవంచనే. జనసంఖ్యసమస్య వ్యవస్థకు సంబంధించినది. సుసంఘటితమైన వ్యవస్థ ఉన్నప్పుడు అధిక జనసంఖ్య దేశానికి బలమే. వ్యవస్థ లేనేలేనప్పుడు, లేదా అది విషమంగా ఉన్నప్పుడు పెచ్చు పెరుగుతూన్న జనసంఖ్య ఇబ్బందులకే హేతువౌతుంది. ప్రతిమనుజునికి పొట్ట ఒక్కటే ఉన్నది; కాని చేతులు రెండున్నవి. ఈ విధంగా జనసంఖ్య రుణాత్మకం కాదు; ధనాత్మకమే. కాని మన సమాజవ్యవస్థ దూషితంగా తయారైతే అది రుణాత్మకమే ఔతుంది. అటువంటి వ్యవస్థలో....ఉత్పత్తి దారుడై సహాయపడవలసిన మనుజుడు కేవలం తిండిపోతుగా తయారై సమాజానికి బరువౌతాడు. బాధ కలిగిస్తాడు. ఈ విధమైన మన పరాజయ దృష్టే పెరుగుతున్న జనసంఖ్యను అలా పరిగణించి. కృత్రిమనిరోధాల ద్వారా రక్షణమార్గాలను వెతుక్కొంటున్నది. ఇది సక్రమమైన దృక్పథం కాదు. అటువైపే ఉన్ముఖమై. ఒకానొక సభ్యత సాగివస్తున్నది ఈ నాడు, దాని ఆలోచనాపద్ధతే దోషభూయిష్ఠంగా ఉంది. ఈ సభ్యత పదార్థానికే ప్రాముఖ్యత ఇస్తున్నది. తదనుసారంగానే మనిషికి విలువకట్టాలని చూస్తున్నది. మనదగ్గర ఇంత ధాన్యం వుంది; ఇన్నిపొట్టలు వున్నాయి; ఒక్కొక్క పొట్టకు ఎక్కువధాన్యం లభించాలంటే పొట్టల సంఖ్యను తగ్గించేయాలి— ఇలాంటి అంకగణితప్రాభవంమీద మనం జీవనప్రమాణాన్ని ఉచ్చదశకు

తీసుకుపోవాలని చూస్తున్నాం; కాని నిజంగా ఆమేరకు మానవుడు నైతికంగా అధఃపతితుడౌతున్నాడు. పదార్థాన్ని ద్యోతకంచేసే డబ్బుయొక్క విలువ పెరుగుతున్నది; మనిషివిలువ తరిగిపోతున్నది. ఇటువంటిదశకే వచ్చిపడ్డాం మనం ఈ నాడు. ఇందులో ఎవరికీ సుఖశాంతులు కనిపించటం లేదు. అందరూ అలసి, సొలసి, వికలచిత్తులై వున్నారు. సమస్యలు అంతు లేకుండా ఉత్పన్నమౌతున్నాయి. మన ఆలోచనాపద్ధతి సమూలంగా మారి పోవలసిన అవసరం ఎంతైనావుంది. అంకగణితదృష్టి పోయి హార్దికదృష్టి ఏర్పడాలి. మానవవ్యక్తిని తీసుకుపోయి భౌతికపదార్థాల అడుగున పడ వేయకూడదు; ముందు మనిషికే ప్రాముఖ్యత ఇవ్వాలి. 'అందరు మానవులు ఉత్సాహంగా వుండాలి; పనిపాటల్లో నిమగ్నులు కావాలి' అనే ధోరణిలో అందుకు అనుగుణంగా వుండాలి మన ఆలోచనలు ప్రణాళికలు. ముప్పయి యెనిమిదికోట్లమంది ప్రజలు ఉత్సాహభరితులై ఉత్పత్తికార్యక్రమాల్లో కలిసి పనిచేస్తే సత్పరిణామం ఏమీ కలగదంటావా? కాని మనం యంత్రాల ద్వారా జోరుగా వస్తువుల్ని తయారుచేసి పడేస్తున్నాం; లక్షలాదిగా, కోట్లాదిగా మనుష్యులను పనిపాటలు లేకుండా నిరర్థకులనుగా వదలివేస్తున్నాం. ఇటువంటి వ్యవస్థ సుఖశాంతులను చేకూర్చజాలదు. వస్తువులు కుప్పలుకుప్పలుగా పెరిగిపోవచ్చు; మేడలు పైపైకి లేచిపోవచ్చు; అసంఖ్యాకంగా మోటార్లు ఏర్పడవచ్చు; తళతళలు, మిలమిలలు గోచరించవచ్చు; కాని ఇదంతా సుఖశాంతులను ప్రసాదించేవ్యవస్థ కాదు. మనిషికి దుఃఖాన్ని, విచారాన్ని, అలసటను మాత్రమే చేకూరుస్తుంది. మన ఆలోచనలన్నింటికీ మానవుడు కేంద్రంగా వుండాలి. ప్రణాళికలన్నీకూడా అక్కడి నుంచే బయలుదేరాలి. సంతానం కొద్దిగానే వుండాలనీ, కాబట్టి నిరోధించాలనీ—ఇంతకుమించిన ఆలోచనలు పదార్థదృష్టితోకూడిన ఆలోచనాపద్ధతికి స్ఫురించవు. కాని అది....గుర్రాన్ని వెనుక, బండిని ముందు ఉంచి, నడిపించాలనుకోవటమే. ఇటువంటివ్యవహారం పైకి అంతా సవ్యంగానేవున్నట్లు కనిపిస్తుంది. కాని అందువల్ల లభ్యమయ్యేది విపరీతపరిణామమే. మన దృక్పథాన్ని పూర్తిగా మార్చివేసుకోగల్గితే అప్పుడర్థమౌతుంది : సవ

మైన పరిష్కారమార్గం అది కానేకాదనీ; అది వట్టి భ్రమమాత్రమేననీ: ఇప్పుడు సమాజానికి భారంగా కనిపిస్తున్న ఆ సంతానమే, రెండుచేతులకూ పనిజెప్పుకుని కర్మక్షేత్రంలో ప్రవృత్తులైనారంటే ఉపయుక్తమనదగిన నాగరికతను సృష్టించగలరనిన్నీ. చేతికి పనిలేకపోతే, పొట్ట ఎలా నిండు తుందా అన్న భయం నానాటికి పెరుగుతూనే వుంటుంది. ఇక అటువంటి వారి పొట్టలు ఎలా నిండాలి అన్న సమస్యకు పరిష్కారం దొరకనే దొర కదు. ఇక అప్పుడు ఏదోవిధంగా పొడిచిగాని, నరికిగాని, కొన్ని పొట్టలను నిర్మూలించటమే ఒకేఒక ఉపాయంగా, పొడగట్టుతుంది. నిజంగా ఆలోచిస్తే అదొక ఉపాయమా ? కాదు. అది కేవలం మానవుని ఓటమి అన్నమాట; మనిషిలోని ప్రేమభావంయొక్క ఓటమి అన్నమాట; హింసాప్రవృత్తి యొక్క విజయం అన్నమాట. మానవజాతివికాసాన్ని మనం వెతు క్కోవలసింది ఆ దిక్కునకాదు; సర్వసమత్వము, పరస్పర సహకా రము, వృద్ధిచెందుతున్నప్పుడే, ఏ ఒక్కరిని తగ్గించవలసిన అవసరం లేకుండా అందర్నీ సమర్థులనుగా, సార్థకులనుగా తయారుచేసుకున్నప్పుడే జాతివికాసం.

ప్ర : వ్యవస్థ దోషభూయిష్ఠమని మీరంటున్నారు. వ్యక్తిస్వాధీనంలో ఉండదు వ్యవస్థ. కాబట్టి వ్యవస్థ మారకుండా అలాగే వున్నంతకాలమూ వ్యక్తిసమస్యకూడా అలాగే వుంటుంది. ఇద్దరుముగ్గురు సంతానం కలిగిన పిమ్మటనైనా ఇక బ్రహ్మచర్యం అవలంబిద్దాం అని వ్యక్తి తనకుతానై కోరుకుని సంయమాన్ని అలవరుచుకోటం సంభవంకావటంలేదు. సంతానం పెరుగుతూపోవటంవల్ల తల్లిదండ్రులకు భారం ఎక్కువౌతున్నది; పిల్లల్ని సరిగా పెంచలేకపోతున్నారు; అందువల్ల వారికి సముచితమైన శారీరక మానసిక పోషణ లభించటంలేదు. ఇటువంటి స్థితినుంచి సముద్ధరణకావా లంటే కృత్రిమసాధనలు కాకపోతే మరి ఉపాయాంతరం ఏమిటి ?

జ : వ్యక్తిగతమైనదాన్ని వ్యక్తిగతంగానే వదిలెయ్యండి. ఎటువంటి సందర్భంలో, ఎంతవరకు ఆ సలహా ఈయవచ్చునో ఇదివరకే చెప్పాను.

కాని మనం ఒక విస్పష్టమైన దృక్పథం కలిగివుండటం అవసరం. అప్పుడు ఔపచారికంగామాత్రమే ఉపయోగించవలసివున్నదానిని ప్రచారంచెయ్యవలె నన్న పట్టుదల మనకు ఉండదు. కృత్రిమపద్ధతుల్ని ప్రచారంచేస్తున్నామంటే- సమాజంలో ఏర్పడిన వ్యాధిని ఎదుర్కోకుండా తప్పించుకోజూస్తున్నామన్న మాట! ఇందువల్ల సమాజానికేమీ హితము చేకూరదు. 'సమాజవ్యవస్థలో వ్యక్తి వివశుడౌతున్నాడు' అన్నమాట కొంతవరకుమాత్రమే సత్యం. కాని సమాజవ్యవస్థ ఏనాడైనా దానంతట అదే మారిందా? దానిలో మార్పు వ్యక్తుల ప్రయత్నంద్వారానే సంభవిస్తుంది. కాబట్టి ప్రస్తుతంవున్న వ్యవస్థ దూషితం అని అనుకుంటూ చేతులు ముడిచిపెట్టుకుని కూర్చోరాదు. అప్పుడు మనకు అర్థంఅవుతుంది : ఈ కృత్రిమనిరోధంద్వారా ఎవరో కొద్దిమందికి మాత్రమే తాత్కాలికోపశాంతి కల్గించటంకంటే మరో అసలైన పెద్ద సమస్యను మనం ఎదుర్కోవలసినవున్నదని. దానపుణ్యాలకు సంబంధించిన కార్యక్రమాలు సాగుతూఉన్నవి; వాటివెనుక వ్యక్తిగతప్రేరణ ఉన్నది; అలాగే సంఘసంస్కర్తకూడా దానపుణ్యాలనే ప్రచారంచేసి సంతృప్తిపడి ఊరుకోలేదు. ఒక్కొకచోట అవి విరర్థకములు, అనర్థకములుకూడా కావచ్చు. ఈ కృత్రిమనిరోధంకూడా అటువంటిదే అనుకో. దానివెనుకవున్న ప్రేరణ—సమాజం బాగుపడాలన్న చింతన కాదు. అయా సందర్భాల్లో దాన్ని సమర్థింపజాలినది వ్యక్తిగతప్రేరణే. సంయమం ఎల్లప్పుడూ అందరికీ వశంలోవున్న వస్తువే. వ్యక్తులలో సామాజికతను పల్లవితంచేయజాలినది అదే. మర్యాదలను పాలించితీరవలెనన్న భావాన్ని వ్యక్తులలో కలుగజేయునది అదే. అది లేనినాడు సమాజం విచ్ఛిన్నం ఔతుంది; వ్యక్తులలో భోగాచారం, అనాచారం, నియమాతిక్రమణం వ్యాపిస్తాయి.

పిల్లలకు సముచితమైన శిక్షణవిషయమై నీవు ప్రస్తావించావు. ఈ భారం కుటుంబయజమానిదిగా భావింపబడుతున్నది. కాని మానవజీవితం వ్యాప్తము, ఘనిష్ఠము అవుతున్న రోజులివి. ఇప్పుడు కౌటుంబికసమస్యలను సమాజం తీసుకోవాలి; తీసుకుంటున్నది. ఒక బీదవాడు ఉంటాడు; అతని

ప్రస్తుతస్థితికి అతడు తన పూర్వజన్మలో కావించిన పాపాలు కారణం అని నిశ్చయించి, మరింకెవరూ బాధ్యులు కానట్టు ఊరుకుండలేము. పిల్లలకు సముచితమైన పోషణ, శిక్షణ లభించవలసిన బాధ్యత అందరిమీద వచ్చి పడుతున్నది. ప్రభుత్వం ఈబాధ్యతనుంచి తప్పించుకోలేదు; స్కూళ్ళలో కట్టవలసిన జీతాలభారంవల్ల పిల్లలశిక్షణ కుంటుబడిపోకుండావుండే సక్రమమైనవ్యవస్థ త్వరలోనే ఏర్పడవచ్చునని ఆశిస్తున్నాం. మన ఆలోచనలు కుటుంబవలయంలోనే పరిమితమైవుంటే—ఆలోచనాపద్ధతి తప్పుదారిలో వెడుతుంది. డబ్బు, ఆర్జన—అలెక్క ప్రాతిపదికగానే మన సమస్త కర్తవ్యాకర్తావ్యాలను నిర్ణయించుకుంటున్నాం. కాని ఈనాడు అర్థశక్తిని అర్థవ్యవస్థను లోతుగా పరీక్షించటం, విశ్లేషించటం ఎక్కువగా కనిపిస్తున్నది. కుటుంబఆదాయం ఎంతవస్తున్నది—అనేదే ఈనాడు మన చూపుకు చివరిపరిధి కాదు. కాబట్టి ఫలానా కుటుంబంలో ఇంతమంది పిల్లలు ఉన్నారు; ఆ కుటుంబానికి ఇంత ఆదాయం వస్తున్నది—అంటూ ఇలాగ తర్కిస్తూ సమస్యను సంపూర్ణంగా పరిష్కరించలేము. వ్యక్తిగతఆదాయాన్నీ, కుటుంబాన్నీ దృష్టిలోపెట్టుకుని ఏవేవో ఉపాయాలు అవలంబించటం తప్పనిసరి అని తోస్తే—సరే, అలాగే కానీయవచ్చు. కాని అటువంటి దృక్పథానికే ఎక్కువ మహత్తును, ప్రాధాన్యతను ఇవ్వటం నా ఉద్దేశంలో చాల పొరపాటు; అసామాజికంకూడాను.

ప్ర : సంతతిని పెరుగనీరాదు అన్న సమస్య కేవలం వ్యక్తిగతమైనదే కాదు. ఇంచుమించు అన్నికుటుంబాలకు సంబంధించినదే. ఈ రోజుల్లో ప్రతికుటుంబంలోనూ స్త్రీకూడా డబ్బుసంపాదించి భర్తకు సాయపడవలసిన అవసరం కనిపిస్తున్నది. అటువంటప్పుడు ఆమెకు సంతానవృద్ధి అర్థోపార్జనకృషిలో ఆటంకప్రాయం కావటంలేదా?

జ : అదే అసలుసంగతి. పరిష్కరించుకోవలసింది ఆర్థికసమస్య. దాన్ని కుటుంబంవరకే పరిమితంచేసి ఆలోచించేట్టయితే—ఆదాయం పెంచటం ఎలాగ? ఖర్చుతగ్గించటం ఎలాగ?—ఇంతవరకే ఆలోచించటం

జరుగుతుంది. ఆర్థికసమస్యను అంతవరకుమాత్రమే ఆలోచించటంవల్ల లోకంలో కనిపించే అసామాజిక (unsocial) ప్రవృత్తులకు సమర్థన లభిస్తుంది. దొంగబజార్లు, లంచగొండితనం, వ్యాపారంలోమోసం—ఇవన్నీ కుటుంబంకోసమే జరుగుతున్నాయి. కాబట్టి నేటి వ్యవస్థలో సమూలమైన పరివర్తనను తీసుకురావలసిన ఆవశ్యకత ఉన్నది. ప్రతివాడూ ఎల్లప్పుడూ తన ఆదాయాన్ని వృద్ధిచేసుకోటం ఎలాగ? అనే ఆందోళితుడు అవుతూ వుండే సమాజంలో పరస్పరసహకారం వృద్ధిపొందదు; సంఘర్షణే అధికం అవుతుంది. ప్రతివాడికీ ఎప్పుడూ ధ్యాస పనిమీదే వుండాలి. అందులో నుంచే సహకారభావంతో ప్రతివాడికీ తగినంత భరణపోషణ లభించాలి;అది డబ్బుపెట్టి కొనుక్కోవలసివుంటే అందుకు తగినంత డబ్బు లభించితీరవలసిందే. ఇటువంటి అవకాశాలుగల సమాజం కావాలి మనకు. అందుకు తగిన ప్రయత్నంచేయకుండా—కుటుంబఖర్చులు తగ్గించేందుకు కృత్రిమ గర్భనిరోధసాధనాలను ప్రచారంచేస్తూ; లంచగొండితనాన్నీ, నల్లబజారు వ్యాపారాన్నీ సాగనిస్తూంటే — అది చాల దుర్బలమైన ఆలోచన అనిచెప్పాలి. చాలమంది కుటుంబాలవారు అలాంటిదారుల్లోనే తమతమ తాత్కాలికమగు ఇబ్బందులనుంచి తరణోపాయాలు చూచుకుంటూనే వున్నారు; అటువంటి మార్గాలద్వారా కొందరు సంపన్నులౌతున్నారు; పేరుప్రతిష్ఠలు సంపాదించుకుంటున్నారు. కాని ఇదంతా పైపైన కనిపించే సార్థకత. ఇక దీన్నేపురస్కరించుకుని ఆమార్గాల్ని సమర్థించలేము. వ్యాధి బాగా వ్యాపించిపోయింది. కాబట్టి రోగనిదానమును బాగా లోతుకుపోయి ఆలోచించాలి. కృత్రిమ నిరోధం ఒక ఉపాయంగా ఇవాళ స్ఫురిస్తున్నదంటే—చేతులు కాలినవానికి ఆకులు పట్టుకోవాలనిపించినట్టే. అంతేగాని అది సరైన నిదానం కాదు. స్థిరమైన సమస్యాపరిష్కారం అందులో లేనేలేదు.

ప్ర : చాలకుటుంబాల్లో జీవికకోసమే స్త్రీలు అర్థోపార్జనకు దిగి పురుషులకు తోడుపడవలసివస్తున్నది. అంతేగాక— కళ, సాహిత్యం, శిక్షణ, సంగీతం మొదలైన అనేకశాఖలలో స్త్రీలకు ప్రతిభ, అభిరుచి ఉన్నాయి. కాని సంతానవృద్ధివల్ల వారి ప్రతిభ వికసించేందుకు అవకాశం ఏదీ?

జ : మీరలా అంటున్నారు. కాని నా అభిప్రాయం ఏమిటంటే—ఈ

ఆర్థికపుఇబ్బందులనుంచి విముక్తిచేకూరితేనే వారిలో స్వతహా ఉన్నటువంటి ప్రతిభ వికసించేందుకు సదవకాశాలు ఏర్పడతాయి;తద్వారా సంతతి దానంతట అదే నియమితం ఔతుంది. సృజనాత్మకమైన శక్తి పనిచేయగలిగిన వివిధక్షేత్రాలు ఈనాడు మూసివేయబడివున్నాయి. ఇదికూడా సంతతి పెరగ టానికి ఒక కారణమే. మనలోని శక్తులు రకరకాల రచనాత్మకకర్మలయందు లగ్నమై యుండగల అవకాశాలు లభిస్తే ఈసమస్య దానంతట అదే పరిష్కారమైపోతుంది.

ప్ర : పెండ్లియీడువచ్చిన చాలమంది యువకులు, యువతులు—పెండ్లిగనకచేసుకుంటే ఆతరువాత సంతానం వృద్ధియై, ఆజంజాటంలో చిక్కుకుని, తమ యభిరుచులు, ప్రతిభలు వికసించకుండా అణగారిపోతా యని—భయపడుతూవుండటం నేను చూచాను. అటువంటివారి భయానికి ఉపచారరూపంలో సంతతినిరోధాన్ని అవలంబించటం సముచితం కాదా?

జ : ఔను, ఇటువంటి భయం ఉంటున్నది. వివాహం అయిపోవటం తోనే సంపాదనాతాపత్రయంలో పడిపోకతప్పటంలేదు.ఆ తాపత్రయం హార్దిక జీవితానికి అవకాశం ఇవ్వదు. నా అభిప్రాయం ఏమిటంటే— వివాహా నంతరం దంపతులిద్దరూ పరస్పరం హార్దికతకలిగి జీవించగల అవకాశం లభిస్తే—మనస్సులోని లోతైన ఆకాంక్షలను అణచివేసుకోవాలన్న వివశ త్వానికి లోనుకాకపోతే—అప్పుడు వారిలో ఒకవిధమైన సామాజికత వస్తుంది; ఒక రచనాత్మకశక్తి వికసిస్తుంది; తత్కారణంగా గార్హస్థ్యపు జంజాటములు వారిని నలువైపులనుంచి అంతగా ఒత్తిడి పెట్టవు, నిర్బంధించవు. కాని అలా ఎక్కడ జరుగుతున్నది? సంపాదనా తాపత్రయమనే ఆ గానుగనుంచి విడు దల లభిస్తేకదూ! తత్ఫలితంగా వారిలోని సహానుభూతి కుటుంబవలయం లోనే తిరుగాడుతూ ఉంటుంది; ఉపభోగశక్తి ఇంద్రియాలయందే పరి మితమై వుంటుంది. వారిలోని శక్తులు పైకి లేవవు; వ్యాపించవు. పిల్లలు ఎక్కువగా పుడుతూవుంటారు; బంధనాలు ఇంకా బిగుస్తూవుంటాయి. ఇంతకూ నేను చెప్పదలచిందేమంటే—ఈబంధనం ఆరంభమైనదశనుంచి కాదు మనం సమస్యను చూడవలసింది; అలా చూడ్డం పొరపాటు. అది సమస్యకు చివరికొన. అసలు మొదటికొన ఎక్కడో అక్కడినుంచి ప్రారం

ఖంకావాలి పరిష్కారసాధన. సంయమము, సృజనాత్మకజీవనము—ఆర్థిక బాధలను, వాటివల్ల సంభవించే నీరసస్థితిని తొలగించటంలో చాలవరకు సాయపడగలవు. ఇకనప్పు డీ కృత్రిమసమస్యలు ఉద్భవించవు; కృత్రిమో పాయాలతో పనీ ఉండదు.

ప్ర : దేశవ్యవస్థ మిక్కిలి అసంతృప్తికరంగా ఉన్నందువల్ల, పరిస్థితులదృష్ట్యా వ్యక్తి దేశంకోసం మరీ ఎక్కువగా వినియోగపడవలసి వస్తున్నది. తన శక్తినంతా తన పిల్లల పాలనకు, పోషణకే ఖర్చుచెయ్యకుండా, తన సంపూర్ణశక్తిని దేశీయవ్యవస్థాసముద్ధరణార్థం వినియోగించుకోవాలని వాంఛిస్తున్నాడు. ఇటువంటిస్థితిలో కృత్రిమోపాయాల్ని అనుసరించటం ఉచితంకాదా ?

జ : సామాన్యసంయమాన్నికూడా పాటించనీయని ఆ జాతీయత, ఆ దేశభక్తి ఎటువంటిదబ్బా ! అన్నిరకాల భోగాలకు స్వేచ్ఛవుంచుకొన్న దేశప్రేమ చేసే దేశోద్ధరణ కేవలం రాజనీతిరచన అయితే కావచ్చు; అంతేగాని దానివల్ల దేశానికి కలిగే మేలు ఏ కొంచెమూ ఉండదు.

ప్ర : అంటే మీ ఉద్దేశం : ఈ విషయంలో సంపూర్ణసంయమం సాధించలేకపోయినవారు దేశసేవచేయనేలేరనా ? వారు దేశసేవకు దిగనే కూడదనా ?

జ : కాదు; నా ఉద్దేశం ఏమిటంటే—కృత్రిమసంయమాన్ని పరిగ్రహించవలసిన అవసరం ఏమీలేదు. అకృత్రిమమైనసంయమాన్ని ఏ కొంచెం సాధించగలిగినా దానివల్ల దేశానికి కొంత ప్రయోజనం ఉంటుంది.

ప్ర : కొందరు ప్రత్యేకవ్యక్తులకు.... ఈ కృత్రిమోపాయాల్ని అవలంబించేందుకు సలహా ఇవ్వవచ్చునన్నారు మీరు. దేశసేవాసక్తుడైన వ్యక్తి అవలంబించవచ్చునా ?

జ : ఊహుఁ.

ప్ర : మరి ఎటువంటిపరిస్థితుల్లోవున్న వ్యక్తికి మీరట్టి సలహాను ఇచ్చేది ?

జ : ఆర్థికవివశత, స్వాస్థ్యసంబంధమైన అసమర్థత—ఈ రకమైన పరిస్థితుల్లో.

# ఆర్థికసభ్యత - నారీజీవనము

ప్ర : ప్రేమను మీరు సామాజికమర్యాదయందు అంతర్గతమైనదిగానే అంగీకరిస్తున్నారు. అంటే — శాస్త్రాల్లో అనుశ్రుతంగావస్తున్న స్త్రీధర్మం — భర్త ఎటువంటివాడైనాసరే అతన్నే దేవుడని భావించి పూజించవలెనన్న నియమం — అంతేకదూ ?

జ : కాదు. ప్రేమ సామాజికమర్యాదయందు అంతర్గతం కాదు. వ్యక్తి తప్పనిసరిగా సమాజానికి చెందినవాడే; సమాజమర్యాదలు అతనికి వర్తించటం సుసంగతమే. అదేవిధంగా ప్రేమావస్థయందు సమాజమర్యాదలను అతిక్రమించటంకూడా ఒక్కొక్కప్పుడు జరుగుతూవుంటుంది; చూస్తునే ఉన్నాం. అయినా అటువంటివ్యక్తి కాలాంతరమందు నిందనీయుడుగా గాక, పూజనీయుడుగా పరిగణింపబడుతూవుండటం కద్దు. బుద్ధుని ఉదాహరణగా తీసుకోండి. సమాజపు కట్టుబాటురీత్యా నవయౌవనవతియైన భార్యను, పాలబుగ్గల పసిబిడ్డనూ విడిచిపెట్టిపోయేహక్కు అతనికి లేదు. కాని అతనిచేత సర్వమునూ త్యజింపజేసి అతన్ని ఎక్కడికో కొనిపోయినది.... అతనిలోని ఒకవిధమైన ప్రేమయొక్క, సహానుభూతియొక్క ప్రేరణకాదా ? ఈ ఉదాహరణలో మర్యాదాతిక్రమణ ఉంది; కాని ఇది అనుత్తమమైనది అనటానికి వీల్లేదు.

కాబట్టి సామాజికమర్యాదలనేవే మనకు చివరి పరిధి కాదు. అవే స్వయంగా ఇంకా ముందుకు పోవలసివున్నాయి. కొందరు, తమనుగురించిన ఆలోచనే లేకుండా, సహానుభూతిభావప్రేరితులై, సత్యమునెడలవుండే అభీప్సతో, మర్యాదలను అతిక్రమించి వెడుతూఉంటారు. నిజంగా ఆలోచిస్తే అటువంటివారు మర్యాదల్ని అతిక్రమించారనుకూడదు; అసలు మర్యాదల్ని స్థాపించేదే వారు. అటువంటివారు కారణంగానే సమాజము, సమాజపు హద్దులు మున్ముందుకు వెడుతూ ఉంటాయి.

భర్త అనబడే వ్యక్తి ఎంత గుణవంతుడు, రూపవంతుడు అయినప్పటికిన్నీ ఒక్కనాటికీ దేవత కాజాలడు. వ్యక్తి దేవత కాజాలడు; దేవతగా భావింపబడగలడు. అలా భావించటానికి ఎంతో శక్తికావాలి. అందుకు అభ్యాసం, సాధన అవసరం. కాబట్టి సతీత్వం అనేది ఎప్పుడైనా ప్రయత్నసాధ్యం; సహజసిద్ధం కాదు. కాబట్టి అది ఒక భారంగానూ అనిపించవచ్చు; ధర్మంగానూ ఆచరితం కావచ్చు. శ్రద్ధ లేకపోతే అది ఒక ప్రయాసే. శ్రద్ధ ఉన్నట్టయితే అది ఒక్క ఉత్కర్షసాధనమార్గం.

ఔను, ఎటువంటివాడినో ఒక పురుషుని భర్తగా పొందినతరువాత, అతనినే దేవుడనుకుని, అతనినుండి విముఖురాలుకాకుండా, పతివ్రతయై వుండే స్త్రీని నేను పూజిస్తాను. కాని ఏ స్త్రీయైనా అలావుండకుండా, మరో రీతిగా ప్రవర్తిస్తే ఆమెపై దోషం ఆరోపించి, దండించేందుకుమాత్రం నేను సిద్ధపడను.

ఇక శాస్త్రాల్లోని అంశాలను మనం ఆదర్శములుగా అంగీకరించవలసిందే. వాటికి ఆ గౌరవం మనం ఇవ్వవలసిందే. ధర్మాన్ని పాతివ్రత్యం అనే ఉత్తమస్థాయిలో గాక, అంతకన్న తక్కువస్థాయిలోకి ఎలా తీసుకువస్తాయి శాస్త్రాలు ? ఆదర్శం ఒక మూల్యం. అది ఎప్పుడోగాని హస్తగతమయ్యేదికాదు. కాని ప్రతిక్షణమూ దాన్ని మనం ఎదురుగా ఉంచుకోవలసిందే.

ప్ర : కాని కొందరువ్యక్తులు సహానుభూతిభావప్రేరితులై గాక, కేవలం భోగేచ్ఛాపరులై సమాజమర్యాదలను అతిక్రమిస్తూ ఉంటారు. అటువంటివారి విషయమై మీరేమి చెబుతారు ? అటువంటి ఒకానొకవ్యక్తితో జీవితాన్ని వెళ్ళబుచ్చుకోటం స్త్రీకి ఎలా సాధ్యమౌతుంది ?

జ : అటువంటివ్యక్తిని నేను ప్రశంసించను. కాని భర్త ఎంత ప్రతికూలుడైవున్నా, అతన్నే అవిరతంగా సేవిస్తూఉండే స్త్రీ నిజంగా పూజార్హురాలు. అటువంటి ఉదాహరణలు లేకపోలేదనే నా ఉద్దేశము.

ప్ర : కాని చాలమందివ్యక్తులు మితిమీరిన దుర్వ్యసనాలు కలిగి వున్నారు. వారుచేస్తూఉండే చెడ్డపనులన్నీ సహిస్తూ ఊరుకోటం వారికింకా ప్రోత్సాహం కల్పించినట్టు ఔతుంది. అటువంటివారికి స్త్రీ తరపున దండన లభించటంగాని, ఒకరకమైన ప్రతీకారవ్యవస్థగాని లాభప్రదంకాదా ?

జ : దండన, ప్రతీకారం స్త్రీనుండి లభిస్తూనేఉంది. అటువంటి భర్తను భార్య దండించటంలేదని అనుకోటానికి వీల్లేదు. వ్యక్తితో సహయోగము కలిగివుండటంలోనే, ఆ వ్యక్తిలోని దోషాలయెడల సహాయ నిరాకరణము అంతర్భూతమైవుంది—అదొక ఉత్తమమైన దండనవిధానం. భార్యాభర్తలు తెగతెంపులుచేసుకుని .విడాకులిచ్చుకోవటంకంటే మరివేరే గత్యంతరం కనిపించని సందర్భంలో మనకు గోచరమయ్యేది ఏమిటంటే— సహయోగంలో సహాయనిరాకరణమును సాగించు నేర్పు సాధింపబడలేదన్న అంశమే.

'దోషపరిహారం ఎలాగ ?' అన్నదే ప్రశ్న. దోషాలు ఉన్న వ్యక్తిని దుష్టుడుకింద కట్టివేసి, త్రోసిపారేస్తే—ఇంకా సమస్య ఏముంది ? పరిష్కారం ఏముంది ? 'దోషియైన వ్యక్తిని మన సహానుభూతికి దూరం చేయరాదు' అనే షరతు పెట్టుకొనే, అతని దోషాలపట్ల సహాయనిరాకరణం సాగించగల ఉపాయాన్ని వెతుక్కోవాలి.

సహానుభూతిని పూర్తిగా చంపివేసుకుని మనిషిని మంచిదారిలోకి తీసుకువచ్చి సముద్ధరించాలంటే — అది అసాధ్యమైనపని అనే నా అభిప్రాయం.

ప్ర : కాని కొందరు వ్యక్తులు ఉంటారు. వారిలోని దోషాల్ని మనం సహిస్తూ ఊరుకున్నందువల్ల వారిలో పరివర్తన రావటం అసంభవం. ఆ నీతి వారి దగ్గర పనిచేయదు. అటువంటివారి విషయంలో విచ్ఛేదమే సహాయకారి అని తోస్తుంది. అటువంటి సందర్భంలో కూడా మీరు విచ్ఛేదాన్ని అనుమతిస్తారా ?

జ : ఎవరో అనుమతి ఇచ్చేవరకూ ఆ విచ్ఛేదం జరక్కుండా ఆగి వుండే అవకాశంవున్నదీ అంటే—అది అనివార్యం కాదనేగా అర్థం. అందులో నా అంగీకారప్రశ్న లేనేలేదు. భార్యగాని, భర్తగాని కోపావేశంలోగాక, తటస్థబుద్ధితో వితర్కించుకున్నమీదట—విచ్ఛేదమే తమ యిరువురకూ హితకరము కాగలదన్న నిర్ణయానికి వచ్చినట్లయితే—అటువంటి విచ్ఛేదాన్ని అనుచితమని నేను అనలేను. భార్యాభర్తలు ప్రసన్నచిత్తులై, పరస్పరం అంగీకరించికావించుకున్న విచ్ఛేదంలోదోషాన్ని ఆరోపించటం నాపని కాదు. ఇరువురిలో ప్రసన్నభావం తప్పనిసరిగా ఉండి ఆ నిర్ణయానికి రావాలి; అంతవరకే నాకు కావలసింది. నేనెరిగినంతవరకు విడాకులిచ్చుకుంటున్న భార్యాభర్తలలో ఖిన్నభావమేగాని ప్రసన్నభావం ఎక్కడా కనిపించదు. ఈ ఖిన్నత్వం సమాజంయొక్క శరీరంలోనూ, వాతావరణంలోనూ వ్యాప్తం కాకుండా ఉండదు; అది ఏకత్రమై, వ్యాప్తమై నానావ్యాధుల్ని పుట్టిస్తుంది. కాబట్టి చట్టంద్వారా విడాకులమార్గాన్ని తెరచినంతమాత్రాన చిక్కు తీరి పోతుందనిగాని, లేదా కొంతవరకైనా సడలిపోతుందనిగాని నేనుమాత్రం అంగీకరించలేను.

ప్ర : ఇద్దరూ ప్రసన్నచిత్తులుగానే ఉండటమనేది అసంభవం. పురుషుడు స్త్రీవల్ల తీరని అత్యాచారాలు నెరపుతూకూడా ఆమెను తనదగ్గరే అట్టి పెట్టుకోవాలని చూస్తూ ఉంటాడు. నా మిత్రురాలు ఒకతె ఉన్నది. భర్త ఆమెను చాల ఘోరంగా పీడిస్తున్నాడు. సహించలేక ఆమె అతనిదగ్గర నుంచి వెళ్ళిపోతూ ఉంటుంది. కాని అతడు పట్టుబట్టి ఆమెను మళ్ళీ పిలిపించుకుంటూవుంటాడు. ఇటువంటి పరిస్థితిలో విచ్ఛేదం కాకపోతే మరి ఆమెకు తరణోపాయం ఏమిటి?

జ : ఇతర్లయెడ అత్యాచారం నెరపువాడు ప్రప్రథమంగా తనయెడనే నెరపుకుంటున్నాడు. పైకి కనిపిస్తూనే ఉండే ఈ సత్యాన్ని—రోజల్లా భర్త చేతుల్లో దెబ్బలుతింటూ పడియుండవలసిన స్త్రీ గుర్తించలేకపోవటంలో ఆశ్చర్యంలేదు. తనపై అత్యాచారంచేస్తున్న భర్తలోని దుఃఖాత్మను ఆమె తెలుసుకోటం కష్టతరమే. అందుచేత విడాకులిచ్చుకోవాలన్న నిర్ణయానికి ఆమె వచ్చిందంటే—అది తాను ప్రసన్నచిత్తయై చేసుకున్న నిర్ణయం కాదు.

ఇటువంటి సందర్భాల్లో ఈ నిర్ణయాన్ని ఇరువురూ సమ్మతించినదై ఉండదు. ఒక్కరికిమాత్రమే సమ్మతమై ఉంటుంది. ఇవి సామాన్యసంఘటనలే. భార్యను చావగొట్టటం ఒక మహత్వపూర్ణమైన విషయమని నేను చెప్పటం లేదు. ఇలా చావగొట్టటం లేనిసందర్భాల్లోకూడా ఒక్కొక్కచోట విచ్ఛేదం అనివార్యంకావచ్చు. వ్యంజనంలో మసాలావలె. ఒక్కొక్కయింట్లో దెబ్బలుకొట్టటంకూడా అతిసహజం అయిపోయింది. కాగా సహనశక్తికి హద్దుఎక్కడో నేను చెప్పలేకుండా వున్నాను.బహుశా అసలు హద్దు అంటూ లేనేలేదేమో ! ఒక ధర్మంకోసం ప్రాణాలర్పించే ఆత్మత్యాగి చేస్తున్నపని మృత్యువును సహించటంకాదు, మీదుమిక్కిలి దాన్నే వరిస్తున్నాడు. ఇక సహనశక్తికి హద్దు ఎక్కడని నిర్ణయించగలం ?

ఇంకో సంగతి : నీవు స్త్రీపక్షాన ఎందుకు మాటాడుతున్నావు ? అందుకు జవాబు నేను పురుషునిపక్షాన చెప్పాలనికూడా కోరడంలేదు కదా నీవు ? అనగా పురుషునిపై నేరం మోపాలని స్త్రీ ప్రయత్నిస్తే, స్త్రీ పైనే తప్పు నిరూపించాలని పురుషుడు కోరుతాడు. ఈ పోటీతత్వంవల్ల లభించే ప్రయోజనం ఏమీ వుండదు. ఎవరికివారు తప్పు తమలో వెతుక్కోడమే సవ్యమైన పద్ధతియని గుర్తిస్తే—చికిత్సావిధానం బయటపడుతుంది. అత్యాచారం తనపైనే జరుగుతున్నట్టు భావిస్తూ,స్త్రీ ప్రారంభంనుంచే తనను తానొక అబలగా స్థిరపరచుకుంటున్నది.ఇది సవ్యమైన పద్ధతికాదు.పిడికిలిబలం పురుషునికి అధికమే; అందులో అతడు ప్రబలుడే కావచ్చు. కాని వాగ్బలంలో మాత్రం స్త్రీముందు పురుషుడెందుకూ పనికిరాడు. అర్థాత్తూ, తాను దుర్బలనన్న భావాన్ని స్త్రీ మరచిపోవాలి; ఆమె దుర్బలురాలు కానేకాదు. పురుషుడు తన కష్టాల్ని చెప్పుకొని ఏడవటానికి ఒకరి ముందుకు రాడు. అంతమాత్రాన స్త్రీ తన బలాన్ని తాను తెలుసుకోలేకుండా ఉండవలసిన అవసరంలేదు.

ప్ర : తనొ్నక దుర్బలురాల్నిగా స్త్రీ భావించుకుంటున్నదని నేను చెప్పటంలేదు. పురుషునికన్న స్త్రీయే అధికవిపత్కరపరిస్థితిలో పడివుంది. ఇందుకామె ప్రకృతి, సమాజవ్యవస్థ కారణాలు. అందుచేత నా సహానుభూతి ఆమెపై కేంద్రీకృతమౌతున్నది. ఇది మీరు ఒప్పుకోరా ?

ఉ : ఒప్పుకోక తప్పటంలేదు. నేటి ఆర్థికమహత్వం నాకిందుకు

తోర్పడుతున్నది. మొదట డబ్బు పురుషునిచేతికి వస్తున్నది; పురుషుని చేతిలోనుంచి స్త్రీకి లభించుతున్నది. అంటే మొదట పురుషుడు, ఆ తరువాతే స్త్రీ. ఆమెది రెండో నంబరు. ఈ స్థితి ఆర్థికసభ్యతయందు అనివార్యం అయింది. కాబట్టి సన్నడిగితే ఈ ఆర్థికమైన సభ్యతను సభ్యత అనలేను; అది లోలోపల అసభ్యతే. వివాహం చేసుకోకుండానేవున్నా, భర్తకు విడాకు లిచ్చేసి బైటికివచ్చినా—స్త్రీయొక్క పరిస్థితిలో రాగల మార్పేమీ కనిపించదు. పశ్చిమదేశాల్లో వివాహం ఒక ధార్మికసంస్థ కానేకాదు. అక్కడది కేవలం ఒక సదుపాయసంస్థ. కాని అక్కడ పురుషునితో పోల్చిచూస్తే స్త్రీవ్యక్తి గౌణముకాదు అని భావించేందుకు అవకాశం ఉన్నదంటావా? లేదు. అక్కడ స్త్రీపురుషులమధ్య సమత్వం అనేది లేదు; ఉండజాలదు. అక్కడ డబ్బుకు వుంటున్న గౌరవం, ప్రభావంవల్ల తప్పనిసరిగా స్త్రీపురుషులమధ్య ఒక లోతైన వైషమ్యం వృద్ధిచెందుతూవస్తున్నది. తత్ఫలితంగా స్త్రీలు ఆర్థికస్వాధీనతను 'డిమాండు' చేయటం అధికమౌతున్నది. కాని అదొక మృగతృష్ణ. పెనగులాడి స్వాతంత్ర్యాన్ని గుంజాకోవాలని ప్రయత్నిస్తే—ఆ పందెంలో నెగ్గలేదు స్త్రీ. ఆ పద్ధతిలో స్త్రీ మగవాడిని ప్రభువుగా అంగీకరించవలసినదే ఔతున్నది. పశ్చిమదేశాల్లో స్త్రీ పురుషులమధ్య కనిపిస్తున్న సంబంధాల్ని పురస్కరించుకుని—అక్కడ అర్థకేంద్రితసభ్యతలో స్త్రీ పురుషులమధ్య సమత్వం ఉన్నట్టు భావించటంకన్నా భ్రమ మరొకటి ఉండబోదు. ఈకాలంలో 'సమత్వం' అన్నదానికి విలువ, మహత్తు హెచ్చుతున్నాయి. అది కావాలన్న కోరికా హెచ్చుతున్నది. ఈ సందర్భంలో నిజంగా స్త్రీ ఒకమెట్టు క్రిందవున్నట్టే భావించాలి. కాని డబ్బుకు ఆపాదింపబడుతున్న మహిమను తొలగించిచూచినట్లయితే ఆ డబ్బును తీసుకురావలసిన పురుషుడు కూలివాడుగానూ, దాన్ని వ్యయంచేసే అధికారంగల స్త్రీ రాణీగానూ ఎందుకు పరిగణింపబడకూడదు? డబ్బును సంపాదించటంకాదు; దాన్ని ఖర్చుచేయటమనేదే ప్రముఖమైన అంశం. డబ్బు సంపాదించి తెచ్చేసరికే పురుషునికి తలపోటు దుర్భరమైపోతున్నది. ఇక ఇల్లు, సంసారం దిద్దుకోవలసిన పనిలో అతని బుద్ధి ప్రసరింపజాలదు. కాబట్టి అర్థోపార్జనశక్తికి ఇవ్వబడుతున్న మహత్తును తీసి అవతల పారేయాలి. ఆదాయానికిగాక ఎక్కువగా ఖర్చుచేయగలశక్తికే మహత్తును

ఆపాదించటం జరిగితే అతిసులభంగా స్త్రీకి ప్రాధాన్యత వచ్చేస్తుంది. నైతిక సభ్యతలోని ఉద్దేశం అదే. ఆర్థికసభ్యత ఆదాయాన్ని పురస్కరించుకుని ఉచ్చనీచాల్ని కేటాయిస్తుంది. ఆ పనిని నైతికసభ్యత ఖర్చుపెట్టేతీరును పురస్కరించుకుని చేస్తుంది. భోగవిలాసాలకు ఖర్చుచేసేవారు నీచులు; సేవాసత్కారాలకు ఖర్చుపెట్టేవారు ఉత్తములు. అలా కొల్చి నిర్ణయించ గల శక్తి మన మనస్సులకు ఏర్పడినప్పుడు స్త్రీకి గౌరవం హెచ్చుతుంది. అప్పుడు స్త్రీ కేంద్రం ఔతుంది; పురుషుడు పరిధి ఔతాడు. ఎవరేమన్నా సరే, నేనుమాత్రం గాఢంగా నమ్ముతున్నదేమంటే — భారతీయసభ్యతలో స్త్రీకి ఒక ఉన్నతస్థానము, మంచి గౌరవము సంప్రాప్తమైనాయి. మరింక ఎటువంటి ఆర్థికప్రణాళికగాని, ఆర్థికఉన్నతిగాని ఆమె కటువంటి గౌరవాన్నీ, స్థానాన్నీ ప్రసాదింపజాలవు. మన అర్థరచన, అర్థగరిమ — ఇవి కారణంగానే స్త్రీయొక్క స్థితి ఈ నాడింత విషమంగా తయారైందని నేను అంగీకరిస్తున్నాను. ఇందుకు ప్రతిక్రియ వివాహాన్ని వ్యతిరేకించటం, పాతివ్రత్యధర్మాన్ని విరోధించటం కాదు; డబ్బుకుగల విలువను తారుమారు చెయ్యాలి.

ప్ర : ఆర్థికవ్యవస్థను మార్చివేయటం మన శక్తికి మించిన పని. మనం ఏ వ్యవస్థలోనైతే జీవిస్తున్నామో దాని ప్రభావం మనమీద పడక తప్పదు. స్త్రీకి ఆర్థికపరాధీనత అనివార్యం అయింది. అది కారణంగా పురుషుడనుకుంటున్నాడు : ఆడుది తన మెడకు పడ్డ గుదిబండ అని; ఆమె తనకొక భారమైన వస్తువని. ఇష్టంవచ్చినట్టు అధికారం చలాయిస్తాడు; అత్యాచారానికి దిగుతాడు. ఇక ఇటువంటప్పుడు స్త్రీ డబ్బుకు మహత్తును ఇవ్వకుండా ఎంతకాలమని తప్పించుకోగలదు ?

జ : తప్పించుకోలేకపోతే తన స్థితి హీనమైనదని అనుకుంటూ, అనుభవిస్తూ ఉండవలసిందే; అందులోనుంచికూడా తప్పించుకోలేదు. ఏ నాటికైనా ఆమె తన హీనస్థితినుండి బయటపడాలంటే — ఒక్కటే ఉపాయం : స్నేహం, సేవ — ఈ రెంటినే అంటిపెట్టుకుని వుండి, వాటిబలం మీదే తన ఉన్నతస్థానాన్ని పొందాలి; ఉపాయాంతరం లేదు. పైన చెప్పబడిన ఆర్థికస్వతంత్రత అనబడే బలంవల్ల ప్రయోజనంలేదు. కొంచెం

ఏదో చదువుకుని, గబగబా ఉద్యోగంలో ప్రవేశించి, వచ్చేజీతంరాళ్ళతో ఆర్థికస్వాధీనత చేకూరిందనుకుని కొందరుస్త్రీలు గర్వించవచ్చు. కాని ఈ మార్గంద్వారా వారు తమ హీనస్థితినుండి విడుదలపొందలేరు. ఆ పద్ధతిలో వారి స్థితి సురక్షితంకాదు; సుఖవంతం కాదు. ఆ మార్గం పురుషునితో స్పర్థను, సంఘర్షణను తెచ్చిపెట్టేటువంటిది. జీవననియమం స్పర్థకాదు; సామంజస్యం; సంఘర్షణకాదు, సహయోగం.

ప్ర : స్నేహంద్వారా, సేవద్వారా, వాటిబలంమీదే సాగిపోవటం సాధ్యంకాదేమో ననిపిస్తున్నది ఈ నాటి సమాజపు ఆర్థికవ్యవస్థలో. తల్లి దండ్రులకుకూడా ఆడపిల్ల అంటే చిన్నచూపే; అర్థోపార్జనకు పనికిరానిది కాబట్టి. డబ్బు సంపాదించుకోటం చేతకాదు కనుకనే 'ఎక్కడికి వెడుతుం దేమిటి ? నా ఆశ్రయంలోవుండి బ్రతుకవలసిందేగా !' అన్న ధీమాతోనే భర్తకూడా ఇష్టంవచ్చినట్టు వ్యవహరిస్తూ ఉంటాడు.

జ : పురుషులందరూ చెయిజేసుకునేవాళ్ళేననీ; భార్యతో సహకరించి కుటుంబనిర్వహణలో కష్టపడుతున్నవారు లేరనీ అనుకోటం ఒక భ్రాంతి. మధ్యతరగతివారిపై ఈనాడు భారం ఎక్కువగానే ఉంది. ఒకవంక వారికి ఎడతెరపిలేని శ్రమ. మరోవైపున పెట్టుబడిదార్ల గుంజకు కట్టుబడి పెనగు లాట. రెండు తిరుగలిరాళ్ళ మధ్య పప్పుపలుకుల్లా ఉన్నారు. వీరిలో సహ యోగమును, సేవాభావమును గల గృహస్థులే జీవితంలోని తమ విషమ పరిస్థితులను ఓర్చుకొనగలుగుతున్నారు, హృదయాల్లో ఆర్థికభావాలు అంకు రించి, వల్లవితములైన గృహస్థులకుమాత్రం అంతులేకుండా ఉన్నాయి విషమపరిస్థితులు, వ్యథలున్నూ. ఇటువంటివారంతా ఇప్పుడు మిక్కిలి విచ లితావస్థలో వున్నారు; ఒకవిధమైన దంద్వాగ్నికి ఇంధనాలుగా తయా రౌతున్నారు.

ప్ర : దరిద్రం అనే నిప్పులో కుమిలిపోతున్న గృహస్థులుకూడా వున్నారు. అటువంటి సంసారాల్లో స్త్రీలు ఆర్థికంగా అసమర్థులైన కారణం వల్ల జీవితం సార్థకంకాలేదన్న దుఃఖభారాన్ని మోస్తూ పడివున్నారు. సంపాదించగల యోగ్యతే వున్నట్టయితే అటు తల్లిదండ్రులకుగాని, ఇటు

భర్తకుగాని సంసారనిర్వహణలో సాయపడివుందుమే అని అనుకుంటూ గుండెలవిసిపోయి కానరాని బాధ పడుతున్నారు.

జ : ఔను. వాళ్ళేంచెయ్యాలి ? ఎక్కడికి పోవాలి ? అదీ ఇప్పుడు ప్రశ్న. స్వతంత్రులై విడిగా వెళ్ళిపోయి, స్వయంగా సంపాదనకు దిగి అర్థోపార్జనకే మహత్తును కట్టబెట్టవలెనా లేక సహకారభావం కలిగి, ఒకరి కొకరు ఆసరాఔతూ, కలిసిమెలిసి సంసారం నిర్వహించుకోవాలా ? నేను ఈ రెండోపద్ధతినే సమర్థిస్తాను.

ప్ర : సహకారం అనేది ఆర్థికంగాకూడా అవచ్చు. అందుకు మీరు వ్యతిరేకించరుకదా ?

జ : లక్ష్యం సహకారమే కావాలి. డబ్బు కారాదు. ఆ దృష్ట్యా కొన సాగే ఆర్థికసహాయంలో ఏమీ అనిష్టం లేదు. కాని మనకు లోలోపల డబ్బు అంటే ఎంతో ప్రీతికదా ! పరస్పరం కలసిమెలసి సంసారం నిర్వ హించుకునేందుకే డబ్బు— అన్న విషయం మరచిపోతూవుంటాం. డబ్బు అనేది కేవలం మన స్వాతంత్ర్యాన్ని నిర్మించుకునేందుకే అని భావిస్తూ ఉంటాం. ఇదే అసలు వ్యాధికి మూలం.

ప్ర : ఒక్కొక్కప్పుడు స్వతంత్రాన్ని నిర్మించుకునేందుకుకూడా అది అవసరంఔతున్నది. ఉదాహరణకు : భర్తృపీడితయైన స్త్రీ, అథవా ఒక విధవరాలు వేరుగా అర్థోపార్జనకు మార్గం వెతుక్కుంటుందిగా !

జ : వెతుక్కుంటుంది. అక్కడ నేను చెప్పవలసిందేముంది ? కాని అర్థోపార్జనచేసి జీవిస్తూ ఉపయోగపడుతున్నామని అనుకుంటూన్న కొందరు వితంతువులున్నారు; సభర్తృకలూ ఉన్నారు. పీడితులు కానివారూ, తమ పీడకు కారణం తాము కాదన్నట్టు ఆదోషాన్ని ఇతర్ల మీద ఆరోపించలేనివారూ స్త్రీలుగాని, పురుషులుగాని ఇప్పుడెవరూలేరు. వారికందరకూ ఒక్కటే ఉపాయం ఉందని భావించవచ్చు : అదేమిటంటే—వారు సూటిగా డబ్బునే దృష్టిలోపెట్టుకొని శ్రమ అమ్ముకుంటూపోవటం. ఈ సందర్భంలో నేను చెప్పదలచుకున్నదేమంటే : స్త్రీలు శ్రమకుబదులు శరీరం అమ్ముకోటం మొదలుపెడతారు. అందులోమాత్రం దోషం ఏముందనీ ? ఏదో ఒకటి

అమ్మేకదా డబ్బు సంపాదించ గలిగేది? డబ్బుకు ప్రాధాన్యం ఇవ్వడం అంటే తప్పనిసరిగా అమ్మకాలకు ప్రాధాన్యం ఇవ్వడం అన్నమాటే. డబ్బుకు మహత్వం పెరిగిపోయేకొద్దీ ప్రతి స్త్రీకి నిమంత్రణ లభిస్తూ ఉంటుంది. ఆమె ఇక స్త్రీకాదు; వేశ్య అయిపోతుంది. ఈ విధంగా అర్థ సభ్యతయొక్క ఫలము, బలము భ్రష్టాచారమే. డబ్బు అవసరమాయె, అదే లేదాయె; కాబట్టి ఏదో ఒకటి ఎందుకు అమ్ముకోకూడదు? ఇదీ నీ తర్కం. 'నీ' అంటే పరిస్థితి సూచించే తర్కం అనుకో. ఈ నాటి పరిస్థితులు నిజంగా జీవితాన్ని మిక్కిలిగా గాయపెడుతున్నాయి; ఔను, ఒప్పుకుంటాను. పరిస్థితులు సూచించే తర్కమే ప్రధానమైనదీ సవ్యమైనదీ అయితే, ఇక ప్రతిదీ సవ్యమే, సముచితమే ఎందుకు కాదు? కాని నేనుమాత్రం అది ఒప్పుకోను. పరిస్థితికి మనం బానిసలం కావాలా లేక దాన్ని మన బానిసగా చేసుకోవాలా? కాబట్టి పరిస్థితులవల్ల ఏర్పడే వివశత్వానికి ఎన్నడు నేను ప్రాధాన్యం ఇవ్వలేను. వ్యక్తియొక్క సంకల్పశక్తినే నేను సమున్నత స్థానంలో నిలుపుతాను. నేను ఆశావాదిని. ఆశ అనేది పరిస్థితిలోనుంచి మనకు లభించేందుకు అక్కడ రంధ్రం ఏదీలేదు; నిజమే; కానైతే దాని నివాసం మనసులో; దాని ఉద్గమం మనసులోనుంచి. ఆ మనసు మనలో సదా విద్యమానమై ఉన్నది. ఎందుకైనా డబ్బే మార్గం అని తలపోయటం మానవత్వంలోనూ, మానవుని సామర్థ్యంలోనూ విశ్వాసం లేకపోవటమే. డబ్బుసంపాదనకోసం కన్నతల్లి ఆఫీసుకు వెళ్ళటం, డబ్బుసంపాదించుకునేందుకే దాయమ్మ వచ్చి పరాయిబిడ్డకు తన పాలివ్వటం—ఇటువంటి వ్యవస్థలు నాకు నచ్చవు. డబ్బుసంపాదించుకురావాలన్న ఆకాంక్షే ఇద్దరుతల్లుల మాతృత్వాన్ని వాళ్ళలోనుంచి బైటికిలాగి, ఆ రెంటినీ అమ్మకపువస్తువులక్రింద తయారుచేసింది. పిల్లలు ఏదో పెరుగుతూఉంటారు; కాని ప్రేమపూర్ణమైన పోషణలోకాదు; కూలియిచ్చి కొనుక్కున్న పోషణలో. ఇంకొకలా చెప్పాలంటే—కొంతకొంతమంది—విజ్ఞానంద్వారాకూడా పెరుగుతూఉంటారు. ఇందుకా నేను ఈ వ్యవస్థకు, ఈ వ్యవస్థాపకులకు ధన్యవాదాలు అర్పించవలసింది?

ప్ర : ఇంతకూ నేను ఇందాక ఉదహరించినటువంటి స్త్రీకి ఉపాయం

ఏమీ చెప్పారుకాదు. శ్రమ అమ్ముకోటం హైన్యం అయితే ఇక ఆమె నిరాశ్రితయై చేసేదేమిటి?

జ: తోచిందేదో చేస్తుంది. శ్రమచెయ్యటం అలవాటులేకపోతే, అంతకుతప్ప మరేంచేసేందుకూ నేర్పులేని మనిషైతే—చేతనైనంతవరకే శ్రమఅమ్ముకున్నందువల్ల పొట్టకు పట్టెడు మెతుకులవరకుమాత్రం దొరకవచ్చు. కాని ఇతరఅవసరాలన్నీ గడవకపోవచ్చు. మాయింట్లో అంట్లుతోమే మనిషికి నెలకు రు. 10 లు ఇస్తాం. మొత్తంమీద ఆమె నాలుగు ఇళ్ళలో పనిచేస్తుంది. వస్తువులన్నీ ప్రియంగానేవున్న ఈ రోజుల్లో ఆ వచ్చే కూలిడబ్బులు ఆమెను బ్రతికించగలవో లేదో, ఎంతవరకు బ్రతికించగలుగుతాయో లెక్కవేసి తెలుసుకోవచ్చు. అప్పుడప్పుడు శ్రమ ఎక్కువైనందువల్ల, జ్వరం గట్ర వచ్చినందువల్ల, అడ్డంపడుతూంటుంది. ఆ రోజులకు నాగాలు కట్టి జీతండబ్బులు మినహాయించేస్తారు. అ విధవరాలికి ఒకరిద్దరు బిడ్డలుకూడా వుండవచ్చు. ఆవిడ నాలుగు అక్షరాలేమన్నా చదువుకున్నదీ, కాస్త మర్యాదగల కుటుంబానికి చెందినదీ అయితే ఏ బడిలోనో పిల్లలకు చదువుచెప్పే ఉద్యోగానికి నెలకు రూ. 30/- లకైనా సరే ఇష్టపడుతుందిగాని అంట్లుతోమేపనికి అంగీకరించదు. అప్పుడు పైన చెప్పిన పనిమనిషికిలాగ రు. 40 లు దొరకవు. ఈవిధంగా వ్యావహారిక సమస్యలన్నీ దేనికదిగానే వుంటాయి. ఒకదాని కొకదానికి పొంతన వుండదు. భిన్నభిన్నంగానే వుంటాయి. శ్రమతోపాటు తనువుకూడా అమ్ముకోటానికి సిద్ధమైతే, ఒకానొక వయస్సులో ఆశించినరీతిగా బ్రతుకు వెళ్ళదీసుకొనే అవకాశం ఉంటుంది. అమ్ముకోటం అంటే ఒక వ్యాపారం అన్నమాటే. వ్యాపారానికి దళారీలు అవసరం. అంటే మధ్యవర్తులన్నమాట. బజారులో వస్తువుకుగాని, వ్యక్తికిగాని విలువతెచ్చిపెట్టేవాళ్ళు బ్రోకర్లే అనవచ్చు. కాబట్టి తనువు అమ్ముకుంటూ బ్రతుకవలసినది స్త్రీ తానొక్కతే కాదు. తనకు బేరాలు కుదిరించిపెడుతూ, అన్నియేర్పాట్లూ చూస్తూవుండే ఆ బ్రోకరుగారి కుటుంబం గడవాలి. అతని వ్యాపారమూ సాగాలి. రూపాయలో పన్నెండణాలు అందుకోసంగాను అటే వెళ్ళిపోతాయి. ఇకపోతే మిగిలిన నాలుగణాలుమాత్రం....తనువు అమ్ముకుంటూన్న యజమానురాలి

చేతికి దక్కుతాయి. ఎవరెవరికి ఎంతెంత భాగం చెందుతున్నదీ సరైన లెక్క కావాలంటే—ఆ వ్యాపారంలో విశేషానుభవంగలవారిద్వారా తెలుస్తుంది. ఇంతకూ విషయం ఏమిటంటే—బ్రతుకుగడుపుకోటానికి శ్రమో, ఏదో అమ్ముకోటం ఒక మార్గంగా కనిపించినప్పటికీ అదైనా తిన్ననైనదీ, సుగమమైనదీ నిష్కంటకమైనదీ కాదు. ఇకపోతే 'సేవాస్నేహములద్వారా అంతమాత్రం దారికూడా కన్పించకపోతే ఏంచేయాలి మరి?' అనికదూ నీవడిగేది? అందుకు నేను చెప్పేదేమంటే—సరే, ఆదిశలో ఒకదారి వెతుక్కుందామన్న ప్రయత్నం ఆఖరు అయిపోయినప్పుడు—అనగా భక్తి శ్రద్ధలు సంపూర్ణంగా అభావం అయినతరువాత—ఇక నప్పుడు అమ్ముకుని, పొట్టపోసుకునే ప్రయత్నంచేసి చూడవచ్చు. అందువల్ల బహుశా కొంత వరకు పొట్ట నింపవచ్చు; కాని సమస్య చిక్కు విడదు; పైగా మరింత జటిలం ఔతుంది. వ్యక్తిగతసమస్యయైనా అంతే; సామాజికసమస్యయైనా అంతే.

ప్ర : వివశతాప్రేరితయైన ఒకానొకస్త్రీ శ్రమ అమ్ముకుని జీవించటం అన్న సమస్యను వేశ్యావృత్తిలోని నికృష్టతవరకూ తీసుకువెడతారేమండీ? ఆఖరుకు పురుషుడుకూడా శ్రమను అమ్ముకునే జీవికను ఏర్పాటుచేసుకుంటున్నాడు కదా?

జ : అంటే—పురుషుడుచేస్తున్నట్టుగానే స్త్రీకూడా అమ్మకపువ్యాపారంలోకి దిగితే ఆమె వేశ్యయనీ, నికృష్టురాలనీ ఎందుకనుకోవాలి?—అని కూడా ఊహింపవచ్చు; నీ ప్రశ్నలోని భావం? నేనుమాత్రం వేశ్యను నికృష్టురాలికింద కట్టేసి ఊరుకోలేను. నా మాటల్లో నికృష్టశబ్దం ఉపయోగించివుంటే చెప్పు.

ప్ర : కాని శ్రమ అమ్ముకుని జీవించవలసిన స్త్రీపట్ల మీరు వెలువరించిన భావం—వేశ్యయెడల సమాజం కనబరచే దృష్టివంటిదే కదా?

జ : ఔను. అమ్ముకొనటమే సమాజనీతి, జీవననీతి అయేట్టయితే నేను దాన్ని అంగీకరించలేను. దాన్ని విరసించేందుకు నేను వెనుదీయను. అటువంటి అమ్మకాలనీతికి చిహ్నమే వేశ్యాసంస్థ; కాని ఆ సంస్థ సమా

జంలో ప్రచలితమైయున్న జీవితపు విలువనుకూడ ద్యోతకం చేస్తుంది. అర్థాత్తూ అక్కడ మనం నిరసించవలసింది వేశ్యగా అయిన ఆ స్త్రీని కాదు; మనందరినీను ; స్త్రీని రూపం అమ్ముకుని జీవించవలసినస్థితికి తీసుకుని వచ్చిన మొత్తం సమాజాన్ని ! ! జీవితపువిలువల్ని డబ్బే నిర్ణయిస్తున్నంత కాలమూ వేశ్య ఉండనేఉంటుంది. వేశ్య బయటికి కనిపించే రోగలక్షణం; రోగనిదానం లోపల ఎక్కడో వుంది. భోగానికి ఉపయుక్తమై ఆడుది వ్యక్తిత్వాన్ని కోల్పోయి, ఒక వస్తువుగామాత్రమే తయారౌతుంది. ఈ ఆటను ఆడించేది డబ్బు. చైతన్యాన్ని గడ్డకట్టించేసి స్త్రీని ఒక పణ్యపదార్థంగా మార్చివేస్తున్నది డబ్బు. కనుకనే ఆత్మసాధకులు, అనగా పూర్ణచైతన్యాన్ని సాధింపగోరువారు మొట్టమొదట డబ్బును విసర్జించటంతోనే తమ సాధనను ఆరంభించేస్తారు. ప్రధానంగా డబ్బునే దృష్టిలోపెట్టుకుని సాగే మానవసంబంధాలు కృత్రిమములు కాకుండాఉండవు. అటువంటి సంబంధాల్లో ఒకడు వేటకాడు; మరొకడు వేటమృగము అయితీరవలసిందే. వాటిలో భోగభావబీజాలు అంకురించి, విజృంభించి తీరుతవి. వాటిని అడ్డగించటం ఎవరికీ సాధ్యంకాదు.

ప్ర : ఈ నాడు డబ్బు ఒక భీషణరూపందాల్చి సమాజాన్ని గ్రసించివేస్తున్నది. ఈ రోగానికి చికిత్స జరగనంతకాలమూ పావం స్త్రీ ఎల తప్పించుకుని బయటపడగలదు ?

జ : ఔను. ఒంటరిగా స్త్రీ ఎలా తప్పించుకుని బైటపడగలదు ? ఆమె తప్పించుకోజాలదు. ఆమెతోపాటు పురుషుడుకూడ తప్పించుకోవాలి. కాబట్టి ఇది స్త్రీపురుషుల ప్రకృతితత్త్వాలకు సంబంధించిన సమస్య కాదు; వారి పరస్పరసంబంధాలకు పరిమితమైన సమస్యాకాదు; అది ఇంచుమించు బౌద్ధికసమస్య. కాని బహుశా ఈ సమస్యను యావత్తూ ఇప్పుడే గ్రహించి పరిష్కరించుకోవలసిన ఆవశ్యకతను నీవు గుర్తించవు.